# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౬.]     [మార్చి 1933]     [సంచిక ౧.



# GRIHALAKSHMI

## TELUGU ILLUSTRATED
## LADIES' MAGAZINE

*Editor:*
Dr. K. N. KESARI

**March 1933**



**Vol. VI** **No. 1**

# విషయసూచిక

# గృహలక్ష్మి ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివు ఆఫ్ న్యూస్ |
| మచిలీపట్టణము: | సి. వి. అవధాన్లు, ఇన్సూరెన్సుబీరో. |
| ,, | పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడ్డు.(మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియా రూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాటిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు. |
| రాజమండ్రి: | ఏ. కృష్ణమూర్తి బ్రదర్సు, న్యూస్‌ఏజంట్సు. |
| తాడేపల్లిగూడెం: | కాశిరాజు శ్రీరాములుగారు. |
| జెమ్‌షెడ్‌పూర్: | టి.వి. రమణయ్యగారు, C/o దిఇండియన్‌హ్యూమ్‌పైప్‌కంపెనీ, లిమిటెడ్. |
| బరంపురం: | మారెళ్లబ్రదర్సు. |
| గుంటూరు: | వెల్‌కం అండు కంపెని. |
| ఏలూరు: | సనకా రాజారావుగారు, పవరుపేట. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| అనకాపల్లి: | గ్రంధి కన్నయ్యపంతులుగారు, గాంధిమార్కెటు. |
| విజయనగరం: | కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి. |
| పిఠాపురం: | యెం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం. |
| ,, | ఎం. నూకరాజు, ఆంధ్రన్యూస్‌ఏజన్సీ. |
| విశాఖపట్టణం: | అందే కృష్ణమూర్తి బ్రదర్సు, బుక్‌సెల్లర్సు. |
| మదరాసు: | వై. టి. ఎస్. నారాయణశాస్త్రిగారు, 364 ఎస్ప్లనేడు. |
| ,, | ఆకుండి వేంకటశాస్త్రిగారు. |
| ,, | పి. గిరిరాజా రావుగారు. |
| నెల్లూరు: | భట్టారం లక్ష్మీనారాయణ శర్మగారు, గాంధిచౌకు. |
| తణుకు: | వడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు. |
| బెజవాడ: | ఆంధ్రాఇన్‌డస్ట్రియల్‌స్టోర్సు. |
| అనంతపురము: | శ్రీగోపాలకృష్ణ అండ్ కంపెని, జనరల్‌మర్చెంట్సు. |
| పాలకొల్లు: | లొల్లా వెంకటరావుగారు. |
| నరసాపురము: | కటికల సూర్యారావుగారు. |
| భీమవరము: | అమిరపు శేషాచలశర్మగారు. |
| కాకినాడ: | ప్రభాతట్రేడింగుకంపెనీ, మర్చెంట్సు అండ్ ఏజెంట్సు. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను, వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

| ఫసలీ తేది | సౌరతేదీ. | వారము. | తిథి. | నక్షత్రము. | యోగము. | కరణము. | వర్జ్యము. | అహస్సు | భుక్తి. | విశేషములు. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 27 | 14 | సోమ | శు. ప్రతి 5-20 | రేవ 28-25 | ఐంద్ర 42-14 | బవ 5-20 | శే. త్యా 0-55 | 30-12 | 1-54 | చంద్రోదయఃదక్షిణశృంగః |
| 28 | 15 | మంగ | ద్వితీ 8-6 | అశ్వి 33-1 | వైధృ 42-14 | కౌల 8-6 | దివ 22-15<br>రాత్రి 29-0 | | 2-2 | |
| | ,, | ,, | ,, | | | | | | | |
| 29 | 16 | బుధ | తృతీ 11-56 | భర 38-34 | విష్కం 42-58 | గర 11-56 | శే. త్యా 3-36 | | 2-10 | ఉత్తమమన్వాదిః |
| 30 | 17 | గురు | చతు 16-37 | కృత్తి 44-45 | ప్రీతి 44-12 | భద్ర 16-37 | దివ 11-39 | 30-20 | 2-18 | పంచమీతిథిః |
| 31 | 18 | శుక్ర | పంచ 21-44 | రోహి 51-23 | ఆయు 45-43 | బాల 21-44 | దివ 29-10 | | 2-26 | శూన్యతిథిః |
| 1 (ఏప్రిల్ 1933) | 19 | శని | షష్ఠి 27-5 | మృగ 57-49 | సౌభా 47-8 | తైతు 27-5 | దివ 6-53 | | 2-34 | |
| 2 | 20 | ఆది | సప్త 31-57 | ఆర్ద్రా 60-0 | శోభ 48-12 | వణి 31-57 | దివ 20-50 | 30-27 | 2-42 | |
| 3 | 21 | సోమ | అష్ట 36-4 | ఆర్ద్రా 3-44 | అతి 48-41 | భద్ర 4-0 | రాత్రి 5-51 | | 2-50 | అనధ్యాయః |
| 4 | 22 | మంగ | నవ 39-14 | పున 8-49 | సుక 48-21 | బాల 7-39 | దివ 30-9 | | 2-58 | |
| 5 | 23 | బుధ | దశ 41-8 | పుష్య 12-49 | ధృతి 47-6 | తైతు 10-11 | రాత్రి 15-59 | | 3-6 | |
| 6 | 24 | గురు | ఏకా 41-50 | ఆశ్రే 15-36 | శూల 44-50 | వణి 11-29 | రాత్రి 15-55 | 30-36 | 3-14 | |
| 7 | 25 | శుక్ర | ద్వాద 41-13 | మఖ 17-8 | గండ 41-33 | బవ 11-31 | రాత్రి 6-38 | | 3-22 | |
| 8 | 26 | శని | త్రయో 39-22 | పూఫ 17-21 | వృద్ధి 37-21 | కౌల 10-18 | రాత్రి 5-2 | | 3-30 | |
| 9 | 27 | ఆది | చతు 36-28 | ఉఫ 16-41 | ధృవ 32-19 | గర 7-55 | రాత్రి 6-25 | 30-43 | 3-38 | అనధ్యయనత్రయం |
| 10 | 28 | సోమ | పూర్ణి 32-35 | హస్త 14-52 | వ్యాఘా 26-25 | భద్ర 4-31 | రాత్రి 3-16 | | 3-46 | అన్వాధానం రౌచ్యకమన్వాదిః |
| 11 | 29 (మేషం.) | మంగ | కృ. ప్ర 27-52 | చిత్రా 12-14 | హర్ష 19-54 | కౌల 27-52 | దివ 25-27 | | 3-54 | ప్రతిపత్తిథిః ఇష్టిః |
| 12 | 30 | బుధ | ద్వితి 22-32 | స్వాతి 8-54 | వజ్ర 12-47 | గర 22-32 | దివ 22-1 | | 4-2 | తిథిద్వయం |
| 13 | 1 | గురు | తృతి 16-47 | విశా 5-6 | సిద్ధి 5-25<br>వ్యతీ 57-45 | భద్ర 16-47 | దివ 14-21 | 30-53 | 4-8 | చతుర్థీతిథిః |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 14 | 2 | శుక్ర | చతు 10-46 | అనూ 1-1<br>జ్యేష్ఠ 56-40 | వరీ 50-0 | బాల 610-4 | దివి 14-1 | | 0-7 | పంచమీతిథిః |
| 15 | 3 | శని | పంచ 4-42<br>షష్ఠి 58-49 | మూల 52-51 | పరి 42-24 | తైతు 4-42 | దివి 15-29<br>రాత్రి 18-13 | | 0-15 | అవమా |
| 16 | 4 | ఆది | సప్త 53-17 | పూషా 49-12 | శివ 34-58 | భద్ర 26-30 | దివి 15-22 | 31-0 | 0-22 | |
| 17 | 5 | సోమ | అష్ట 48-21 | ఉషా 46-5 | సిద్ధి 28-4 | బాల 20-49 | దివి 8-10<br>రాత్రి 24-40 | | 0-30 | అనధ్యాయః |
| 18 | 6 | మంగ | నవ 44-7 | శ్రవ 43-40 | సాధ్య 21-40 | తైతు 16-14 | రాత్రి 22-22 | | 0-37 | |
| 19 | 7 | బుధ | దశ 40-49 | ధని 42-11 | శుభ 15-54 | వణి 12-28 | త్యాజ్యాభావః | | 0-45 | |
| 20 | 8 | గురు | ఏకా 38-32 | శత 41-41 | శుభ్ర 10-59 | బవ 9-10 | దివి 0-2<br>రాత్రి 26-46 | 31-6 | 0-53 | సర్వేషామేకాదశీ |
| 21 | | | | | | | | | | |
| 22 | 9 | శుక్ర | ద్వాద 37-27 | పూ.భా 42-23 | బ్రహ్మ 6-56 | కౌల 7-30 | శే. త్యా 1-55 | 31-11 | 1-1 | |
| 23 | 10 | శని | త్రయో 37-37 | ఉ. భా 44-20 | ఐంద్ర 3-53 | గర 7-27 | దివి 7-10 | | 1-9 | |
| 24 | 11 | ఆది | చతు 39-1 | రేవ 47-30 | వైధృ 1-49 | భద్ర 8-19 | దివి 15-55 | 31-16 | 1-17 | మాసశివరాత్రిః |
| | 12 | సోమ | అమా 42-44 | ఆశ్వి 51-53 | విష్కం 0-45 | చతు 10-22 | రాత్రి 10-3 | | 1-24 | అన్వాధానంపిండపితృయజ్ఞః |

## వ్రతాది

| | | | | |
|---|---|---|---|---|
| 27 | శు. | 1 | మంగ॥ | చాంద్రసంవత్సరాదిః తైలాభ్యంగస్నానం నింబకుసుమ భక్షణం వసంతనవరాత్రారంభః శ్వేతవరాహకల్పాదిః |
| 28 | ,, | 2 | బుధ॥ | ఉమాశివాగ్ని పూజా |
| 29 | ,, | 3 | గురు॥ | ఆందోళన తృతీయా సౌభాగ్య॥ మాసగౌరీవ్రతం |
| 30 | ,, | 4 | శుక్ర॥ | లక్ష్మీగణపతి వ్రతం |
| 31 | ,, | 5 | శని॥ | మత్స్యజయంతిః నాగపూజా లక్ష్మీపంచమీ |
| 1 | ,, | 6 | ఆది॥ | స్కందపూజా |
| 3 | ,, | 7 | సోమ॥ | సూర్యపూజా భానుసప్తమీ |
| 2 | ,, | 8 | మంగ॥ | భవాన్యుత్పత్తిః అశోకాష్టమీ |
| 4 | ,, | 9 | బుధ॥ | శ్రీరామనవమీ |

| | | | | |
|---|---|---|---|---|
| 5 | శు. | 10 | బుధ॥ | ధర్మరాజదశమీ షడశీతిః 5 |
| 6 | ,, | 11 | గురు॥ | ఏకాదశీ గురువారవ్రతం డోలోత్సవః |
| 7 | ,, | 12 | శుక్ర॥ | వామనద్వాదశీ |
| 8 | ,, | 13 | శని॥ | అనంగత్రయోదశీ శనిత్రయోదశీ |
| 10 | ,, | 15 | సోమ॥ | శ్రీణాంచంద్రదర్శనం రౌచ్యకమన్వాదిః ఇంద్రపూజా దమనపూజా |
| 13 | బ. | 3 | గురు॥ | సౌర సంవత్సరాదిః విషువత్పుణ్యకాలః |
| 15 | ,, | 13 | శని॥ | మహావారుణీ శనిత్రయోదశీ |
| 16 | ,, | 14 | ఆది॥ | మాసశివరాత్రిః శివసన్నిధౌస్నానం |
| 17 | ,, | 30 | సోమ॥ | అమా సోమవారవ్రతం. |











# ఆశీర్వచనము

విద్వాన్
వారణాసి సూర్యనారాయణశాస్త్రిగారు

ప్రతిపదాదిగ వాసరపంచకంబు
కడచి వర్ధిల్లు శశిరేఖ కరణి నైదు
కడచి యాఱేండ్లప్రాయపుఁగలిమి మిగిలి
పరగు గృహలక్ష్మి! యక్షీణవైభవమున.













# పిఠాపురముమహారాణీగారితో ఒకగంటకాలక్షేపము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురమహారాజ్ఞీమణి యిహలోకమునుబాసిన ఫిబ్రవరి 12.వతేదీ ఆంధ్రమహిళాప్రపంచమున కొకదుర్దినము. స్వర్గీయ మహారాణీగారినిగూర్చి విశేషించి వ్రాయుటకు వారితో నాకుగల్గినపరిచయభాగ్యం అత్యల్పం. కాని వారిసౌహార్దమును తెలుసుకొనుటకు ఆగంటయే చాలునని నాఊహ.

గత నవంబరునెలలో రాజమండ్రిలోజరిగిన ఆంధ్రరాష్ట్రీయమహిళాసభకు వెళ్లినప్పుడు ఆసభనిమిత్తమేవచ్చిన శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారినిచూచి మాట్లాడిన సందర్భములో శ్రీమహారాణీగారు వారిపురమునందుగల స్త్రీసమాజవార్షికోత్సవసందర్భమునను, తదితరసందర్భములను నాకు ఆహ్వానపత్రికలంపుట, ప్రత్యేకముగా జాబులు వ్రాయించుట మొదలగువిషయములు జ్ఞాపకంవచ్చి యింతదాపునకు వచ్చాముగనుక ఒకమారు పిఠాపురంవెళ్లి మహారాణీగారిని చూచివద్దాముఅనేఊహ తలవనితలంపుగా గలిగింది. నాఉద్దేశ్యం శ్రీసీతమ్మగారికి విన్నవించాను. "తప్పకరండి; మహారాణీగారుగూడ మిమ్ము చూడాలని చాలామార్లుఅన్నారు; ఇప్పుడు ఊరిలోనేఉన్నారు; యింకాకొన్నాళ్లుపోతే చెన్నపట్నంవెళ్లుతారు; కనుక యిప్పుడే రాండి;" అని ఉత్సాహంతోఅన్నారు. సరే వెల్లుండి వస్తాము అన్నాను నేను. అనుకున్నప్రకారం 15-11-32 ఉదయం మెయిలులో రాజమండ్రి నుంచి పిఠాపురంవెళ్ళాము నాప్రియమిత్రురాలొకామెయూ, నేనున్నూ. రైలుదిగేటప్పటికి సిద్ధంగావున్నారు శ్రీమతి సీతమ్మగారు. నిరంతరం కాసామయంచే బాధపడుతున్నప్పటికీ, జరాభారం పైకొని క్రుంగదీస్తున్నప్పటికీ దేశసేవాసక్తిమాత్రం జరావ్యాధులనుజయించి తన పనిని తానుచేస్తునేఉన్నది శ్రీ సీతమ్మగారిలో. నిరంతరకార్యశీలుడై, దేశహితైకపరాయణుడై, స్త్రీజనోద్ధారకుడై వెలసిన శ్రీ వీరేశలింగముపంతులువారి ఛాత్రిణియైన శ్రీ సీతమ్మగారి కట్టిసేవాపరాయణత ఉండడం సహజమేగదా. శ్రీ సీతమ్మగారిగృహమున మేము యెటువంటి ఆదరసత్కారములుపొందామో వివరింపలేము. మేము వెళ్లినదిమొదలు శ్రీ మహారాణీవారు స్థాపించినపాఠశాలలు, నెలకొల్పినశరణాలయములు, పోషింపబడుచున్నదీనులు మున్నగు విశేషాలెన్నో శ్రీ సీతమ్మగారివల్ల వినుచునేఉంటిమి. భోజనాలైనతరువాత, శ్రీ మహారాణీ వారు పెట్టించిన ఘోషాస్కూలు, స్త్రీలక్లబ్బు చూచాము. ఘోషాస్కూలుకు విద్యార్థినులను తీసికొనిపోవుటకు దివాణంవారిబండ్లు నిత్యం ఉచితంగా యింటింటికివచ్చునట. మేము గూడా వాటిలో ఒకదానియందెక్కి స్కూలుచూడడానికి వెళ్ళాము.

దాదాపు నాలుగున్నరగంటలసమయం శ్రీ మహారాణీగారిని యితరులు సందర్శించు సమయమట. సరిగా ఆవేళకు సీతమ్మగారు మమ్ములను అక్కడకు తీసుకొనివెళ్ళారు. మా

రాక విని శ్రీమహారాణీగారు "నేనూ మీరాకకే యెదురుచూస్తున్నాను" అంటూ చేతులు జోడించి నమస్కరిస్తూ వెలుపలకువచ్చారు. అతిసాధారణమైన వస్తువులు, వస్త్రములు మాత్రమేధరించి చేత నేదియోయుద్ధగ్రంథమునుమాత్రము పట్టుకొనిఉన్న శ్రీమహారాణీగారి సౌమ్యాకృతి మాహృదయాలను సులభంగా చూరగొన్నది. వెంటనేవారు మమ్ములను తమ గృహారామంలో చక్కనినునుపైనరాళ్లుపరచిఉన్న ఒకతిన్నెవద్దకుగొనిపోయిరి. చక్కని ఆసాయాహ్నసమయంలో ప్రశాంతమైన ఆప్రదేశమందు మహారాణీవారు మమ్ము ముందుగా కూర్చుండజేసి తామును కూర్చుండిరి. పరస్పరపరిచయమునిమిత్తం మాకుజరిగినసంభాషణ అత్యల్పము. మమ్ముచూచినదిమొదలు శ్రీమహారాణీగారు చిరపరిచయయగుమిత్రురాలివలె ఎంతోప్రేమతో, ఎంతోసంతోషంతో, ఎంతోఆదరంతో మాట్లాడడానికిపూనుకొన్నారు. ఆంధ్రరాష్ట్రీయమహిళాసభ అప్పుడే జరిగిఉండటంచేతనూ, మేము ఆసభాప్రతినిధులమే అగుటచేతనూ నాటిమాప్రసంగంగూడ చాలవరకు మహిళాసభతీర్మానాలనుగూర్చినదిగానే ఉండెను. ఆనాటి ఆంధ్రపత్రికలో మహిళాసభవారి విద్యావిషయకతీర్మానాలు ప్రచురింపబడి ఉండెను. శ్రీమహారాణీగారు ఆతీర్మానాలను నాచేతజదివించి ప్రతితీర్మానాన్నిగురించీ ఈ తీర్మానం యెందుకుచేశారు తల్లీ! వీటిప్రయోజనమేమిటమ్మా! వీనినిగూర్చి మీఉద్దేశ్య మేమిటితల్లీ!అని అతినమ్రభావంతో అడుగజొచ్చిరి. కాని వాటినిగూర్చి మేమిచ్చినఅభిప్రాయాలు అత్యల్పంగానూ, శ్రీమహారాణీగారిచ్చిన అభిప్రాయాలు బహుళంగానూఉండెను. ప్రతివిషయంలోను పాశ్చాత్యస్త్రీలను అనుకరింపవలెనని మనదేశస్త్రీలు పడుచున్న ఉబలాటమునకు మహారాణీగారు చాలనొచ్చుకొనిరి. సీమలో తాముచూచివచ్చినవిశేషాలు, నడవళ్లు, ఆచారాలు మహారాణీగారు వివరించి మనహిందూమతాచారములప్రాశస్త్యమును ఉగ్గడించిరి. ముఖ్యంగా విడాకులచట్టంకావలెనని మనదేశపుస్త్రీలుచేయుచున్న ఆందోళన విషయం ప్రస్తావించి ఈచట్టంవచ్చినట్లయితే మనస్త్రీలకేదో లాభంవస్తుందని మనవాళ్లు భ్రమపడుతున్నారుగాని ఈచట్టమేవస్తే యిది స్త్రీలకుకంటె పురుషులకే లాభకరమనీ, పురుషుడి కిప్పుడు భార్య వదులుకుందామన్నా వదులుకోరానిబంధముగాఉందనీ, వదిలిపెట్టితే భరణంయివ్వవలసివస్తున్నదనీ, సామాన్యకుటుంబాల్లో యిది సామాన్యంగానేఉన్నా గొప్పగొప్ప సంపన్నకుటుంబాల్లోనూ జమీందారీకుటుంబాల్లోనూ యీభరణమిచ్చేపద్ధతి పెద్దప్రతిబంధకంగానే ఉన్నదనీ, యీవిడాకులచట్టమే వచ్చినట్లయితే భరణమిచ్చేబాధలేకుండా భార్యను పరిత్యజించి సులభంగా మఱొకభార్యనుచేసుకోవచ్చునని చాలామంది అభిప్రాయపడుతున్నారనీ, కాబట్టి దీనికి పురుషులు ప్రతికూలురుకారు మనస్త్రీలే ప్రతికూలురగుట అవసరమనీ, మహారాజ్ఞీగారు పల్కిరి. పవిత్రమైనహిందూమతమున కిది కళంకమనీ, పతివ్రతలకు ప్రసిద్ధమైనభారతభూమిలో యిట్టిచట్టాలుకోరడం సమంజసంగాదనీ, ఈచట్టం అమలులో ఉన్న పాశ్చాత్యదేశాల్లోగూడ నిది గౌరవమైనదిగా భావింపబడుటలేదనీ శ్రీ మహారాజ్ఞీగా

రనిరి. అస్పృశ్యతనుగూర్చిగూడ మహారాణీగారుప్రస్తావించి దీనులైనపంచములు సర్వవిధముల ఉద్ధరింపదగినవారేఅయిననూ దేవాలయప్రవేశాందోళనచేత దేవాలయపరిపాలనాసౌష్ఠవానికి భంగముకలుగుతుందేమోనని ఇంచుకశంకించిరి. ఈమాటలన్నీ ఒకక్రమంగా వరుసగా జరిగినవిగావు. నడుమనడుమ యెన్నోవిషయాలు వస్తూఉండెను. ఎందఱో మహనీయులప్రశంస వస్తూఉండెను. భగవంతునిప్రశంసా, పెద్దలప్రశంసా వచ్చినపుడెల్ల మహారాజ్ఞీగారు భక్తివినమ్రులై చేతులుజోడిస్తూఉండిరి. ఈసంభాషణలో ఒకమాఱు స్వీయప్రశంసరాగా,

"తెలివియొకింతలేనియెడఁ దృప్తుఁడనై కరిభంగి సర్వమున్
దెలిసితినంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి; యిప్పుడు
జ్వలమతులైనపండితులసన్నిధి నించుకబోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగితిం గతమయ్యె నితాంతగర్వమున్."

అను భర్తృహరిసుభాషితమును సీతమ్మగారిచే చదివించుకొని నాకు ఎప్పుడూ ఈపద్యం జ్ఞాపకంవస్తూఉంటుందనిరి. శ్రీమహారాణీగారినిదర్శించుటకుముందు శ్రీసీతమ్మగారితో 'శ్రీమహారాణీగారు చాలాచదువుకున్నవారని విన్నాను' అని నేననగా 'మహారాణీగారికి బి.ఏ. చదివినవారికున్నంత పాండిత్యవిశేషంకలదని వారికి విద్యాగురువులుగావున్న కమలా సత్యనాథంగారే ఒకమాఱు నాతో ప్రస్తావవశంగా అన్నారండీ' అని శ్రీసీతమ్మగారనిరి. శ్రీమహారాణీగారితో సంభాషించినతరువాత శ్రీరాజ్ఞీగారు మేము అనుకొన్నదానికంటె అధికవిద్యావతి అనేకాకుండ వారొక జ్ఞానభాండారమని నాకు తోచెను. మఱియు ఐహికవిద్యయందే కాకుండా పారమార్థికవిద్యయందును వారు మంచిఅనుభవంగలవారనిగూడా విశదమాయెను. శ్రీమహారాణీగారు మాతో మాటలాడిన ఆకొలదిసమయంలోనే ప్రాచ్యప్రతీచ్య దేశాలలోని మతసంఘరాజకీయార్థికవిద్యావిషయకాదిసమస్తవిషయాలను పరిశీలనలోనికి దెచ్చిరి. అందలి మంచిచెడ్డలను వివరిస్తూఉండిరి. వారిమాటలనుబట్టి హిందుమతమునందు వారికి గాఢాభిమానముగలదని వ్యక్తమగుచుండెను.

శ్రీరాణీగారితో ఎంతసేపుమాట్లాడినను యింకా మాట్లాడవలెననీ, వారి హృదయాగారంలో రాసులై ప్రోవులుపడిఉండి వాక్యరూపేణ అనంతకాంతులతో వెలువడుచున్న అమూల్యజ్ఞానరత్నాలను చేతజిక్కించుకోవలెననీ కుతూహలంగానేఉండెను. కాని, అప్పటికే చాలా చీకటిపడెను. మేము రైలుకు వెళ్లవలసిఉన్నదంటిమి. ఆకారణంచేత శ్రీరాజ్ఞీగారు తొందరగా సంభాషణముగించి వారిభవనములోనికి గొనిపోయిరి. తమకొమార్తెలను, కోడలుగారిని చూపిరి. అచ్చట కొన్ని భారతీయచిత్రకారులపటములుండగా వాటిని చూపిరి. ఒకచోట మాళవికాగ్నిమిత్రమను సంస్కృతనాటకము చిత్రరూపమునుండగా దానిని ప్రత్యేకముగా జూపిరి. తరువాత వారి రాజప్రాసాదమంతయు చూపవలసిన

దని తమవద్ద సంస్కృతపండితురాలుగానున్న వారితో చెప్పి మమ్ము వారివెంటపంపిరి. ఆమెతోబాటు వెళ్లి ఆరాజమందిరమంతయు కొన్నినిమిషాల్లో తిలకించివచ్చి మహారాణీగారితో మఱికొంచెముసేపుప్రసంగించి వారిని వీడ్కొంటిమి.

ఆరాజప్రాసాదమంతటా యెన్నో విలువైన, వింతైన అపరూపపదార్థాలుండెను. కాని ఆమహత్తరామూల్యవస్తుసమితిలోకెల్లా మమ్ములను మిక్కిలిగాఆకర్షించిన దొక్కటేవస్తువు. అది భక్తిభావభరితమై, వినయవినమ్రమై, మందహాససుందరంబైన శ్రీమహారాణీగారి ముఖకమలం.

రాత్రి తొమ్మిదిగంటలవేళ పంచమబాలికలలాడ్జి చూచితిమి. శ్రీమహారాణీగారే వారికి అన్నవస్త్రాదులిచ్చి పోషించుచున్నారని వింటిని. అవిఅన్నీచూచినతరువాత శ్రీమహారాజుగారిపేరబరగు పెక్కుసంస్థాపనలలో శ్రీమహారాణీగారిప్రోత్సాహము అంతర్వాహినియై ప్రవహిస్తున్నట్లు నాకుతోచెను. శ్రీమహారాజ్ఞీగారి సౌశీల్యాదులను చూచినప్పుడు ప్రహ్లాదచరిత్రంలోని యీక్రిందిపద్యములు జ్ఞాపకంవచ్చినవి.

ఆకారజన్మవిద్యార్థవరిష్ఠుడై గర్వసంస్తంభసంగతుడు కాడు
వివిధమహానేకవిషయసంపన్నుడై పంచేంద్రియములచే పట్టువడడు
భవ్యవయోబలప్రాభవోపేతుడై కామదోషాదుల గ్రందుకొనడు
కామినీప్రముఖభోగము లెన్నిగలిగిన వ్యసనసంసక్తి [illegible]వంక బోడు

విశ్వమందుగన్న విన్నయర్థములందు
వస్తుదృష్టిచేసి వాంఛయిడడు
ధరణినాథ! దైత్యతనయుండు హరిపర
తంత్రుడై హతాన్యతంత్రు డగుచు.

సద్గుణంబులెల్ల సంఘంబులైవచ్చి
యసురరాజతనయునందు నిలిచి
పాసిచనవు విష్ణు బాయనివిధమున
నేడు దగిలియుండు నిర్మలాత్మ.

ప్రహ్లాదునిగూర్చి వర్ణింపబడ్డ యీగుణవిశేషాలన్నీ శ్రీమహారాణీగారివద్ద ఒప్పిఉన్నవి. ఇటువంటి సాధ్వీరత్నము, దీనపోషకురాలు, విదుషీరత్నమును కోల్పోవుట వారికుటుంబమునకూ, వారిబంధువర్గమునకూ, వారిఆశ్రితజనమునకేగాక యావదాంధ్రదేశమునకు గొప్ప దుఃఖకారణమనుట నిశ్చయము.

మేము పిఠాపురంవెళ్లినప్పుడు శ్రీమహారాణీగారు 'హిందూగృహము' అను పత్రికను స్థాపింపతలంచుచున్నారని, దానికి మీరుకూడా వ్యాసాలువ్రాస్తూఉండాలెననీ శ్రీసీతమ్మగారు చెప్పిరి. ఆపత్రిక ఎప్పుడోరాగలదని యెదురుచూస్తూఉంటిని. ఎదురుచూడని యీవార్త వినవచ్చి హృదయాన్ని భేదించింది.



# గృహలక్ష్మి

## స్వవిషయము

పోటున నిల్చి పగ్గములఁ బూని నిజప్రభుతావిశేషముల్
చాటునఁ బెట్టి పార్థునకు సారథియై పరసైన్యవార్ధులన్
దాటఁగ జేసి సత్యమును, ధర్మముఁ గాచినయట్టి సాధులో
కాటుఁడు, మీకుఁ, గృష్ణపరమాత్ముఁ డశేషసుఖంబు లిచ్చుతన్ ||

పసుమర్తి కృష్ణమూర్తి.

సర్వేశునికటాక్షమువలన, సాధ్వీమతల్లుల పరమాదరణచే, సజ్జనామోదకరులగు కవులయుఁ కవయిత్రులయు సహాయశక్తిసూక్తులకలిమిని 'గృహలక్ష్మి'కి ఐదేడులుగడచి యారవయే డారంభమయినదని తెలిసికొని మాపాఠకలోకమెల్ల పరమసంతోషమొందునని నమ్ముచున్నాము. మరియు, బిడ్డ యెదుగుచున్నకొలంది నామె నధికతరోత్కృష్టగతులఁ బెంచి నడిపించు బాధ్యతయు నెక్కువయే యగుచుండునుగదా! అందును, ఇట్టి పూర్వాపరసంధికాలములలో బాలికలను నడిపించుటయందు గలబాధ్యత కేవలానుభవైకవేద్యము. ఒకవంక పెద్దలపద్ధతుల జూపింపవలెను. వేరొకవంక ప్రస్తుతాచారపరిజ్ఞానముఁ గలిగింపవలెను. ఆవెనుక నీరెంటికిని సమాధానకరమగు నొకయపహూపపుఁబ్రకృతిని బాలికకుఁ గలిగింపవలెను. ఇట్టి కష్టకార్యము నిర్వహించి కృతార్థత నొందవలయుననియే, బాధ్యతగల తలిదండ్రు లనవరతయోచనలఁ జేయుచుందురు. వారిది భల్లూకపుఁబట్టు! ఇట్టి పట్టుగల తలిదండ్రులే భారతజాతీయతాపాదకులు. ఇట్టి మహనీయులచేతులలోఁ బెరుగుచున్న "గృహలక్ష్మిబాలిక" యుత్తరోత్తరకాలములయందుఁ దన గురుజనుల కెంతటికీర్తి దెచ్చునో తెలియునా !!!

నిరతయౌవనదంపతులారా! జ్ఞానామృతరసాస్వాదనముచే మీరు త్రిదశులుగదా! ఇట్టి మీరు, పెంచి పెద్దదానిఁగఁజేయుచున్న యీ"గృహలక్ష్మిబాలిక"కుఁగూడ, మీకుఁ బలె, నిర్జరత్వసిద్ధికలుగుట వింతగాదు.

ఇఁకఁ "ప్రమాదోధీమతామపి"యని యెఱింగియున్న యార్యులు, బాలికయగు గృహలక్ష్మియందున్న చిన్నిచిన్నిలోపములను సరకుసేయుదురా? చేయరు. అటులని యుదాసీనులును గారు ఒడిలో గూర్చుండఁబెట్టుకొని నెయ్యమును దియ్యమునుజూపి సవరింతురు. ఇది వారికి సాజముకాఁబట్టి యీ మనబాలిక యట్టివారినిఁజూచి చేతులఁజాచి చెంతకుఁ బరువిడునే కాని వెరచి వెనుకకు మరలదు. ఆర్యసత్కథావళి నవగతముసేసికొనియే యున్నదికదా !!

ఐనను అది చాలదని మాతలపు. ఇంకను ఎందరో యార్యులున్నారు.

కడిపెడు పిల్లలం గనుఁగొని, కాపురము నుచ్చస్థితికిఁ దెచ్చుకొని, సరివారిలో మరియాదలొంది, సాధుజనవంద్యలైనారు. ఈనాటి నాజూకులు వారికిఁ దెలియవు. వారిలోఁ జాలమందికిఁ జదువురాదు. అథవా వచ్చియున్నను, అది, యీనాటిచదువువంటిది కాదు. కేవల పురాణేతిహాసపరిజ్ఞానముకొఱకే పనికివచ్చునట్టిది. దానిసహాయమునునే వారు "చేయని సింగారము"లను, "మాయనిమడత"లను సంపాదించుకొన్నారు. ఇక వ్యవహార జ్ఞానమున, వారినాటిమినిస్టరులకు నెంతమాత్రమును దీసిపోరు. "ధరణిని సమస్తసస్యసముదాయఫలప్రదఁగా నొనర్చుచుఁ బ్రాగు మహానదులు నరుఁడెవండును జూడఁగరాని భూధర కుహరంబులందుఁ బొడమి యావల దేశములందుఁ బారుచుండు వరవున నాయిల్లాండ్రును పేళ్లు లేనిపల్లెటూళ్లలో బుట్టినను, మెట్టినచోటులందెల్ల వసుమతులై వాసిగాంచినారు.

పరమపావనములగునట్టి తదీయచరితములు గృహలక్ష్మి తానెఱిగి లోకమున కెఱిగింప వలసియేయున్నది.

"Full many a gem of purest ray serene
The dark unfathomed caves of ocean bear"

"రెక్కల నీసడించెడి మరీచుల దిక్కులఁ గ్రక్కురత్నముల్ |
లెక్కలమీరి సంద్రములలేవె మనుష్య దృక్పథంబులన్ ॥ దక్కి......"

అని యున్నదికదా! విశ్వతోముఖవ్యాప్తిగల మీవంటివారిసహాయము లేకున్ననట్టి రత్నములనుదెచ్చి లోకమునకుఁ జూపుట గృహలక్ష్మికి సాధ్యముకాదు గాక కాదనుట యథార్థము. కాఁబట్టి యావిషయమునఁ బూర్వానుభవముగల మీవంటివా రర్థితులగుట సాజము. మరియును "క్రొత్త వింత; పాత రోత" యను లోకసామాన్యోక్తి మీకపరిచితమునుగాదు.

అది యటులుండ నిఁకఁ గాలప్రవాహమునకు ముందుచూపేగాని వెనుకచూపులేదు. ఇట్టిదానితో నీగృహలక్ష్మి తన ప్రతిభాస్వభావమునుబట్టి, వెనుకకును ముందునకుఁగూడఁ జూచుచుఁ బరువులిడుచున్నది. ఇది యెంతకష్టమో చూడుడు! అడుగడుగునకును మీరు సహాయపడుచునే యున్నారు! ఆవిషయమున మీకెల్లరకు ధన్యవాదములు !!

అది యటుండ నింతవరకే వో జిలిబిలిపాటలఁ బాడుచుండిన మనబాలికకు నిఁకమీఁద వీలైనంతవరకు మంచిపద్ధతులతోఁ సంగీతమునందుఁ బ్రవేశమును గలిగింపవలయునుగదా! దానికై యుదారులగు గానకళాభిజ్ఞులసహాయ మత్యంతావశ్యకము.

చిత్రకళాభిరుచికిఁ బేరెన్నికఁగాంచియుండిన మనదేశ మిపుడావిద్యయందు మిక్కిలి వెనుకఁబడియున్నది. దానిని ముందుకుఁదెచ్చుటకై గృహలక్ష్మి ప్రథమయత్నములు సేయవలయును.

వెండియు, సంసారయాత్రయందు కేవలమును బురుషునియందే యర్థోపార్జనాభారమును బెట్టివైచుట గృహలక్ష్మికి సహ్యముకాదు. తా నింటనుండియే యెంతేనిఁ జేయవచ్చును. ఎన్ని పనులులేవు? చేయవలయునన్న నెన్నో యున్నవి! నిత్యావసరములగు స్వల్పవస్తువులకొరకుఁగూడ డబ్బిచ్చి యంగడికిఁ బంపుటయన్నఁ గష్టమేకదా! విస్తరంటకునుఁ బండ్లపొడికినిగూడఁ బజారులకుఁ బోవుటయన్న నెంతవ్యయమగునో యోచింపుఁడు!

ఇది, యది యని వివరింపనేల? తల్లులారా! దేశమోక్షము మీచేతనున్నదియనుట ముమ్మాటికి సత్యము. ఇటులనుటచే రాజకీయరంగప్రదేశములకు దిగవలయునని కాదు సుమండీ! దేశోద్ధరణకుఁగా నుద్దేశింపఁబడిన యనేకసాధనములలో నదియొకటి; కాని, అదే ముఖ్యమైనదికాదు. దానిం జివర కుంచిననుంచవచ్చును. దోసములేదు. దానికి ముందెన్నోయున్నవి. వాటిలోఁ గొన్ని మన మెరుగవచ్చును; మఱికొన్ని మరికొందరికెరుక. ఇటులున్న సాధనసామగ్రినంతయు నొకకడఁ జేర్పవలయునన్న సదుద్దేశమే యీగృహలక్ష్మి సంభవమునకుఁ గేవలహేతువనుట పరమసత్యము.

కాకున్నచో దరిద్రదేవత తాండవమాడుచున్న యిట్టికాలములోఁగూడ సాధ్యమైనంతవరకు గృహలక్ష్మిని సర్వాంగసౌందర్యస్ఫూర్తితోడనే పెంచిపెద్దదానిఁగ జేయఁగలుగుచుండుట సంభవించియుండదు.

సాధ్వీమణులారా! సత్పురుషులారా! ఆశీర్వదింపుఁడు "ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు"ని మనసార మీ రాశీర్వదింపుడు. మీయాశీస్సులమోఘములు.

ఇతోఽధికసాధుజనసందర్శనలాభముగూర్చి, గృహలక్ష్మిం దనర్చి, తన్మూలమున నాంధ్రలోకామోదము చేర్చి మమ్మానందింపఁ జేయుదురుగాక!!!

# కాళరాత్రి

ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దరుగారు

౧

నీ వెటు పోవుచుంటి నవనీతలశాసితరాజదండమున్
ఆవల ద్రోసి, యీనిసువు నక్కట! నీ ప్రియురాలి గాఢని
ద్రావశులైనవారి విడి; ప్రాంగణహర్మ్యలతానికుంజపున్
ద్రోవల నిర్గమించి,? తగదోయి! అధర్మపునేత మానికిన్.

౨

కును కొకయింత దీర ననుగుంబసిబిడ్డడు తల్లిపాలకై
ఫుణుకుచు లేచుచుండె, వలపుల్ దులకించు సుశీల భార్య మే
ల్కనునటు లావులించెడి; తలంపవు; నింపవు గాఢరక్తి; ఏ
వనములో బట్టి పోవ తగవా! గతమేమి వృథావిరాగివై॥

౩

కారుమెయిళ్లు దట్టముగఁ గ్రమ్ముకొనెన్ గగనాంగణమ్ము వ
ర్షారభసమ్ముతో, మెఱపులా కనుమూసెడు, ముందు కొండయున్
దూరపువెల్తురున్నటులఁ దోఁచదు, అర్ధనిశీథ మయ్యెయో!
నేరవు రాచబిడ్డడవు నీ విటులన్ శ్రమలోర్చి యెన్నడున్॥

౪

జలదసమూహముల్ మెఱపుచాయలలో నునుసిగ్గుదొంతరల్
దొలికెడి, ఆకసంబున కెదో మది సంతసముబ్బి పొంగెడిన్
వలపులుతారకల్ గురియు భవ్యశుభోత్సవమేల వీనికిన్
దెలియము! ఏటి ధర్మము విధింతువో? దేశముకై కుమారకా!

౫

తొలి రాజన్యులు రాజ్యముల్ విడచి భ్రాంతుల్ మాని భార్యాసుతా
దుల నీపిన్నతనంబునన్ విడిచి యెందో ఘోరకాంతారసీ
మల బుద్ధాకృతి తృప్తినందిరటవే మాహాత్మ! నీత్యాగని
శ్చలతల్ జూచి ప్రముగ్ధమయ్యె జగతీసంఘంబు విభ్రాంతమై॥

# అంటరానితనము–ఆంధ్ర నారీమణులు

మాగంటి బాపినీడుగారు.

నాయింటనౌకరీగాపెట్టి అంటరానితనము తొలగించుటకు నాకిష్టమే! ఏమిచేయను? మా ఆబిడ వృద్ధురాలు. పంచమపిల్లవానిని నౌకరుగాపెట్టితినా నూతిలోపడును” అని ఆంధ్రదేశసుప్రసిద్ధనాయకులొకరు ఒకసమావేశములో చెప్పెను. “నేను అంటరానితన నిర్మూలముచేయుటకు బద్ధకంకణుడనైతిని. ఆచరణ అవుసరమే! కాని మనఆడవాళ్ల ఒప్పుదల లేనిదే ఏమి చేయలేకున్నాము” అని ఒకదేశసేవకుడు ఉన్నయిబ్బంది చెప్పెను. “నిజమే! ఈదురాచారము హిందూసంఘమునకు కళంకము, మహాపాపము. గాంధిగారు చెప్పినట్లు అందరు ఆచరించవలెను. ముందు మనసోదరీమణులదృష్టి మారవలెను” అని మరొకసంసారి సవినయముగా సమాధానమిచ్చెను.

“వెంకటశివుడుగారు! మా ఆబిడ ఇదివరలో మాలవాళ్లను అంట్లుతోముటకు పెట్టుదామంటే, అయ్యో, అంతపనే కొంపతీయకండీ” అన్నది మొన్న మీ ఉపన్యాసమినే సరికి నిజమేనండీ, ఎందుకు పాపమువాళ్లను నౌకర్లుగా పెట్టరాదంటు మారాముతున్నదం డోయి” యని ఒకదేశభక్తుడు మాప్రచారములోచెప్పెను.

పై జెప్పిన మాటలలో అతిశయోక్తి యున్నదని సోదరీమణులు అనవచ్చును. ఏసం స్కారణము ఆచరణలోనికి రావలెనన్నను, ఏయుద్దేశము నెరవేర్చవలెనన్నను. గృహిణీ ఉద్ధారతపై, సహధర్మచారిణి సహకారముపై అధారపడియుండుననుట సత్యము. దేశ ములోగాని, జాతిలోగాని నూతనమార్పు రావలెనన్న సంఘములో సంస్కారము తేవలెనన్న స్త్రీలమీద విజయమాధారపడియుండును. జాతికి పౌరుషములేనపుడు, సంఘము క్షీణించు చున్నపుడు, దేశము క్లిష్టపరిస్థితిలోయున్నపుడు, భారతనారీరక్షణకువచ్చెను. భారతజాతిభావి భాగ్యోదయము, భారతనారిమీదను యువకులమీద ఆధారపడియున్నది. హిందూసంఘము నకు కళంకమైనట్టియు, భారతజాతిఐక్యతకు ఆటంకమైనదియు ఈ అమానుష, అక్రమ, ఆదర్శ, అశాస్త్రీయక్రూరాచారమును నిర్మూలముచేయుటకు నాసోదరీమణులు సర్వవిధ ముల తోడ్పడవలసినదని ప్రత్యేకప్రార్థన గావించుచున్నాను. స్త్రీజనోద్ధరణముకు మహాత్మాజీ అగ్రగణ్యులు అస్పృశ్యతానివారణతో గాంధిగారి ప్రాణరక్షణగలదని మరువకుడు.

భగవానుని విగ్రహములలో నరవిగ్రహము అత్యుత్తమమైనది అట్టి యీనరోత్త మునిగురించి మన హిందూమతోద్ధారకు లేమిచెప్పిరో వినుడు.

ఆ ది శ ం క రా చా ర్యు లు—

కాశీలో చండాలు డెదురైనపుడు తొలగు తొలగుమని కేకలువేయగా నాతడు “అంటరానిదేది? దేహమా, ఆత్మయా!”యని, ప్రశ్నింప శంకరుడు ఆత్మజ్ఞానము స్ఫురించుకొని “చండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ” ఆత్మజ్ఞానము గల వాడు చండాలుడైనను, ద్విజుడైనను, గురువేయని నామతము అని సాష్టాంగముజేసి యాదరించెను.

శ్రీ రామానుజాచార్యులు—

సవర్ణులకు మాత్రమేగాక అంటరానివారని జెప్పబడువారి కందరకును గోపురాగ్రము మీఁద నెక్కి ముక్తిసాధనమగు తిరుమంత్రోపదేశమును గావించెను.

శ్రీ వివేకానందస్వామి—

ఒక పాకీవానియింట ఆరునెలలు నివాసముజేసి పతితులయందలి పరబ్రహ్మమును సాక్షాత్కారము పొంది యిట్లు జెప్పెను:—అస్పృశ్యత హిందూమతములో లేదు. ఈ పిచ్చిఅస్పృశ్యత దేశాభివృద్ధి కడ్డుతగులుచున్నది. దరిద్రులు, దీనులు, రోగులు, వీరిలో శివుని చూడఁగల్గినవాఁడె శివభక్తుఁడు. ఒక్కఆలయములో దేవుని దర్శించిన వానికంటె జాతిమతకులభేదములు లేక ఒకదరిద్రునికి తోడ్పడినవాడే ఉత్తమభక్తుఁడు.

పండిత మదన మోహన మాలవ్యా గారు—

"ఒకమనుష్యు డేజాతివాఁడైనను, దేవాలయములోనికి రాగనే పరిశుద్ధుడగును. భగవంతునివలె జీవుఁడుగూడ సదా పవిత్రుఁడు. జీవులకు జాతిమతవర్ణవివక్షత యేమియు లేదు. ఈ విషయములను సరిగా గ్రహించినచో దేవునకును, దేవాలయమునకును, మనుష్యునకును, మతమునకును అపవిత్రత గల్గునని ఎవరును భయపడ నవసరములేదు. హరిజనులను దేవాలయమునకు రానిచ్చుట వలన మనము హరిహరుల యనుగ్రహమునకు మరింత యధికముగా పాత్రులమగుదుముగాని అపవిత్రులము కాజాలము. దేవాలయములుగూడ అపవిత్రముకావు.

అవతారపురుషుఁడగు మహాత్మా గాంధీ—

అంటరానితనము నిర్మూలించుటకై ప్రాణబలి నిచ్చుటకు నిశ్చయించుకొని యిట్లు జెప్పెను. "అంటరానితనము నిలచినచో హిందూమత మంతరించును. హిందూమతము జీవింపవలెననినచో అంటరానితన మంతరింపవలెను." "సనాతన ధర్మమునకు ప్రధానము అంతశ్శుద్ధికాని, బాహ్యశుద్ధికాదు." "మానవుని వెలిబెట్టిన దేవుని వెలిబెట్టినట్లే" "అస్పృశ్యులనబడువారు ఏనాఁడు హిందూదేవాలయములోనికి రాగల్గుదురో, ఆనాడే భగవంతుఁడు విగ్రహములందు ప్రతిబింబింపగలడు. లేకున్న దేవళములు వట్టి రాతిగుట్టలు మాత్రమే."

హిందూమతఖ్యాతికి మూలకారణులగు వాల్మీకి, అరుంధతి, నందనార్, ఆళ్వారులు మున్నగు ఋషులు, భక్తులు, సాధ్వులు పంచమకులసంభవులే యను సంగతి మరువకుఁడు.

ఇట్టి మన స్వమతసోదరులకు మనతోపాటు సమానహక్కులనిచ్చి వారిని దేవాలయములకు, పాఠశాలలకు, సత్రములకు, అంగడులకు, చెరువులకు, బావులకు, మనయిండ్లకు రానిచ్చి మన కనీసధర్మమును నెరవేర్చి దేవుని ఆశీస్సులను పొందుఁడు.

# విధు

గొల్లపూడి జోగారావు గారు

ఆమెపేరు విధు. ఆమెనివాసము ప్రకృతిశోభాపరిపూర్ణమైన సస్యప్రదేశాల్లో. ఆమె అపూర్వతరసౌందర్యమూర్తి. అందుచేతనే ప్రకృతితో అవిచ్ఛనంగా నాటలాడగలిగిందామె. కోయిలమధురగానంలో గొంతెత్తిపాడేది. కొండలోయల్లోని సెలయేటిరొదల్లో కంఠము మేళవించింది. పాంథజనుల బలుకరించి వారిజీవనప్రవృత్తికి నవ్వుకొనేది. ఆమె కీలోకంలో ప్రేమపాత్రుడొక్కడే— ఆమెతాత. ఆమె అమాయిక. ఆమెకుమల్లే తన తాతనందరూ గౌరవించాలనుకునేది. ఆమె ముగ్ధ. తనతాతను వదిలి ఉండగలనా అనుకునేది.

* * * *

విధుసౌందర్యం రాజభవనంవరకు ప్రాకింది. విధుతాత అతనివగ్గర వొకృషికుడు. రాజు స్వయంగా వచ్చేడు విధుసౌందర్యము చూడడానికి. స్వంతత్రంగా విధు నివ్వమన్నాడు తాతను పిలిచి. తాత కుటీరంలోకి పోయాడు. విధు ఆతనివైవర్ణ్యమును చూచింది. "తాతా! నన్నియ్యకు...నిన్ను వదిలుండలేను నేను." ఆ మాగ్ధ్యము నాతడు ముద్దుపెట్టుకున్నాడు. పైకొచ్చి రాజుతో చెప్పాడు. "నేనామె నియ్యలేను." రాజులోచనములు కోపారుణితములయేయి. "ఆతని కొరడాలతో కొట్టుడు." అన్నాడు గంభీరంగా. అది అతనికర్కశహృదయం.

విధు పైకొచ్చి తాతను కౌగలించుకొంది. "మాతాతను కొట్టవద్దు. ...ఆక్రోశించింది దీనంగా. అది ఆమెప్రేమహృదయము.

రాజుసేవకులామెను విడదీసేరు. తాత అల్లాగే నిలబడ్డాడు శిలాప్రతిమలా. విధుఅమాయికపుచూపుల్లో జాలి ప్రవహిస్తోంది కొరడాలు యెత్తేరు. విధు చటాల్నిపోయి కౌగలించుకొంది ఆతనివణుకుతోన్న శరీరాన్ని. "మాతాతని కొట్టవద్దు." విధుమీద దెబ్బపడింది....మరొకటి. ఆమె స్మృతితప్పి పడిపోయింది. సుకుమారమైన ఆమెశరీరము కందిపోయింది. రాజుహృదయం కరిగిపోయింది. తేజి దిగి నిశ్చేష్టితమైన ఆమెదేహాన్ని లోపలికి తీసుకుపోయాడు...........ఆమె కనులు తెరచింది. "క్షమించు" అన్నాడు రాజు. "మాతాతను కొట్టవద్దు"

# కీ. శే. పిఠాపురము రాణీవారు

ఆంధ్ర శేషగిరిరావుగారు బి. ఏ.

శ్రీపిఠాపురమురాణీసాహేబావారు గతమాసము 13-వ తేదీ ఆదివారము సాయంకాలము నాలుగుగంటలకు మదరాసునందలి తమమందిరమున పరమపదించిరని తెలుపుటకు మిక్కిలి విచారమగుచున్నది. శ్రీమతిగారి జీవితమును 'గృహలక్ష్మి'లో లోగడ ప్రశంసించియుంటిని. ప్రభ్వి, విదుషి, దాత్రి, విద్యాప్రదాత్రి, సంస్కర్త్రియై ఆమె ఆంధ్రస్త్రీలోకమును అభ్యుద్ధరించినవిధానమచట విపులముగ వివరించితిని.

మేల్కాంచి పూజచేయుట, పూజచేసి నిద్రించుట నిత్యకృత్యములుగాగల ఆసాధ్వీమణిచేలము పూజావసరమున నిప్పంటుకొని శరీరమును చుట్టెను. తుదకు ఆమెఅసువులను దీసెను. ఆంధ్రస్త్రీలోకమునుండి ఒకఅనర్ఘరత్నము జార్చివైచెను. ఆమె జీవితమున నొకగొప్పవార్తకలదు. ఆమెరాజ్ఞీత్వము గృహకార్యనిర్వహణమునకు అడ్డురాలేదు. తాను స్వయముగ చేయగలపనిని, చేయవలసినపనిని ఆమె ఎన్నడును పనికత్తెలకీయలేదు. ఐశ్వర్యము ఆమెకడ ఆడంబరమునకు దూరమైనది. జమీందారీకుటుంబమునపుట్టి, జమీందారీకుటుంబమున మెట్టియు ఆమె సాధారణస్త్రీవలె సంచరించెను. పిఠాపురమున నొకపరి ఆమె స్త్రీలసభ గావించెను. పట్టణమునందలి స్త్రీలు వేషాడంబరముతో వచ్చిరి. తమరాణియు ఆడంబరవేషముతో వచ్చునని వారు తలంచిరి. కాని ఆమె సాధారణస్త్రీవలె వచ్చెను. సాధారణస్త్రీవలె మెలగెను. సమావేశమైన ఆస్త్రీజనముల కిది ఎట్టిగుణపాఠము! ఆమెనేత్రము లెన్నడును కోపారుణితములుకాలేదు. ఆమెపెదవులు పరుషవాక్యముల నెన్నడును వెలువరింపలేదు. పిఠాపురమున స్త్రీలకొఱకు ఆమె పాఠశాల, క్లబ్బు ఏర్పఱచినది. అచట స్త్రీవైద్యాలయము ఏర్పడుటకు ఆమె యొనర్చినసాయము అనంతము. స్త్రీయుద్యమములకై ఆమెచేసిన ఇతరదానములకు లెక్కలేదు. ఆమెమరణము ఆంధ్రస్త్రీజనోద్యమమునకు ఒక గొడ్డలిపెట్టు. శ్రీరాణీవారి పవిత్రాత్మకు శాంతిని ప్రసాదింప ఆంధ్రస్త్రీలోకము ఏకకంఠమున పరమేశ్వరుని ప్రార్థించుచున్నది.

# కల్పలత

చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాద్ గారు బి.ఏ

౧

నగలు లేనంతమాత్రమున ఆమెకు చక్కదనం లేదనటానికి వీలులేదు. పక్కపాపిడి, వెంట్రుక నొక్కు, వెగటుగానుండు వెట్టిక త్తిరింపులు లేవు. పుట్టినది పూరింటిలోనైనా రమ్యహర్మ్యాలలోనున్న రమణీమణులకన్నా ఆమె ఏమాత్రం తీసిపోదు. తెల్ల చీరె, మెడలో విరజాజిమాల, పెదవిపై లేనగవు ఆమెకు విలువగల నగలు. ఎక్కడో సముద్రాలల్లో వాచుచిప్పలలో పుట్టిన ముత్యాలవలె, అరణ్యాలల్లో ముళ్ళపొదలమాటున పెరిగిన చందనపుచెట్లవలె ఆమె లేమిగల కుటుంబములో పుట్టినా గౌరవింపదగినదే. ఆమె ఎంతచక్కనిదో అంతగుణవతి, ఎంతగుణవతో అంతవిద్యావతి. పలుకుల్లో మార్దవం, పనుల్లో నేర్పు ఆమెకు పుట్టుకతోనే పుట్టినవి. ఆమె చిన్నతనంలోనే తల్లిని గోల్పోయింది. ఆమె అవివాహిత.

అతడు రూపవంతులలో రూపవంతుడు. అతని వదన మెంతసుందరమో హృదయమంత నిర్మలము. ఆనందతరంగాలలో, అమృతమయమైన తలంపులలో విహరించే అతనికి ఈప్రపంచమంతా నందనవనంగా కనిపిస్తుంది. నీటిఅలలు, గాలితరగలు, పుప్పొడిదుమారములు, మబ్బుపొరలు అతనికి వింత సందేశాలు తెచ్చేదూతలు. అదృష్టవశాత్తు అతడు ధనంగలకుటుంబములో పుట్టేడు; దానితో బంగారానికి తావి అబ్బినట్లయిపోయింది. అతడు బ్రహ్మచారి.

* * *

ఆమె కల్పలత, అతడు మోహనుడు. ఒకే గ్రామవాసులు. అయితే మోహనుడు నివసించునది రమ్యహర్మ్యము, కల్పలత నివసించునది పూరిగుడిసె. రెంటికి ఇరువదిగజాలదూరము. కల్పలత తనకొరకే జన్మించినదని మోహనునిఅభిప్రాయం. మోహనుడు తనకొరకే జన్మించినాడని కల్పలతఅభిప్రాయం. చిన్ననాటనుండి వారు ఆటలలో కలసిమెలసి కాలంవెళ్ళదీసేవారు. కల్పలత తినడానికి తెచ్చుకొనినదానిలో కల్పలతకు పెద్దభాగం. కల్పలత బీదపిల్ల అయినా ఏవో పూలతో అలంకరించుకుంటే ఆనాడు మోహనుడు మురిసిపోయేవాడు. ఎట్టిఆశ లేదు. కారణంలేదు. పట్టుదలలేదు. ఒకరినొకరు ఎందుకో అమితంగా ప్రేమించేవారు. ఎందరు పిల్లలులేరు! ఎందరు తమతోకలసి ఆడుకోవడంలేదు! కాని కల్పలతా మోహనులకున్నమైత్రి ఎవరికీలేదు. దీనికి కారణం ఎవరు చెప్పగలుగుదురు? సూదంటురాయి ఇనుమునే ఎందుకు ఆకర్షించాలి?

౨

కొన్నిసంవత్సరాలు దాటినవి......ఆనాడు సంక్రాంతి. ఉన్నఅమ్మలు ఉన్నట్లుగా నగలు అలంకరించుకొని పేరంటానికి బయలుదేరారు సాయంత్రం కాగానే. నగరమంతా తోరణాలతో, ముగ్గులతో అందంగా ఉన్నది. ఇంటికివచ్చినకొత్తఅల్లుండ్లకు చేయగలమర్యాదలు చేస్తున్నారు ఆడపిల్లలనుగన్న అయ్యలంతా. ఏవైపుజూచినా కొత్తబట్టలగుమగుమాయింపులు.

ఇంతవేడుకగానున్నా గ్రామానికి కొంచెం వెలుపలగానున్న ఆపూరిగుడిసెముందరనున్న అవిసెచెట్ల క్రింద నులకమంచముమీద విచారంగా కూర్చొనియున్నది కల్పలత. అంచువెలసిపోయిన ఆతెల్లచీరె, నగలులేనిఆబోసిమెడ, లేనవ్వైనాలేని ఆఎఱ్ఱనిపెదవి ఒకవిధంగా అందంగానేఉన్నవి. పిల్లగాలికి తలమీది వెంట్రుకలు ఒకటొక్కటి ముఖంమీద వాల్తున్నవి. ఒకేదృష్టితో ఆమె ఆచెట్లవైపు చూస్తున్నది. లోకమంతా తనవంటిదే అనుకున్నదికాబోలు. అస్థిరమైన ధనంకోసం ప్రణయబంధాలను పటాపంచలొనరించే పాపాత్ములు లోకంలో లేరనిగాబోలు ఆమెఅభిప్రాయము. తనకుమల్లే పిచ్చిఆదరంతో లోకాన్ని నమ్మి మనసులో మర్మంలేకుండా అందరూ సంచ

రిస్తారని ఆమె తలచిఉంటుంది. తమసుఖంకోసం లోకులప్రాణాలనుసైతం నీరాజనంపట్టే క్రూరులు లోకంలో ఉన్నారని ఆమె అనుకోలేదు. మల్లెపువ్వులాగాపుట్టి, కన్నులువిప్పి, కమ్మతావులు జిమ్మి, తుదకు కన్నుమూసి మన్నుగరపదలచినది ఆమె. కాని జీవిత మంత్రప్రశాంతంగా ఎల్లాగడుస్తుంది!... చిన్ననాటనుండి తనహృదయంలో ఎన్నోకోరికలు రేపి, తన ప్రేమసుధనంతా దొంగిలించి, తన్నే నమ్మియుండమని ఎన్నోసార్లు అభయమిచ్చిన మనోహరుడు, తనహృదయాధినాథుడు అగుమోహనుడు పెద్ద కట్నానికి ప్రేమ తెచ్చిపెట్టికొని వేరొక బాలికను పెండ్లాడనున్నాడు. వేలకొలదికట్నాలకు భార్యలకు అమ్ముడుపోయే బి. ఏ. లలో మోహనుడు కూడా చేరిపోయినాడు. పాశ్చాత్యనాగరికతాపథమునపోతూ బి. ఏ. ప్యాసయినంతమాత్రాన విజ్ఞాననిధులమని విఱ్ఱవీగుతూ, కొంపలు గుల్లలయినా లక్ష్యం లేక, అల్లారుముద్దుగా పెంచుకొనిన ఆడపిల్లను ఇచ్చినప్పటికి, వేలకొలది రూపాయలను కోరుతూ, అవి సమర్పింపశక్తిలేని మామలపాలిటి యమదూతలుగా సంచరిస్తూఉన్న ఈక్రొత్త బి. ఏ. లవలెనే మోహనుడు కట్నాలవ్యామోహంలో పడ్డాడంటే ఆశ్చర్యమేమున్నది? ఇరువైవేలరూపాయలతో కల్పలత ముఖంమీద మరుపుతెర పడిపోయింది. కల్పలతకన్నా నిన్ను ప్రేమించిన బాలిక లోకంలో లేదని మోహనుని కెరుకలేకపోలేదు. కాని "ఇరువైవేలకన్నా పిలువగలదా కల్పలత?" అనే సందేహం అతనికి తోచింది. ఏలాగైతేనేమి కల్పలతను విసర్జించి వేరొకబాలికను పెండ్లాడతలచినాడు మోహనుడు. ఈవార్త కల్పలతకు తెలసిననాడే సంక్రాంతి.

చిన్నప్పటినుండి తాను నిర్మించుకున్న గాలిమేడలు నాటితో నేలమట్టమైనవి. ముందు తనజీవితమెట్లు? తానెందులకు అతనిని ప్రేమించెనో ఆమె కెరుకలేదు. ప్రపంచంలో ఏదో ఒకకారణాన్ని మనసులో పెట్టుకొని ఒకవ్యక్తి వేరొకవ్యక్తిని ప్రేమిస్తే అది నిజమైన ప్రేమ అనిపించుకొనదు. ఏకారణం లేకుండా, తనకు తెలియకుండా ఒకవ్యక్తి వేరొకవ్యక్తిని ప్రేమించినట్లయితే అదే 'నిజమైనప్రేమ' అనుమాట కర్థం. కల్పలత ముందుకాలమునందైన మోహనుని ప్రేమించకుండ జీవింపలేదు. ఎవనికి తనహృదయమును పిన్ననాటనే అర్పించెనో, పెరిగి పెద్దయైనప్పటికి ఆమె అతనికే దాని నర్పింపదలచెను. అవిదితమును, అనంతమును, అలభ్యమును అగు పవిత్రప్రణయసాగరమున తన కాశ్రయమిచ్చునది మోహనుడే అని ఆమె ఇదివరలో నమ్మియుండెను. ఇపుడును అట్లే నమ్ముచున్నది. ముందును అట్లే నమ్మకముంచదలచినది. తాను పేదరాలైనను ధనికుడును, విద్యావంతుడును, రూపవంతుడును అగు మోహనుడే తన ప్రాణవిభుడని అనుకొనుటకు తనకు హక్కుగలదని ఆమె తలచెను. ఇది పిచ్చితలంపు కాదుగద!

## 3

మోహనునకు వివాహంజరిగినతరువాత బంధువులందరితో గృహప్రవేశానికి స్వగ్రామం వచ్చాడు. ఊరివారినందరిని పేరంటానికి పిలిచేరు. ఆవూరి ఇంటిముందు "పేరంటానికి రావలసిందని" పెండ్లివారి ఆడబడుచు కల్పలతకు బొట్టుపెట్టినపుడు కల్పలత లేనవ్వుతో తలవంచుకుని 'సరే' అన్నది.

సూర్యుడస్తమించకపూర్వమే తలదువ్వుకొని తనకున్న తెల్లచీరె కట్టుకొని పెండ్లివారింటికి పేరంటానికి బయలుదేరింది కల్పలత. ఇంటినిండా జనం గుంపులుగానున్నారు. మోహనుడు, ఆతని భార్య మధ్య పీటమీద కూర్చునిఉన్నారు. మంత్రాలు చదువుతున్నారు బ్రాహ్మణులంతా. అక్కడున్న ఆడవారిలో కొంచెం చాటుగానుంచుని చూస్తున్నది కల్పలత. ఇంతలో పూజచేస్తున్న మోహనుడు తలకొంచెం ఎత్తి నాల్గువైపులా చూసేడు. తటాలున అతనిదేహం కంపించినది. ఎప్పటిరోజులో జ్ఞాపకం వచ్చినవి. కల్పలతకనులు నిలకడగాలేవు. ఆకనులు, మోహనుని కనులు క్షణంసేపు నిలచిపోయినవి. జరిగిపోయిన వింతకథ జరుగుచున్న వింతచరిత్ర ఒక్కక్షణ

కాలంలో సినీమా బొమ్మలులాగా కనుపించినై. మోహనుడు తలవంచేడు. కల్పలత వెళ్ళిపోయింది.

* * *

చిట్టచిటారుకొమ్మనున్న ఒక గులాబీపువ్వులోని రేకులురెండు గాలితాకున మెల్లగా రాలిపోయినవి. అవి తిరిగి పువ్వులోనికి చేరగలవా? చేరినా పొందికగా నిలువగలవా? నిలచినా కమ్మతావుల జిమ్మగలవా?

* * *

కల్పలత కాదినం చాలాపవిత్రమైనది. మోహనుని దయగలచూపుల కామె ఆనందంచేత లోకాన్నే మరచిపోయింది. తన జీవితం ధన్యమైనదని తలచింది. ఇల్లు అలికినంతనే పండుగ అనుకునే అమాయకురాలు కల్పలత. ఎప్పటికి మోహనుడు తన ప్రాణవిభుడేనని ఆమెదృఢనమ్మకం. అట్లా అనుకున్నంతసేపు ఆమెకు తరుగనిసంతోషం.

## ౪

కాలం చాలాగడచింది. మోహనుడు బి. ఏ. అని ఇదివరకే మనకెరుక. ఏసర్వీసుకమీషను మెంబరును ఆశ్రయించాడో, ప్రొబేషనరీ డిప్యూటీతహసిల్దారుగా నియమింపబడ్డాడు. ఇంటకావలసినంత ధనమున్నది, విద్యఉన్నది, సౌందర్యమున్నది, మీదు మిక్కిలి పెద్దఉద్యోగమైనది—కలిసివచ్చే రోజులుంటే అట్లా ఒకటివెంటఒకటి అనుకోకుండా వచ్చిచేరటం సహజం. తహసిల్దారుఉద్యోగమైన రెండుమాసాలకే భార్యయగు విమల కాపరానికి వచ్చింది.

సుఖాలువచ్చినా అట్లావస్తవి. కష్టాలువచ్చినా అంతే. ఎన్నిదినములనుండో నమ్మియున్న మోహనుడు నష్టేటముంచాడు, ఈతీరనిదుఃఖంలో ఉండగనే తండ్రి గతించాడు, తాను అబల, అవివాహిత, ఇంట పెద్దలు లేరు, అయిన వాండ్లు దూరపుజిల్లాలో ఉన్నారు. ఏమి చేయగలదు ల్పలత? పరాత్పరునిపై భారమువేసి ఆపూరికొంపలోనే కాలం వెళ్ళదీయతలచింది. ఆమె మంచంలో పరుండి ఆకాశంవైపు తలద్రిప్పి ఆలోచనలో మునిగినంతనే ఎన్నో విషయాలువచ్చేవి మనసులోనికి...... ముందు తనజీవిత మెట్లుకానున్నదో...తానుపొట్టకె ఎన్నిఇబ్బందులుపడవలెనో అని ఆమె భయపడేది. ఇతర విషయాలనుగురించి ఎంతవిచారించినా తన వివాహవిషయం ఆమె ఎప్పుడూతలచేదికాదు. మోహనునే ఆమె ప్రేమించింది. ఈనాటికి అతడు అందని పండైనాడు. అట్లా అయినప్పటికి మనసులోనైనా తాను మోహనునిభార్యననుకునేది.

## ౫

అది వేసవికాలము. వేడిగాలి చాల ఎక్కువగానే ఉన్నది. బాటసారులు చలివేంద్రలవద్ద గుంపులు గుంపులుగాచేరారు. ముక్కులు తెరచుకొని కాకులు చెట్లకొమ్మలలో కూర్చున్నై. అప్పుడప్పుడు గొడుగు, చెప్పులు వేసుకొని బజారులో ఎవరోఒకరు వెళ్తూనే ఉన్నారు. సోడాబుడ్లచప్పుడు వినబడుతూనే ఉన్నది. అంతవేడిగానున్నా తహసిల్దారుకచేరీవద్ద జనులు గుంపులుగాఉన్నారు. ఇంతలో ఒకమోటారుబస్సువచ్చి అక్కడ నిలచింది. దానిలోనుండి మొదలోక పోలీసుబంట్రోతు దిగేడు. తరువాత ఖద్దరుబట్టలుకట్టుకొని, ప్రక్కన ఒక పెద్ద సంచితో ఒకపెద్దమనిషి దిగేడు. ఆయన తరువాత ఖద్దరుచీరెలు కట్టుకున్న ఇద్దరుఆడవాండ్లు దిగేరు. వీరందరికి ముందువెనకా పోలీసులు కాపలాగా ఉన్నారు. కొంతసేపటికి అందరూ కచేరిలోనికి వెళ్ళారు. తహసిల్దారు మధ్యకుర్చీలో కూర్చుని ఏదో వ్రాస్తున్నాడు. పోలీసువారితో కచేరీలోనికి వచ్చిన పురుషుడు, స్త్రీలు సత్యాగ్రహములో పాల్గొని ఎరెస్టు చేయబడ్డారు. ఇవి ఆర్డినెన్సు రోజులు కాబట్టి ఆకేసు వివరాలు మనకెందుకు? సరే. విచారణ తేలికగాజరిగే కేసు కాబట్టి ఏవో అటూ ఇటూ చూస్తూ తహసిల్దారు ముద్దాయిలను తేరిపార చూచాడు......ఆచూపు అట్లే నిలచిపోయింది...

ఆముగ్గురిలో ఒకతె కల్పలత కాబట్టి, తహసిల్ దారు మోహనుడు కాబట్టి, మోహనునికంటబడి ఏవిధంగా నైనా అతనిచేత అగౌరవింపబడో, గౌరవింపబడో తనకోర్కె నెరవేర్చుకోనదలచింది కల్పలత. అందు కనే అతని జూరిస్ డిక్షన్ లో నేరంచేసి ఆతనికోర్టుకు వచ్చింది. అన్నివిధాలా తన్ను శిక్షించడానికి అతడు అధికారి అని ఆమె మనసార నమ్మింది.

కేసువిచారణ జరిగింది. అందరికి ఆరునెలలు కఠిన శిక్ష, సి. క్లాసు ఇచ్చాడు తహసిల్ దారు. శిక్షవిని కల్పలత మందహాసంచేసింది. మోహనుడు కోర్టు ఆరోజుకు విరమించాడు. నేటికి కల్పలతబ్రతుకు ధన్యమైనది. ఏవిధంగా ధన్యమైనదో ఆపిచ్చిమనసుకు తప్ప ఎవరికెరుక?

## ౬

కాలచక్రం తిరిగిపోయింది. కల్పలత కారాగార మున ప్రవేశించిననాటనుండి మోహనునిహృదయం సరిగా లేదు. నెలుపరించలేనిఆవేదన అతనిహృద యంలో ప్రవేశించింది. ఒకపనీ చేయ బుద్ధిపుట్టదు. చేసినా సానుకూలంగాదు. కల్పలతకు శిక్ష ఇంకారెండు రోజులలోపూర్తికానున్నది. ఆమెను ఒకసారి చూడ వలెనని మోహనుడు ఎన్నోసార్లు అనుకున్నాడు. ఆనాటి కల్పలతయొక్క లేనవ్వు మరచిపోదామన్నా అతనికి మరపునకు రాలేదు. ఆమాటమార్దవం, ఆ ముఖముతీరు మరిమరి తలపునకువచ్చేవి.

మోహనుడు గదిలో ఏమోమో ఆలోచించుకుంటూ పడుకొని నిద్రబోయినాడు. భార్యయగు విమల ఏదో చదువుకుంటూ వసారాలో ఉన్నది. దాదాపు పగలు ఒంటిగంటదాటింది. ఇంట్లోపని చేసేనౌకరులంతా బజారువెళ్ళారు ఏదోపనిమీద. ఇంతలో వీధితలుపు తెరువబడినది. తెలిచీర ధరించి ఒకఇరువదివత్సరముల యువతి లోనికివచ్చింది. ఆమె ముఖంచూస్తే ఒక ప్పుడు సుఖం అనుభవించినదానిలాగానే ఉన్నది. ఆమె విమలను సమీపించింది. కొంతసేపటికి "అమ్మా! నేనొకనిర్భాగ్యురాలను" అని దీనంగా పలికింది. "మీ దేగ్రామం? ఇచట కెందుకు వచ్చారు?" అని విమల ప్రశ్నించింది.

"పొట్టగడువక తమవంటివారికడ బ్రతుకు వెళ్ళ బోసుకొనవలెనని వచ్చాను" అని ఆమె జవాబు చెప్పింది.

"చిన్నవయసులో ఉన్నారు. మీకింత కష్టమెం దుకు వచ్చింది; మీకు తల్లిదండ్రులులేరా?" అని విమల పలికింది.

"తల్లిదండ్రులు పరలోకం చేరారు, నేను అవివా హితను. అదిగాక పెద్దకుటుంబమునకు చెందినదానను. మీకులమునకు చెందినదానను; పూర్వజన్మములోని పాపములవలన నాగతి ఇల్లాబట్టింది. మీరు గర్భవతి గానున్నారు. ఈ ఓపికలేని రోజులలో నేను మీ ఇంటనిలచి చాకిరిచేస్తాను" అని ఆమె తనసంగతి చెప్పింది.

"నాకు ఒక ఆడమనిషి చాకిరికికావలసినమాట నిజమేను. మీరు మర్యాదాకుటుంబమునకు చెందిన వారంటున్నారు. ఎంతజీతంకావాలి?" అని విమల అడిగింది.

"పట్టెడన్నంతప్ప నాకేమి అక్కరలేదు. కాలం గానికాలంలో తలదాచుకోటానికి తావుజూపిం చారు. మీకు వేయినమస్కారాలు. మీఋణం నేను తీర్చుకోలేను" అని ఆమె కంట నీరుబెట్టింది.

"మీరు ఎల్లకాలం మాకడనే ఉంటారుకదూ" అన్నది విమల.

"నేనెక్కడికివెళ్తాను. నాకు లోకంలో ఇల్లూవా కిలీ లేదు. కాని నాదొకమనవికలదు. అది జాగ్ర త్తగా ఆలకించి నాకోరిక నెరవేరిస్తే అన్నివిధాలా మిమ్మ్మ నాతల్లిగా ఎంచుకుంటాను" అని ఆమె పలికింది.

"ఏమి కోరికె?" అన్నది విమల.

"నేను గౌరవంగల కుటుంబములో పుట్టినదానను. ఎక్కువకష్టం ఇదివరలో ఎరగను. బండచాకిరి చేయ బలంలేనిదానను. అదిగాక మీమగవారి కంటబడకుండా ఇంట చాకిరిచేస్తాను. మగవారికిచెందిన పనులు నేను చేయజాలను. అన్నికాలములందు మీ వెంటనే యుండెదను. ఇల్లా అడిగినందుకు గర్వం గలదానినని అనుకోవద్దు. కన్నతల్లివని నమ్మి మీ అండజేరాను. అన్నివిధాలా నాప్రాణం మీచేతులలో పెట్టున్నాను' అని ఆమె ఏడ్చింది.

"నేను అంత తెలివితక్కువదానను కాను. ముఖలక్షణాలు చూచి మీకేపని చెప్పవలసింది అప్పుడే గ్రహించాను. మగవారిఎదుటపడేపని మీరేమిచేయ నక్కరలేదు. మీ గౌ ర వా ని కి హానిరాకుండా చూస్తుంటాను"అని విమల ధైర్యంచెప్పి ఆమెను ఇంటిలోనికి తీసుకొనివెళ్లి ంది.

మోహనుడు నిద్రనుండి లేచినతరువాత ఆక్రొత్తగావచ్చినమనిషినిగురించి అతనికిచెప్పి అనుజ్ఞతీసుకొని తనకడనే చేర్చుకొనినది.

ఆ క్రొత్తగావచ్చిన యువతి అప్పుడే జైలునుండి వచ్చినకల్పలతయని చదువరులు గ్రహింపకుందురా? కల్పలత తాను బ్రతికియున్నన్నిదినములు మోహనునికే సేవజేయదలచినది. తనశరీరమునందలి ప్రతిరక్తపుబొట్టు మోహనునిఅభివృద్ధికై ఆమె వినియోగింపదలచినది. ఏడుకొండలవానియనుగ్రహమువలన ఆమె మోహనునిగృహమునందే పనిచేయుటకు కుదిరినది. ఇట్లు తన కపకారశను చిక్కునని ఆమె కలలోనైన తలంచియుండలేదు. కాని ఈనాటికి ఆమె కోర్కె ఫలించినది.

## ౭

అప్పుడే సూర్యు డుదయించాడు. కళగిన సంతోషానికి ముఖము కందిపోయేటట్లు నవ్వింది తూర్పుకాంత. తాముగూడా సంతోషం పంచుకున్నామని చెట్లు అటూఇటూ తలలుద్రిప్పినై. అప్పుడే కాఫీపుచ్చుకొని మోహనుడు వసారాలో పడకకుర్చీలో పడుకొని పేపరు చదువుతున్నాడు......ఇంతలో బంట్రోతువచ్చి టెలిగ్రాము చేతికిచ్చాడు. ఆతురతతో ఆటెలిగ్రాము చించాడు:—"విమల కుమారునిగన్నది. కాని చాలజబ్బుస్థితిలోనున్నది. వెంటనే రావలయును" అని అందులోఉన్నది.

కల్పలత నౌకరికి వచ్చినపుడు విమల నిండుగర్భవతియని ఇదివరకే విన్నాము. ఆమెను పుట్టింటివారు తీసుకొనివెళ్లారు. ఆమెతో కల్పలతకూడా వెళ్లి ంది. కల్పలతయొక్క వినయం, పనియందు నేర్పుకు విమల ఎప్పుడూ దాసీదానివలె చూడ నేలేదు. ఆ ఒకమాసముకూడా తనభర్తకంట పడకుండానే ఆమెను గౌరవంగా చూస్తూ కాలంగడిపింది. విమలాకల్పలతలు అక్కచెల్లెండ్రవలె కలసిపోయినారు. వ్యక్తీకరింపలేని ప్రేమ ఒకరిలోనొకరికి కనుపించింది. విమలలేనిదే కల్పలత వెఱ్ఱిదానివలె నుండేది. కల్పలత కనుపించనపుడు విమల విసుగుతో కాలంబుచ్చేది. ఏనాటి సంబంధమో ఇది ఎవరు చెప్పగలరు?

మోహనుడు టెలిగ్రాముచూసుకొని కారుమీద అత్తవారింటికి వచ్చేటప్పటికే విమల చనిపోయింది. ఆమెకు కలిగిన పసికందును చేతులోపెట్టుకొని అమితంగా ఏడవడం మొదలుపెట్టింది కల్పలత. ఆమె ముఖం కందిపోయింది, కనులు ఎఱ్ఱబడినవి, దేహం కృశించిపోయింది. చనిపోయేముందు విమల తన తల్లిదండ్రులనైనా పిలువకుండా కల్పలతను పిలిచి ఆమెచేతులలో పసికందునుపెట్టి నీ కుమారునివలెనే చూచుకొమ్మని నొక్కిచెప్పింది...కొన్నినిముసములు గడచినతరువాత మళ్ళీ కల్పలతను పిలచి, విమల ఆమె చెవిలో ఏమేమోచెప్పి ఒక్కసారి పెద్దపెట్టున నవ్వి ప్రాణం వదిలింది.

♦ ♦ ♦ ♦

మోహనుడు మామగారింట కాలుబెట్టినపుడు వసారాలో ఒకప్రక్క చనిపోయిన భార్యశవము

వేరొకప్రక్క కావుకావుమని ఏడుస్తున్న పిల్లవాడిని చేతపట్టుకొనియున్న కల్పలత కనుపించింది. అతడు కొంతసేపు లోకాన్నే మరచిపోయినాడు.

ఆరోజు విమలయొక్క దహనసంస్కారాలన్నీ పూర్తిఅయ్యేటప్పటికి దాదాపు రాత్రి ఏడుగంటలు దాటినవి. మోహనుడు అలసటతో ఒకచీకటిగదిలో పొంగిపొంగి వచ్చేదుఃఖాన్ని దిగమ్రింగుతూ ఒక మంచంమీద పండుకున్నాడు. చనిపోయిన విమల, కనుపించిన కల్పలత ఆతని కనులముందు నిలచియున్నారు. కల్పలత అచ్చటికెట్లువచ్చినదని తన్నుదా ప్రశ్నించుకున్నాడు.

శిక్షవిధించిననాడు హృదయంలో లేచిన పశ్చాత్తాపతరంగ మింకా అణగిపోలేదు. ఇంతలో భార్యావియోగం కలిగింది. మీదుమిక్కిలి తాను చేతులార శిక్షించిన కల్పలత కనుపించింది. ఒకవైపు అంతులేని దుఃఖము, వేరొకవైపు మితిలేనిపరితాపము; ఒకటి చేతిలోనుండి జారిపోయినది, వేరొకటి జారిపోయి చేతజిక్కినది; ఒకటి అలభ్యము, వేరొకటి అమూల్యము. తనకు కనుపించకుండ ఈనెలరోజులనుండి విమల తనకడ దాసీగానియమించియున్న స్త్రీ కల్పలతయేనని అప్పుడు తెలుసుకున్నాడు. విమలయొక్క సౌజన్యానికి, కల్పలతయొక్క త్యాగానికి ఆశ్చెరువు పడ్డాడు. అన్నివిధాలా తానే నిర్భాగ్యుడనని అనుకున్నాడు......అట్లాగే నిద్రలో మునిగిపోయినాడు. రాత్రి రెండుగంటలైనది. పసుపుపచ్చని చీరగట్టుకొని చేతహారతిపట్టుకొని పూలు పండ్లు పళ్ళెంలోపెట్టుకొని నవ్వుకుంటూ విమల వచ్చింది. పూలతో మోహనుని పూజించింది. వినయంగా "నేను మిమ్మువదలి వచ్చేశాను. నాకన్న గుణసంపత్తిగలసాధ్వి, నాఅక్క అగు కల్పలతను నాస్థానంలో నియోగించాను. నాకుమారుని ఆమెకే అప్పగించాను" అనిచెప్పి వెళ్ళిపోయింది. మోహనుడు మేల్కొని తనకు వచ్చిన కలకు తానే ఆశ్చర్యపోయినాడు.

౮

అది వెన్నెలరాత్రి. నిమ్మచెట్లనీడలు నల్లగా తోటలోనున్న రాతిఅరుగుపై పడుతున్నవి. అక్కడకు సమీపంలోనున్న బంతిచెట్లవద్ద ఇద్దరు యువతీయువకులున్నారు. సమీపంలో ఒక ఉయ్యాల తొట్టిలో రెండునెల్లపిల్లవాడు నిద్రపోతున్నాడు. అంతా నిశ్శబ్దంగాఉన్నది

"ఇది ఎట్లాఅంటానికి వీలులేదు. విమల చనిపోవటం గొప్పలోటు. ఆమెతోసహా నేను మీపాదసేవ చేయగలభాగ్యం నాకు కలుగలేదు. ఆమెను అన్యాయంగా తొలగించి భగవంతుడు నాకాస్థానం ఇచ్చాడు. అందుకు నేనెంతో దుఃఖపడుతున్నాను." అన్నది కల్పలత.

"విమల చనిపోవడం నాకొక బల్లెపుపోటువంటిది. ప్రథమంలో నిన్నువదలి, అంతతో విరమించక నీకు ఆరునెలలు కఠినశిక్షవేసి, తుదిని నిన్నే చేపట్టినాను. ఈవిధంగా భగవంతుడు చేస్తాడని ఎవరనుకున్నారు?" అని మోహనుడన్నాడు.

"ముమ్మాటికి నేను విమలను మరువలేను. చనిపోయేటప్పుడు ఆమె నాకు చెప్పినపలుకు ఇంకాచెవిలో మ్రోగుతునే ఉన్నది. ఒక విధంగా నేను ధన్యురాలను, వేరొక విధంగా పరమనిర్భాగ్యురాలను." అని కల్పలత కంటనీరు పెట్టింది.

ఇంతలో ఉయ్యాలలోపరుండియున్న పిల్లవాడు నిద్రలేచి ఏడవటం మొదలుపెట్టేడు. ఇద్దరూ ఆవైపునకే పరుగెత్తారు.



# రాజ్ఞీరుద్రమదేవి

శేషాద్రి రమణకవులు

కఱకుఁదనంబు నిబ్బరము గల్గని స్త్రీజనమం దొకర్తవై
కఱకటియందుఁ బూరుషులఁ గాదని నిస్తులరాజ్యభారమున్
నెరపితి వెల్లభూవిభులు నిన్ జయపెట్టఁగఁ, బ్రౌఢిమహామహీ
వరులకు నీకు నెందుఁ గనుపట్టునె భేదము రుద్రమాంబికా!

గుణమణిభాసమానవగుఁగూతును నిన్ గని మోదసాంద్రుఁడై
గణపతిదేవభూవరుఁడు కారణజన్ముఁడుగాఁ దనర్చె; నిన్
బ్రణుతియొనర్చి సర్వనరపాలురు నిర్భయజీవులైరి; నీ
గుణ మది మార్గణౌఘమునకున్ ఘటియించెను ధర్మబంధమున్.

కేలను విల్లుదాల్చి పెరకేలను బాణములూని వైరిభూ
పాలురఁ బాఱదోలు నిను భారతమాతయొ, నాంధ్రలక్ష్మియో,
కాళియొ, సత్యయో యనుచుఁ గైసరు లల్లినపద్యరత్నముల్
జాలును నీదు విక్రమరసంబును నేటికి సంస్మరింపఁగన్.

పరిపాలనక్రియాపటిమ కబ్బుర మంది
ప్రజలెల్లరును జయధ్వను లొనర్ప
శ్రీరూపుఁడగు సదాశివుఁ డీమె యగునని
విపుల విద్యానాథకవి నుతింప
ధర్మదేవత సతీత్వము నొందె నిట్లని
జగతీసుపర్వులు సంస్తుతింప
ప్రత్యక్షమృత్యుదేవత యీమె యగునంచుఁ
బ్రత్యర్థిభూపతుల్ భ్రాంతి నొంద
అద్వితీయమహానిష్ఠ నాంధ్రరాజ్య
పాలనము నల్వదేడు లెవ్వతె యొనర్చె
నామహామాత నర్థించి యాత్మశక్తి
తలఁచుకొనరాదె యువతీకదంబకంబు.

అదను గ్రహించి దేవగిరియాదవరాజులు సర్వసైన్యసం
పదలను వెంటఁబెట్టుకొని వచ్చి రణంబున కోహటించి ది

గ్వదితభవత్ప్రతాపశిఖివేఁడిమి కోర్వక పాఱుఁబోతులై
బ్రదుకుమి జీవుఁడా యనుచుఁ బాఱిరి నీకెవరీఁడు సాధ్వరో!

శివదేవుం డుపదేశకుండు, రిపురాట్సింహంబు రేచెర్లగో
త్రవరిష్ఠుండు, ప్రసాదనాయకుఁడు నీదాసుండు, శ్రీతిక్కరా
ట్కవి యాశీఃప్రదుఁడౌ గురుండు, ధరణీకాంతావతంసంబు ని
క్కువపున్నెచ్చెలికత్తె; సాటియెది నీకుం ధాత్రి రుద్రాంబికా!

అనితరరాజనీతివిదుఁ డౌ పితస్వర్గతుఁడయ్యె, ధర్మవ
ర్తనుఁడగుభర్త చెల్లె, రిపురాజదురుద్యమపాటవంబుచే
జనపదముం జలించెనని జంకక సర్వవసుంధరాభరం
బును భుజపీఠిఁ దాల్చు నిను బోలునె యెంతటిసార్వభౌముఁడున్.

ప్రకృతిచిత్రంబులఁ బాషాణములపయిఁ
  జెలువుగాఁ జిత్రింపఁజేసినావు
సడలినయాంధ్రతేజంబు చక్కఁగ దిద్ది
  సామ్రాజ్యపాలన సల్పినావు
అన్యభూవిభులచే నాంధ్రలక్ష్మికి సేవ
  జేయించి విఖ్యాతిఁజెందినావు
లక్ష్మిసరస్వతులకుఁ జెల్మివాటించి
  దేశహితంబు సంధించినావు.
ఘనజయస్తంభములను దిగ్గజశరీర
కషణశిలలుగ నొనరింపఁగల్గినావు
సాటి నీకెవ్వరమ్మ? రాజన్యమకుట
రత్ననీరాజితాంఘ్రి! రుద్రమ్మరాజ్ఞి!

సడలెన్ నిస్తులభాసురాంధ్రనగరీసౌభాగ్యసంపత్తి; పెం
పడరెన్ బ్రాక్తనశిల్పసంపదకు; శూన్యక్షేత్రమైపోయె నీ
యడుగుందమ్ముల కాస్పదంబయిన హర్మ్యశ్రేణి: యీనాటి కే
ర్పడు నీనిర్మలకీర్తిచంద్రరుచు లోరంగంట రుద్రాంబికా!

శాతాసిన్ గరమందుదాల్చి రిపురాట్సైన్యంబు జెండాడు నీ
జ్యోతిర్మూర్తికి సర్వకాలమును నే జోహారుగావింతు, ద్విడ్
వ్రాతప్రాజ్యకిరీటరత్నరుచిరప్రత్యగ్రయుష్మత్పద
ప్రాతర్భానుమహస్స్వరూప మెద సంభావింతు రుద్రాంబికా!

# "నర్తనశాల" లో ద్రౌపది

పురాణం కుమారరాఘవశాస్త్రిగారు బి. ఏ.

ఆంధ్రసారస్వతంలో బంగారుఅక్షరాలతో చెక్కబడింది విశ్వనాథ సత్యనారాయణగారిపేరు. ఆయన అపూర్వలేఖిని చిత్రించిన నాటకం "నర్తనశాల" అంటే. అది చదువుతూంటే చాలమనోహరంగా వుంటుంది. అందులో కీచకుడు కథానాయకుడు. కథావస్తువు భారతమునుండి గ్రహింపబడింది; కీచకవధ.

పురుషుల జీవితంలోనేకాదు స్త్రీల జీవితంలోకూడా కొన్ని క్లిష్టపరిస్థితులు కలుగుతవి. అప్పుడే ధర్మమార్గాన్ని తప్పకుండా వాటిని తప్పించుకొని బయటపడటంలోనే వ్యక్తిసామర్థ్యం వ్యక్తమౌతుంది.

రానున్నకష్టాలు రత్నపంజరములోనున్నను రాకమానవు. శ్రీరామునంతవాని అర్థశరీరమైకూడా సీత పడరాని యిడుమలకు లోనైంది. సర్వసర్వంసహాచక్రవర్తులైన ఐదుగురుభర్తల బాహుదుర్గాల్లో పరిరక్షింపబడుతున్న ద్రౌపదికూడా అనేకమార్లు పరిభవింపబడింది జీవితంలో. దుశ్శాసనునిచేత నిండుసభలో మొదటిసారి. రెండవసారి జయద్రథునిమూలాన. కీచకుని బారినిపడినప్పుడు మూడవసారి.

పాండవుల అజ్ఞాతావసలో మాలినిఅనేపేర ద్రౌపది సుదేష్ణఅంతఃపురంలో తలదాచుకుంది. సేవావృత్తికికూడా పాలుపడవలసివచ్చింది పాండురాజుకోడలు. అయినా నైచ్యము బొరయనంతవట్టు తాచేయవలసినపనులు చేస్తూ యజమానురాలి మనసుకెక్కింది. "ఆమెను చూచినచో పూజింపవలెనను బుద్ధి వొడమును" అని కీచకునికిచెప్పినవాక్యాలనుబట్టి సుదేష్ణకు ద్రౌపదియెడల ఎలాంటిగౌరవభావమో తెలుస్తుంది. ఉత్తరకూడా ద్రౌపది గ్రుచ్చిన పూలమాల తన మామకిచ్చిన బాగుండదేమోనని వేరే పుష్పాలు తెప్పించుకుంటుంది.

సుదేష్ణఅంతఃపురంలో ఒకనాడు ద్రౌపది పూవులమాల గ్రుచ్చుతూవుండగా కీచకుడామెను చూస్తాడు. చూచేచూడడంతోనే అతనిమనస్సు మోహప్రపూర్ణమై పోయింది. ఉపవాసకృశీభూతమైన శరీరంతోకూడా ఆమె తనకొకచంద్రరేఖలా కనుపిస్తుంది. "ఏడుదీవుల రాజ్యంబు లేలుటకు" తగిన తేజస్సు ఆమెలో చూస్తాడు. 'Beauty provoketh more than gold' అనగా సౌందర్యమే బంగారముకన్న ఎక్కువ ఆకర్షణశక్తిగలది అన్న న్యాయాన్ని పురస్కరించుకొని కీచకునికి దురూహ కలిగింది. తనకంటియెరుపుమహిమను చూపుతూ ఆమెను పలుకరింపబోతాడు. అతనిమనోభావం వెంటనే గ్రహింపగలిగింది ద్రౌపది. అప్పుడతనితో సంభాషించుట అసభ్యమని ఆమెకు తెలుసు. కనుక మౌనముతో వెళ్లిపోయింది సుదేష్ణతో చెప్పి అల్లాంటిది మరోసారి జరుగకుండా కాచుకునేటందుకు.

కాని విధివశంచేత మళ్లీ కీచకునిదృష్టుల్లో పడ్డది పూలమాల సుదేష్ణ కివ్వపోయే దారిలో. "ప్రేయసీ!" అని సంబోధించి అతడు తనమోహాన్ని వెళ్లగ్రక్కినాడు. ఒంటిగా చిక్కింది అబల. ఏమిచేసినా చేయగల డాకాముకుడు. అట్టి తరుణంలో ఆమె సమయస్ఫూర్తి కొనియాడతగింది. "అన్నా!" అని సంబోధిస్తుంది మొదట. దానితో అతని మోహకీలికలన్నీ అదృశ్యమై చల్లబడవలసినవాడు. తరువాత ఆమె తానొక వికృతాకారినని చెప్పుతుంది. పరియాచకములాడుటకు తనకంటె తగినవారితరులున్నారని అతని మనస్సు మరలిస్తుంది. తానొక దాసీట; అందులో నికృష్టదాసీట. దాసీసంగమము లాయుఃక్షీణములు గనుక తనమీది వాంఛ వదలుకొమ్మని అతనికి ధర్మప్రబోధము.

కాని కీచకునితత్వం వేరు. "ఏమి ఆయువు లేకపోయిన? బ్రతికియున్న నాలుగుదినములు సుఖముగానుండవలె" నంటాడు. తన ప్రేమ రమణీమూర్తిలో ప్రతిఫలించగా చూడవలెనని ఆరాటపడ

తాడు. ద్రౌపదివంటి సౌందర్యవతియైన స్త్రీ తనకు లభించినప్పుడే జీవితఫలం దక్కిందిట. అప్పుడు ఆయువు తరిగితేనేమి ? మిగిలినదే అనుభూతమా నన్నాడు.

ఇకనేమి చేయగలదు ద్రౌపది? ఒక్కసారి అతనిఆత్మగౌరవమునకు మేలుకొలుపు చెప్పింది. "నీవేమో తృణీకృతాఖిలమత్స్యదేశశాత్రవుడవటే; ఇది నీకు యోగ్యముకాదు" అంటుంది. "అట్టివాడివి నీవుకూడా ఇలా ప్రవర్తించడం నీచం కాదా!" అని. అతని ఆత్మకు తగులవలసినబాణాలు అవి. కానిమోహగ్రస్తుడైఉన్నాడతడు. అందుకనే "కనబడుచున్న దివ్యతేజస్సును చల్లార్పకు"మంటూ చేయి గ్రహింపబోతాడు.

ఇంతవరకు సౌమ్యం పనిచేయలేదు. ఆమె తొలగి,

"నావెంటన్ నిరతంబు కాచికొనియున్నా రేవు రస్మత్పతుల్
ద్యావాభ్యంతరగాము లెందయిన గంధర్వుల్ స్వకీయోగ్రబా
హావిధ స్తసమ స్తశాత్రవసమూహానంతకీర్తిస్ఫురత్
శ్రీవిద్యోదితమూర్తు లాకెలన నీ చేటింతయున్ తప్పదే."

అని మేఘఘోషము చేస్తుంది అతడు భయపడతాడని. బలగర్వియగు కీచకు డామాటలు నిర్లక్ష్యము చేశాడు. "మహాగ్నిని ఫలమని భ్రమించుచుంటివి" అని మరో బెదిరింపు. కాని కీచకు డామాటలు లెక్కచేయకుండా ఆమెను సమీపించాడు. ఆక్లిష్టపరిస్థితిలో ద్రౌపది సంభ్రమించి "సుదేష్ణా! సుదేష్ణా!" అని కేకవేసినది నిజమే. కాని అంతటితో నిరుత్సాహపడి మూర్ఛిల్లిపోలేదు సీతకుమల్లే. మరొక్కబాణం విడిచిచూచింది "అయ్యా! నీ యీ ప్రవర్తన మీ యక్కగారి అంతఃపురగౌరవమునకు భంగకరమైనది" అని. ఈ సారి గురితప్పలేదు బాణం; కీచకుడు నివ్వెఱపోయాడు, "మంచిమాట జ్ఞాపకముచేసితి" వన్నాడు. వెంటనే అచ్చోటు బాసిపోయాడు. కాని ఆమెమీదివాంఛ అతన్ని వదలకుండా పీడిస్తూనేవుంది. నాటకంలో కీచకుడు భారతంలోలాగా కేవలము మూఢుడూ దుర్గర్వీ కాడు. అతడు మేధావి, బలశాలి, శారద్వతుడు చెప్పినట్లు 'మహానుభావుడు.' ఐనా మోహమనే దుష్టగుణమువచ్చి అతన్నిత్రుంచుకపోయింది. షేక్సిపియర్ వ్రాసిన కష్టాంతనాటకాల్లో కథానాయకులూ అంతే. వాళ్లెంతగొప్పవాళ్లైనా మానవమాత్రులే గనుక ఏదో ఒక మనోవృత్తికిలోబడి చివరకు తన్మూలాన్నే ప్రాణాలు కోల్పోతారు.

ద్రౌపదికి మానవుల హృదయాల్లో జొరబడి వాళ్ళస్వభావం గ్రహించగల తీక్ష్ణమైన లోచూపు వున్నది. ఆమె వల్లకిని మొదటినుంచీ అనుమానిస్తూనేవుంది. 'దాని ప్రవర్తన బాగుండలేదు.' అని ఆమెకు తెలుసు. అందుచేతనే తనను కీచకునింటికి పోయి మద్యము తేవలసినదిగా సుదేష్ణయాజ్ఞయైనదని వల్లకి చెప్పినప్పుడు ఆమె నమ్మక సుదేష్ణ నడిగిచూచింది. కాని వల్లకి ఏదో మత్తుపదార్థము కలిపి త్రాగించిన మద్యము తలకెక్కి అన్నిటికి "ఊ, ఊ" అన్నదామె. ఇక పట్టమహిషియాజ్ఞ యైనట్లేకదా!

ఇక ద్రౌపది మద్యముకొరకు పోయిందా ఒక పెద్దపులిగుహలో చిక్కుపడుతుంది. పోకపోయిందా తన భర్తల ధర్మమార్గసంచారిత్వమునకు తనమూలమున కళంకము రాగలదు. ఏమి గౌరవము భర్తలయెడ! పోవుటకే నిశ్చయించుకున్నది. ఇక్కడ సేవాధర్మము పూర్తిగా నిర్వర్తింపబడ్డది.

ద్రౌపది మళ్లీ మనకు కీచకునింటిలో కనుపిస్తుంది. కీచకు డామెను నీచముగ పలుకరించి కౌగిలించుకోపోయినాడు కూడా. అప్పుడు పలాయనముకంటె వేరుపాయము కనుపించలేదాపతివ్రతకు. రాజవీథులలో ముందు ద్రౌపది వెనుక కీచకుడు పరుగెత్తుతున్నారు. సాక్షీభూతురాలై సంభ్రమముతో అవ

లోకిస్తూవున్నది ఉత్తర ఈ పరుగుపందెమును. రహస్యభేదనము కాకుండా తనభర్తలను మారుపేరులతో తన్ను రక్షింపరమ్మని కేకవేసింది ద్రౌపది. కీచకుడు కొంతవరకు వెంబడించి ఉత్తరను చూచి సిగ్గుపడి వెనుతిరిగి పోయాడు.

తరువాత ఉత్తరయెదుట ధర్మరాజుతో మాట్లాడుతూఉన్నప్పుడు ద్రౌపది చూపినవాక్చమత్కృతి అద్భుతం. తమరహస్యభంగం కాకుండా తనహృదయవేదన ఆయన కెరిగించింది; ఆయన సలహా గ్రహించి వెళ్లి పోయింది. అంత ప్రజ్ఞాచాతుర్యం ఉండబట్టే భర్తలతో అజ్ఞాతవాసం నెరపుటకు సమర్థురాలైంది ఆమె. సీతవంటి ముగ్ధ ఐతే తనకష్టాలేకాకుండా భర్తలకష్టాలుకూడా ఇనుమడించేవి.

ధర్మరాజునెదుట తనభర్త జూదరనీ, వంటలవాడనీ, నటుడనీ, పశువులకాపరనీ ద్రౌపది తూలనాడిందని తోస్తుంది ఆమాటలు పైపైన చదివేస్తే. కాని అలా అనడంవలన్నే తనయనుభవము ధర్మరాజుకు పూర్తిగా తెలియబడుట ఒకటీ, "మీరు అజ్ఞాతవాసమున కనుకూలముగ నేర్పరచుకొన్న ఉద్యోగములూ, వేసములు మీసహజధైర్యమును కప్పిపుచ్చినవా? కీచకుని చంపవలసినయావశ్యకత ఎరుగరా?" అని భర్తలకు ఆదేశము రెండూ, తత్కర్తవ్యమునకు వారిహృదయము లుద్రేకపూరితములుగా చేయడం మూడూ—ఇన్ని ఉద్దేశాలు నెరవేరినై. అంతేగాని తిట్టుకాదు; అప్పు డామాట లనవలసిందే అలాగ. ఆ పతివ్రత అనేకసార్లు తనభర్తలనుగురించి ఎంతోగౌరవముగా ప్రసంగిస్తుంది. స్త్రీచిత్తము, పురుషుల భాగ్యమూ గనుక తనభర్తలు ఇడుములు పడుతున్నారంటే అదంతా తనమూలాన్నే అనుకుంటుంది. పాలదుత్త తీసికొని సహదేవుడు వచ్చినప్పుడు, సంవత్సరమునుంచీ పశువులుకాసినందున అతనిలో కలిగిన మార్పు చూచి ఎంత నొచ్చుకున్నది! యుధిష్ఠిరునుద్దేశించి ఆమె యేమంటుందో చూడండి:

"ఓ జయ! గ్రహింపు నీ పదాంభోజములకు
నా నమస్కృతు లివిగో శాంతత్వమెల్ల
కరడు గట్టియయ్యె, భవదాకారమట్లు
ఇంద్రియజయంబులేని మే మిట్టులుండ"

ఈ విధంగా భర్తల గౌరవాన్ని గుర్తించి, వారి ఔన్నత్యాన్ని కోరుతూ, కష్టసమయాల్లో వారిని అనుసరించివున్న ద్రౌపదివంటి పతివ్రతకు కళంకము తెచ్చిపెట్టలేము.

యుధిష్ఠిరచక్రవర్తియాజ్ఞనిర్వర్తించుటకూ, ప్రియురాలిని చూచుటకూ వచ్చిన సహదేవుడు "నేటి రాత్రి రెండుజాముల కు నర్తనశాలలో పెద్దయుద్ధమట!" అని మాత్రమే చెప్పినాడు. ఈ సూచన చాలు ద్రౌపది తనభర్తలయుద్దేశమూ, తనకర్తవ్యమూ గ్రహించుటకు. "నా భర్త లెంత యుద్దేశించినారు. నేనిప్పుడు కీచకునకు కబురెట్లు పంపుదును?" అనుకుంటుంది. ఎంత చురుకైన బుద్ధి! ఆ అజ్ఞాతావస్థలో పాండవులకు తగినభార్య.

కీచకుడే వచ్చాడు విధిచేత తరుమబడి. "పాంచాలీ!" అని సంబోధించి ద్రౌపదిమొగమువంక నిదానించి చూచాడు తన సంశయనివృత్తి చేసికొనుటకు. కాని యామె బుద్ధిబలము మెండు. చలింపనీయ లేదు తన మనస్సును. కొంచెమైన వికారము కనుపించెనా రహస్యము బయటకు ప్రాకిపోవుటలో అనుమాన మేమున్నది!

రాత్రి రెండుజాములకు కీచకుని నర్తనశాలకు రమ్మనిచెప్పి ద్రౌపది వెళ్లిపోయింది. కీచకుని చంపు పనికి భీమసేనునే సార్వభౌముడు నియోగించియుండవలెనని ఆమెసూక్ష్మబుద్ధి గ్రహించినది. అతన్ని ఉత్సాహపరచుయత్నంమీద వెళ్లింది. వెళ్లి 'రుచిగల నీ వంటకంబులు నాకీపూట తృప్తిగలిగించగలవు'

అంటుంది అతనితో. "మా యన్నగారి యాజ్ఞ నీమె యనుసరింపుమనుచున్నది" అనేభావంతో ఆమాట లతనిహృదయంలో మారు మ్రోగినై.

ఈ క్షణమునుంచీ కీచకునినెత్తురు చూచేవరకూ ద్రౌపదికి నిద్దురపట్టలేదు. సుదేష్ణోత్తరలు నిద్ర పోయిన తరువాత నర్తనశాలలోకి పోతుంది ఆరాత్రి వర్షంలోతడిసి. అక్కడ భీముణ్ణి కలుసుకొని తనపైట కొంగు వర్షపునీటితో కాదుట తడిసింది; కీచకుని నెత్తురుతోనని చెప్పుతుంది. దానితో భీమునికోపము రెచ్చి పోయి 'వాడు చచ్చినాడు' అని పంద్లు కొరుకుతాడు. భీమసేనుడు కొంతసేపు కీచకునితో చమత్కారము నెరపి అతన్ని నర్తనశాలలోపలికి ముందు నడువుమనిచెప్పి పాంచాలిని పిలుస్తాడు తిన్నగా. ఆమెవచ్చి 'చచ్చినాడా?' అని అడుగుతుంది ఆతురతతో. ఎంత కాఠిన్యమైన మనస్సామెది! ఔను కఠినమే తనశత్రు వులయెడ. పన్నెండుసంవత్సరముల పూర్వము తన్ను సభలో పరాభవించిన దుశ్శాసనునిపై, అజ్ఞాతవాసము పూర్తికాగానే పోయి పగదీర్చుకోవలెనని ఎంత యారాట మామెను!

అట్లని స్త్రీమార్దవ మామెకులేదనలేము. ప్రేమార్ద్రమైంది ఆమెహృదయం. అందుకు ఉత్తరపై ఆమెకు గల మాతృప్రేమే తార్కాణ.

"ఆమెను చూచినప్పుడు నామనస్సేలనో ద్రవించుచున్నది. ఆయమ నవ్వినప్పుడు మా శశిరేఖ నవ్వి నట్లుండును" అంటుంది ద్రౌపది ఉత్తరనుగూర్చి. ద్రౌపదికి ఉత్తరయిచ్చిన యోగ్యతాపత్రం ఒకటివున్నది; అది మన మీసమయములో చూడదగ్గది; "అప్పుడప్పు డామె (ద్రౌపది) మిక్కిలి దయగా చూచుచుం డును. ఆచూపు తల్లి తనబిడ్డమీద ప్రసరింపవచ్చును. ఒకమహారాజ్ఞి తనపరిజనముమీద ప్రేమగలిగినప్పు డట్లు చూడవచ్చును.

రామాయణకాలంలో స్త్రీలు కేవలం ముగ్ధలనీ, భర్తలమీదనే ఆధారపడివుండేవారనీ, అంతః పురంలో నేర్చుకున్న పాతివ్రత్య ధర్మాన్ని ముక్కుకుముక్కా ఒప్పజెప్పేవారు మాత్రమేననీ సీతవల్ల తెలు స్తుంది. కాని భారతకాలానికి వచ్చేటప్పటికి స్త్రీలు ప్రజ్ఞానిధులౌతారు. వారివివేకము, దూరదృష్టి చూస్తే పురుషులుకూడా వాళ్లకు వెనుకపడతారని తోస్తుంది. ద్రౌపదీ, సావిత్రీ, దమయంతీ ఇందుకు సాక్షులు. ఇట్లే ప్రస్తుతకాలంలోగూడా మన స్త్రీలోకము ప్రజ్ఞాదీప్తము కాగలదని ఆశయము.

## పరమాత్మ

పంతుల విశ్వనాథముగారు

ప్రకృతినంతయుఁ దిలకింపఁ బట్టుపట్టి
ఏ నదృశ్యుండనై యుంటినేమొ? కాక
జ్ఞానభానూదయంబు అజ్ఞానజలధి
కలుగునందాఁక నను నేను కాంచలేనొ?
దినకరప్రభ యైనట్టి తేజమేను
గ్రహములందును తారకాగణమునందు
చంద్రునందున్న కాంతిపుంజంబు నేను.
వనిత! పురుషుడు బిడ్డ యావనుఁడు నేనె
చీమనేనె సామజమేనె దోమనేనె
తరులతాగుల్మములు నేను తలిరునేను
పక్షియు మృగంబు నేనె పుష్పమును నేను

మెఱుపునేను వెలుగునేను మేఘమేను
పంచభూతములేను ప్రపంచమేను
అన్నిజన్మించి నాయందె యంతమొందు
ఏను నాయందె పుట్టితినేమొ? కాక
లేదొ జన్మంబు నాశములేదొ నాకు
వచ్చుచుండెద పోయెద వాదులేల?
గాఢమైనసుషుప్తినిఁ గాంచుచుంటి
కలయొకటి, దానియందున కష్టసుఖము
లెన్నియున్నను నాకేమి? ఏను సత్య
సంతతానందమూర్తిని జగతియందు.

# దీనబంధు ఆండ్రూసు

శ్రీమతి యల్. సత్యవతీబాయిగారు

౧

ఇది అనేక వత్సరముల క్రితమునాటి మాట. ఆదినములలో బొంబాయినగరమున మహాకవి రాబర్టుబ్రౌనింగును గూర్చి కీర్తిశేషులైన సర్ యన్. జి. చందావర్కారు గారు పక్షమున కొకసారి ఉపన్యాసముల నొసగుచుండిరి. లిప్తమాత్రము సమయము తప్పని ఉపన్యాసకులు నాడుమాత్రము మేలకొ జాగుచేసిరి. విద్యార్థులు లేచిలేచి తుదకు విసిగి తమతమయిండ్లకుబోవ నుద్యుక్తులైరి. అంతలో చందావర్కారుగారు "భారతసంఘసంస్కారి" (The Indian Social Reformer) సంపాదకులగు నటరాజనుగారితో ప్రవేశించిరి. వారి వెను వెంటనే చిరునగవుతో ఒకవిదేశీయుడులోనికి నడచెను. విద్యార్థులందరు మర్యాదాపూర్వకముగా లేచి నిలచిరి.

"వీరు సి. యఫ్. ఆండ్రూసుగారు. భారతీయ పారిశ్రామికుల స్థితిగతుల నరయ ఆఫ్రికాకుబోయి అటనుండి నేడే మన నగరమునకు దయచేసియున్నారు" ఈ మాటలతో చందావర్కారుగారు విద్యార్థుల కావిదేశీయుని పరిచయమొనర్చిరి. అంత ఆండ్రూసుగారు ముందుకునడచి ప్రతివిద్యార్థితో మనసార కరస్పర్శనమొనరించిరి. "అయ్యా! తామొనర్చినసేవకై భరతభూమి మిక్కిలికృతజ్ఞురాలై యున్నది"అని యొకయువకుడుపలికెను.

క్షణమాత్రము వ్యవధిలేక "ఎంతమాత్రముకాదు. నాకొనర్చినమేలుకై భరతభూమికి నేనే ఎంతయు కృతజ్ఞుడను" అని జవాబువచ్చెను.

నాటినుండి నేటివఱకు ఆండ్రూసు జీవిత ధోరణి యిదియే. తా కొలుచు దీనదేశమే తనకుదాత. తానుద్ధరించు దీనజనులకే తా కృతజ్ఞుడు. అందుకనే దీనబంధుడను నామమాతనియెడ సార్థకమయ్యెను.

౨

కొన్ని వర్షములు గడచిపోయెను. పంజాబులో అరుణకిరణములతో సూర్యుడస్తమించుచుండెను. ఒకపల్లెలో వృద్ధుడగు సిక్కుభటు డొకమఱ్ఱినీడను నిలచి ఏమియో తలపోయుచుండెను. అతని ఫాలము ముడివడియుండెను; నేత్రములు తీక్ష్ణములై యుండెను. 1919-వ సంవత్సరమున తాసైచిన దారుణకృత్యము లింకను నాతని హృదయమును కలచుచుండెను. ఆతని సమీపించి, "అన్నా! ఆ ఘోరదినములలో నీకు గలిగిన ఆపద తెలుపవా?"యని ఆండ్రూసు వినయమొలుక ప్రశ్నించెను.

వృద్ధు డుత్తరమీయక మిన్నకుండెను. ఆండ్రూసు మరల ప్రశ్నించెను. కాని జవాబులేదు. కరుణతో, కలతతో, ఉద్వేగముతో మరల మరల ప్రశ్నలుకురిసెను. తుదకు ముదుసలి మౌనముతో తాధరించిన దుస్తులువిచ్చినాటిఘాతచిహ్నములజూపెను.

ఆవేదనతో అశ్రులురాల్చుచు "అన్నా! అన్నా! ఈఘోరాపరాధము గావించిన నాజాతిని మన్నింపు"మని ఆండ్రూసు మోకరించి వేడుకొనెను.

వృద్ధవీరుని హృదయము కరగిపోయెను. సాదరముగ ఆండ్రూసును లేవనెత్తి గద్గద స్వరముతో "అయ్యా! ఈ లోకమున

నీబోటిఆంగ్లేయు డొక్కడు జీవించియున్నంత వఱకు ఆంగ్లజాతియెడ నే నీర్ష్యవహింప జాలను" అనిపలికెను.

పశ్చాత్తాపాశ్రువులు పాపపంకిలమును కడిగివేసెను. ఆంగ్లభూమికి పాపవిముక్తి కలిగెను. తన్నుగన్న ఆంగ్లమాతనీతిచరిత ముద్ధరించుటయే ఆండ్రూసు దేశభక్తికి పరమావధి.

3

మఱియొకవత్సరము - మఱియొకరంగము.

హోరుమని కుంభవృష్టిగ వర్షముకురియుచుండెను. శాంతినికేతనమున కుటీరపు టరుగుపై కూర్చొని ప్రేమాస్పదుడగు మోహానునికి (గాంధికి) ఆండ్రూసు జాబు వ్రాయుచుండెను. అంతలో "బాబా! షీత్ లగ్తీ (అయ్యా! చలివేయుచున్నది)" యనెడి దీనాలాపము వినవచ్చెను. తలయెత్తి చూడ వస్త్రవిహీనుడై వడవడ వణకుచు ఒకమూల నిలచియున్న ముదుసలిబిచ్చగాడొకడు కాన్పించెను. ఆండ్రూసు చివాలునలేచి లోపలికిజనెను. మూలనున్న బట్టల పెట్టె తెఱచి అందునుండి క్రొత్త చక్కని, కాశ్మీరపు ఉన్నికోటు నొకటి వెలికిదీసెను. బిరబిర బయటకునడచి దాని నాబిచ్చగానికిచ్చెను. వృద్ధుడు ముగ్ధుడైపోయెను. ఇది కలయా నిజమా యని నివ్వెరపడి చూచుచుండెను. జాలి జూరగొన్న చిరునగవుతో ఆండ్రూసు భిక్షుని తిలకించుచుండెను. అంతలో మెల్లగా చల్లగా జంకుచు రెండు పెద్దకన్నీటిచుక్కలాతని కన్నులనుండి రాలెను.

దరిద్రనారాయణుని సేవనమే దీనబంధుని పరమమతము. కనికరపుకన్నీటికణములే తానొసగు పూలకానుకలు. ఇదియే యాతని అమోఘమగు ఈశ్వరారాధన.

4

మఱి కొన్నియేండ్లుదాటిపోయెను. రంగమింకొకతూరి మారిపోయెను. మోకాళ్ళ వఱకు ధోవతినెత్తికట్టి ఒకచేతశాలువ, వేరొకచేత తోలుసంచి గొని ఆండ్రూసు కలకత్తా నగరమున వడివడి నడచిపోవుచుండెను. ఒక బాటమలపులో "అమృతబజారుపత్రిక-అమృతబజారుపత్రిక" యని ఎలుగెత్తి యఱచుచున్న బాలు డొకడు కంటబడెను. వానిబిలిచి సంచిదించి పత్రికయొక టిమ్మని ఆండ్రూసుకోరెను. బాలుడిచ్చినపత్రిక గొని కాసులకొఱకై మీదిజేబులో చేయినిడెను. అందుగానక క్రిందిజేబులు తడవిచూచెను. తదుపరి లోపలిజేబులు గాలించెను. ఒక్కదమ్మిడీకూడ చిక్కదాయెను. అనవసరముగ శ్రమనిచ్చినందుకు క్షమింపుమని కోరుచు ఆండ్రూసు పత్రికను తిరిగి యివ్వబోయెను. ఇంతదనుక నాతనిమోము పరీక్షించి చూచుచున్న యాబాలుడు దానిని దీసికొననొల్లక "అయ్యా! మీ పటమును నేను పత్రికలలో పలుమారు చూచియున్నాను. తాము ఆండ్రూసుమహాశయులుకారా? దయతోడ మీరాపత్రిక నుంచుకొనుడు. మాదీనబంధువునుండి మేము పైకము దీసికొందుమా?" యనినుడివి తనదారి దాబోయెను.

ఆండ్రూసుహృదయమున ఆనందగర్వము లుప్పొంగిపోయెను. దీనబాంధవునికి దీనుల హృదయమునకు మించిన మహదైశ్వర్యము వేరేమికలదు?

# తొలిబిడ్డ

తాత కృష్ణమూర్తిగారు బి. ఏ; యల్. టి.

కాపురానికి వచ్చిన మూడేళ్ళదాకా నాతర్ఫీదులోనే ఉంచుకోగలిగాను లక్ష్మిని. అన్నివిషయాలలోను నాయిష్టప్రకారమే నడుచుకునేది...తుదకు బట్టకట్టులోను, తలదువ్వుకోవడంలోను సహా! నన్ను గురునిగా, హితునిగా, దేవునిగా భావించి ప్రేమించి పూజించేది. నావద్ద యేసంగతీ దాచేదికాదు. నాసలహాకు వ్యతిరేకంగా ఏపనీ చేసేదికాదు. నాలో ఉండే లోటుబాట్లుకూడా ఆమెకళ్ళకు సుగుణాలుగానే కనిపించేవి కాబోలు! అట్టి అమాయికపు స్నేహం, అగాధమగు ప్రేమ, లభించినందుకు ఎంతో గర్వంగా ఉండేది నాకు. నాయిష్టానికనుగుణ్యంగా నవీననాగరికత ననుసరించి ఆమె తనరూపంలోను, నడవడికలోను, అభిప్రాయాలలోను చూపుతూ వచ్చినమార్పునకు వెర్రిసంతోషంతో నాట్యంచేసేది నాహృదయం. పల్లెటూరిపిల్లను పాశ్చాత్యబాలికవలె తయారుచేయగలుగుతున్నందుకు నాలోనేను మురిసిపోయేవాడిని. బంధువులు, యిరుగుపొరుగువాళ్ళు మమ్ముచూసి ఆక్షేపిస్తారనికాని, ఆయిష్టపడతారని కాని భయపడేస్వభావం కాదునాది. వంకపాపిట, వాలుజడ, వాయల్ జాకెట్లు, లేసుచీరలు, కొప్పుపిన్నులు, మఖ్మల్ స్లిప్పర్లు, రేడియమ్ రిస్టువాచి, అన్నీ ఆమె సహజసౌందర్యాన్ని ద్విగుణీకరిస్తున్నట్లు తోచేది నాకు. కుచ్చెళ్ళకు చాలని ఉప్పాడపంచ, ఒంటినిండాపసుపు, నుదుట డబ్బంత కుంకంబొట్టు, మధ్యపాపిట, మెట్టకొప్పు, చాలీచాలని ముతకరవిక, అందెలు, మట్టెలు, వెండివడ్డాణం, వీటితో సంతుష్టిపడవలసిన చదువులేని పూర్వాచారపరాయణులగు అనాగరికస్త్రీలకు లక్ష్మినిచూస్తే బహుశః యీర్ష్యవలన గిట్టేదికాదేమో! వాళ్లలో వాళ్లు గుసగుసలాడుకునేవారు.

రోజురోజుకు నూతనశోభతో వికసిస్తూఉన్న ఆమెఅందం, తెలితేటలు, నాజూకు, అన్నీ నాతర్ఫీదు యొక్క ఫలితమేకదా అని బలే గర్రాగా ఉండేది నాకు. నూతనయౌవనావేశాలతో, ప్రణయానురాగసల్లాపాలతో మాధుర్యానుభవాలతో, మాదాంపత్యజీవిత మొకయెడతెగని యింపైనకలవలె పరిణమించింది ఆమూడేళ్లూ! నీలిమాకాశనిర్మలత్వంలో, చుక్కల తళతళకాంతులలో, చంద్రుని చల్లదనంలో, పువ్వుల మత్తువాసనలలో, పక్షుల కిలకిలధ్వనులలో, సృష్టిలో యెటుచూసినా, దేనినర్థంచేసుకున్నా, అంతా ప్రేమమయమై, సౌఖ్యప్రదమై, మనోహరమై విశదపడేది మాఉభయులకూ.

ఇంతలో హఠాత్తుగా లక్ష్మిలో ఒకవింతమార్పు ప్రత్యక్షమైంది. ఆమె శరీరావయవాలలోనే క్రమంగా యేదో మార్పుపొడగట్టింది. ఒళ్లు నీరుపట్టి నిగనిగ మెరిసేది. ఇదివరకు వదులుగానేఉండినరవిక లిప్పుడు బిగువై పిటపిట లాడేవి. బుగ్గలు బలంగా ఆరోగ్యంతో తళతళలాడేవి. చెంపకుచేరడేసిగాఉన్న దాని విశాలనేత్రాలు అంతకంతకు చిన్నవిగా అవుతున్నట్లు తోచేది నాకు. నడకలో యెప్పటిచురుకుతగ్గి ఒక నాజూకైన వొయ్యారం యేర్పడింది. స్వరం మారిపోయి నూతనమాధుర్యంతో వింతగా వినబడేది ఆమెమాట. ముఖంలో బాల్యచాపల్యం, కొంటెతనం పోయి ఒకవిధమైనగాంభీర్యం స్థిరపడింది. పద్ధెనిమిదేళ్ళజవ్వని పాతికేళ్ళప్రౌఢవలె కనిపించేది. పూర్వపు యౌవనగర్వం, నునుసిగ్గు, పెంకెనవ్వు, ప్రణయకోపం, అన్నీ మాయమై చిత్రంగా మారిపోయింది లక్ష్మి. నెలతప్పి, నెలలు గడచినకొలదీ, యెన్నో క్రొత్తసంగతులు అనుభవానికివచ్చి, ఆశ్చర్యంతో, భయంతో, ఆనందంతో బెదరుపాటుపడేది ఆమె హృదయం. ఏదో దీర్ఘాలోచనలో మైమరచి ఉన్నదానివలె పరధ్యానంగా చూసేది అప్పుడప్పుడు నావేపు. ఏమీ అర్థంచేసుకోలేక పిచ్చిపిచ్చి ఊహలతో మెదడు వేడెక్కించుకొని బాధపడేవాడిని నేను.

మగవాడి బుద్ధి, శరీరంకూడా మందంగా పెరుగుతాయి—ఎంత కృషిచేసి పెంచినాసరే, ఆడదాని

ప్రకృతివేరు. శరీరావయవపరిపక్వంతో జీవితానుభవాలు త్వరలో ఆమె కవగాహామైనట్లు పురుషుడికెన్నడూ కాజాలవు. సృష్టిలో స్వభావసిద్ధంగా ఉన్న యీ భేదాన్ని గమనించక, ఆమెలో అప్పుడప్పుడాకస్మికంగా జనించే మార్పులకు విస్మయం పొంది, అర్థంచేసుకోలేక, అసందర్భంగా ప్రవర్తిస్తాడు పురుషుడు.

"లక్ష్మీ! ఎందుకూ నీ కీదిగులు? ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్లు ఉంటావేమి? కోపమో, విచారమో, భయమో, యేదో నీహృదయాన్ని పీడిస్తూ ఉంది. చెప్పవూ నాతో?" అని మీద చెయ్యివేసి ప్రేమతో నెమ్మదిగా అడిగాను ఒకనాడు.

లక్ష్మికి అవి బలువురోజులు. ఏడో నెలలో పుట్టింటివారామెను తీసుకొపోయినపిమ్మట, మళ్ళీ నెలలు నిండేవరకు నాకామెను చూడడానికి అవకాశం చిక్కలేదు. సాయంత్రం తోటలో చల్లగాలికి కూచున్నాం ఎత్తుగా ఉన్న పచ్చిక తిన్నెమీద. పూలమొక్కలమీదుగా, కమ్మనివాసనలతో, బరువుగా, మందంగా, హాయిగా వీస్తూఉంది జ్యేష్ఠమాసపుమబ్బుగాలి. సూర్యాస్తమయమై అరగంటకు పైగా కావచ్చింది. ఆకాశంమీద అక్కడక్కడ చెదరి దూదికుప్పలవలె గాలికి ఊగులాడే తెల్లనిమబ్బులు సంజకాంతిలో వింతవింతరంగులతో రమ్యంగా కనబడుతున్నాయి. ప్రకృతిశోభతిలకిస్తూ యిట్లాకూచున్నప్పుడు తన్నుతామరచిపోగల స్వభావం లక్ష్మిది. దూరంగా కనబడే నీలికొండలను, చిత్రవిచిత్రాకారాలతో పరుగులెత్తే మేఘాలను, విరగబడి నవ్వుతున్నట్లు గలగలధ్వనులతో గాలికి ఊగులాడే చెట్లను, బారులుతీర్చి కిలకిలారావంతో యెగిరే పక్షులను, ఒడ్డునవిరిగి నురగలుజిమ్మే సముద్రపుకెరటాలను పరీక్షిస్తూ గంటలకొలదీ కూచోమంటే విసుగులేదు దానికి. వెర్రి ఆనందం!

చేతిమీద గడ్డం ఆనుకొని, ఆకాశంవేపు దృష్టినిగిడ్చి, గాలికి తొలగిపోతున్న పైటనైనా సర్దుకోక, బొమ్మవలెకూచున్నలక్ష్మి నామాటలకు కొంచెం అదరిపడి తిరిగిచూసింది నావేపు. మోచేతివరకూ ఉన్న దానిగాజులు కొంచెం ఘల్లుమన్నాయి.

కొంచెసేపు అట్టేచూసి నాకళ్ళలోకి, మెల్లగా నవ్వుతూ, "...దిగులుపడినదానివలె కనిపిస్తున్నానా?...లేదే! —" అని తల ఊచింది.

"ఇంకో రెండేళ్లపాటైనా మనని స్వేచ్ఛగా విడిచిపెట్టక అప్పుడే యీగొడవొకటి తెచ్చిపెట్టినాడా దేవుడు?" అని గొణిగాను నిట్టూర్పుతో.

ఆమాట నేరకపోయి, నోరువిడిచి యేదో అనాలోచితంగా అన్నాను గడ్డితిని. లక్ష్మికి మనసునొచ్చి తీక్ష్ణంగా చూసింది నావేపు. కోపంతో ముఖం యెఱ్ఱజేసి వణుకుతున్న పెదవులతో దెబ్బలాడింది నాతో. పోటుకుమాటలాడి యెత్తిపొడిచింది. ఉద్రేకం అణచుకోలేక చివరకి యేడ్చింది.

నిష్కారణంగా ఆమెమనసు కలతపరచి, నా మనసు కలతపరచుకొని కొరవితో నెత్తిగోకున్నట్లయింది నాపని. బుద్ధితక్కువకూతలు కూసినందుకు తగినశాస్తి అయిందినాకు! చీవాట్లతో నెత్తివాచింది. నావంటి తెలివిహీను డీభూప్రపంచంలో యెవడూ ఉండడని విశదమయింది. నా ఉన్నతవిద్యయొక్క ప్రయోజనం, నా తెలివితేటల గర్వం, నా లోకానుభవజ్ఞానం, భర్త్రాధికారం, వయసు పెద్దరికం, అన్నీ మట్టిలో గలసి, నన్ను నేలకీడ్చి ఓడించి, అవమానపరచి కసితీర్చుకున్నాయి.

ఔను! భార్యను ప్రియురాలుగా మాత్రమే యెరిగి ప్రేమించి, ఆమె హృదయమును హరించి, ఆమెలోగల స్వభావసిద్ధమగు సంతానకాంక్ష నర్థము చేసుకొనలేనిమూర్ఖుడు భర్తృత్వం వహించడానికి అర్హుడుకాడు! మాతృత్వంలో ఉండే మహిమ, మాతృప్రేమలో ఉండే ఔన్నత్యం, స్వార్థత్యాగం, ఆనందం, యేదీ తెలుసుకోలేని బుద్ధిహీనుడు నోటికి వచ్చినట్లు వదరినప్పుడు చీవాట్లు తగలవలసినదే!

"...ఇదా మీరు మీ కడుపున పుట్టబోయే బిడ్డకు చూపవలసిన సన్మానం? ఒకస్నేహితుడు కాని, పెద్దమనిషికాని యింటికివస్తే ఎంతోమర్యాదచేసి గార

విస్తారే! మీ రక్తంలోరక్తం, ప్రాణంలోప్రాణం అయిన యీ నోరెరగనిశిశువుకు యిదా మీరిచ్చే ఆహ్వానం?...ఇంకా కొంతకాలం నాకు బిడ్డలు కలగకుండా ఉంటే, మీకు సౌఖ్యంగా, సదుపాయంగా ఉండేదికాబోలు పాపం! తండ్రితనం వహించడానికి ఉత్సాహంలేనివాళ్లు పెనిమిటితనం చెలాయించడానికి సిద్ధపడకూడదు."

లక్ష్మిధోరణి చల్లారేటట్లు కనబడలేదు. పశ్చాత్తాపంతో తలవంచుకొని, బదులు పలకకుండా కూచున్నాను, నన్ను నాలో తిట్టుకుంటూ. ఆమెకు గర్భం వచ్చిందని నాకణుమాత్రమూ అయిష్టత కలగలేదెన్నడూ. ఎందుకో గర్వంగా, బలే సంతోషంగా, కొంచెం భయంగా ఉండేది, ఆవిషయం తల్చుకున్నప్పుడల్లా. కాని, అంతచిన్నయీడున తల్లిదనం వహించడం ఆమె కంతగా మనస్కరించదేమో అన్న శంక మాత్రం అప్పుడప్పుడు కలిగేది నాకు. దాని దిగులుచూపులు, పరధ్యానంచేష్టలు, ముఖవైఖరి కనిపెట్టి అట్లు దురభిప్రాయపడ్డాను.

"లక్ష్మి! నే నేదో అజాగ్రత్తగా పొరబాటు మాట అనినందుకేనా నీకీ దురహంకారం? బిడ్డలంటే నాకుమాత్రం ముచ్చటలేదా? నామాటలకు విపరీతార్థం తీసి నన్ను నిందించడం న్యాయమేనా? చూడవూ నావేపు?— చా, కళ్ళంట నీళ్ళే!..."

క్షమాపణవేడుకొని ఎన్నెన్నివిధాలుగానో బుజ్జగించిన పిమ్మటకాని, ఆమెహృదయంలో రేగిన కల్లోలం అణగలేదు. దుఃఖం ఆపుకోలేక ఆమె బొటబొట కన్నీరు కార్చినప్పుడు, నిజంగా నామీద నాకే అసహ్యంవేసింది, "పశువులవలె ఇంగితజ్ఞానం లేకుండా ప్రవర్తించానే!" అని.

పురిటిరోజులు సమీపిస్తున్నకొద్దీ, లక్ష్మికి తిన్నగా నిద్రపట్టేదికాదు. బడలిపోయిన ఏనుగుగున్నవలె మనిషి భారంగా నడిచేది, ఆయాసంతో. మొగం వాడిపోయింది. నేడో రేపో అని నిమిషాలు లెక్కపెట్టేది వాళ్లఅమ్మ.

"నేనిక్కడ ఉండడం అవసరమని నువ్వు గట్టిగా చెప్తే, మరో పదిరోజులకు సెలవుదరఖాస్తు పంపుతాను." అన్నాను లక్ష్మితో ఒకనాడు.

"అక్కర్లేదు. మీరు వెళ్లండి" అన్నాది, చదువుతున్నపుస్తకం మూయకుండానే.

"అయితే రేపుఉదయమే నాప్రయాణం...... ఏమిటాపుస్తకం?"

పుస్తకం మూసి, బల్లమీద పడేసింది. "ఇదేదో మాసపత్రిక. నిన్న మంత్రసాని నన్నుచూడడానికి వచ్చినప్పుడు, ఆమెచేతిలో ఉంటే అడిగిపుచ్చుకున్నాను. పురిటికథలు, బాలింతలముచ్చట్లు, శిశువైద్యం, మొదలయిన విషయాలెన్నోఉన్నాయి, యీపత్రికలో. మంచి మంచి తమాషా కథలున్నాయి. అన్నట్టు, 'సంజనిద్రప్రసవ' మంటే యేమిటి కథ? చదివానుకాని నాకు తిన్నగా తెలియలేదు."

"అది కొన్నికొన్ని దేశాలలో ఇప్పుడమలులో ఉన్న పురిటివైద్యం. "ట్వైలైట్ స్లీప్ మెటర్నిటీ" అంటే, నొప్పులు తెలియరాకుండా పురుడుపోసుకోవడం అన్నమాట." అని టూకీగా చెప్పడం ప్రారంభించాను. "నొప్పులు ప్రారంభించగానే చూలాలును నిశ్శబ్దంగాఉన్న ఒకగదిలో పడుకోబెట్టి, చేతిమీద ఒకానొకఔషధం ఇంజెక్షన్ చేస్తారు. వెంటనే ఆమెకు మత్తెక్కి నిద్రవస్తుంది. అదొక చిత్రమైన మత్తునిద్ర. పురిటినొప్పులబాధ యేమీ తెలియదు. కాని నొప్పులు ఆగిపోవు. అవసరమైనయడల ఆమెను తట్టి లేపవచ్చును. మాట్లాడవచ్చును. ఆహార మియ్యవచ్చును. ఔషధప్రభావం వదలిన పిమ్మటమాత్రం ఆమెకు ఏసంగతీ జ్ఞాపకంఉండదు. మందుమత్తులో ఉన్నంతసేపూ ఆమె కలలో ఉన్నదానివలె ప్రవర్తిస్తుంది. పురిటిగదిమాత్రం నిశ్శబ్దంగావుండాలి. పెద్దపెద్దధ్వనులేవీ వినరాకూడదు. గదిలో వెలుతురుకూడ అంతగా ఉండకూడదు. సంజచీకటివలె గుడ్డివెలుగుమాత్రం ఉంటేచాలును. మందుధనరు తగ్గి, చూలాలుకు మెలకువ వచ్చి

నప్పుడల్లా తిరిగీ ఇంజెక్షన్ ఇస్తూఉండాలి. ఎక్కువ సేపు కష్టపడే స్త్రీకి పదిపన్నెండు ఇంజెక్షన్లవరకు అవసరం పడవచ్చును. నిపుణురాలైన లేడీడాక్టరు, ఓర్మిగల మంత్రసాని,—వీరిద్దరికిమించి యితరులెవరూ పురిటిగదిలోనికి రాకూడదు. ప్రసవమైనకొంతసేపటికికాని తల్లికి పూర్తిగా తెలివిరాదు. అప్పుడామె తనబిడ్డను చూచుకొని ఆశ్చర్యపడుతుంది, 'నిజంగా నేనే ప్రసవమై కన్నానా?' అని."

"అయితే, ఎంతో భాగ్యవంతులైన స్త్రీలకుకాని యిట్టి వైద్యసౌకర్యాలు, సామాన్యులకు లభించవనుకుంటా. మన హిందూదేశంలోకూడా ఎక్కడైనా యీవైద్యం చేస్తున్నారా డాక్టర్లు?" అని అడిగింది లక్ష్మి.

"ఎక్కడో ఒకటిరెండు బస్తీలలో చేస్తున్నారు కాని మనదేశంలో ధనవంతులకుకూడా సంజనిద్ర ప్రసవమంటే యేమిటో తెలియదు. మనబోటిసామాన్యులసంగతి మరివేరే చెప్పుకోనక్కరలేదు."అన్నాను నిట్టూర్పుతో.

ఒక్కక్షణం ఊరుకొని, "అభాగ్యదేశం!" అన్నాది లక్ష్మి.

మర్నాడు రెయిలుకు వెళ్లేముందు లక్ష్మివద్ద సెలవు దీసుకున్నప్పుడు కొంచెం చేతులు వణికాయి నాకు. తలలో మహావిపరీతమైన పిచ్చిపిచ్చిఊహలన్నీ చెలరేగి ఏదో దిగులుతో గుండె బరువెక్కింది. "ఈ పురిటిగండం గడచి, మళ్లీ నాలక్ష్మి ప్రజలలో పడుతుందో లేదో? మా యిరువురికీ యివే కడసారి చూపులు కాబోలు?...కాని, లోకంలో ఎందరు సుఖంగా ప్రసవమవడంలేదు? లక్ష్మియడలమట్టుకు దేవు డెందు కన్యాయం చేస్తాడు?...ఇంతకూ విధి వ్రాత యెట్లాఉందో? ఏదెట్లాపరిణమిస్తుందో?..." అని పరిపరివిధాల పోయింది నామనసు. తిన్నగా నిద్రపట్టక రాత్రివచ్చిన పాడుకలలన్నీ తిరిగీ జ్ఞాపకం వచ్చాయి. ముందెప్పుడో లక్ష్మి అనుభవించనున్న పురిటినొప్పులబాధకంటె దుర్భరంగా పరిణమించిం దానిమిషంలో నాహృదయవేదన. ఎవరిమనసులో ఉన్నభయాలు వారు గుప్తంగా జీర్ణించుకుంటూ, లేనిధైర్యం తెచ్చుకొని, ఒకరికళ్లలో కొకరం నిదానంగా చూచుకుంటూ మెల్లగా నవ్వుకున్నాం, కష్టం మీద విడబడుతూ.

కాని చిత్రం! పురుడువచ్చినపదకొండోరోజున, మళ్లీ నేను లక్ష్మిని చూచినప్పుడు, నాకామె ముఖంలో ప్రత్యక్షమైన ఆనందకాంతులలో ప్రసవవేదనల స్మృతిఛాయలైనాగోచరించలేదు. 'నిజంగా యీమె పురిటినొప్పు లనుభవించిందా?' అన్న సంకోచంకలిగిందినాకు. అట్టి సంతోషంతో, మందహాసంతో, మాతృగర్వంతో ప్రకాశించిం దామెవదనం! ఒంటినిండాపసుపు, కళ్ళకు కాటుక, పైటకొంగుతోబిగించిన నడ్డికట్టు, అన్నీచూసి "ఈబాలింతరాలు నా లక్ష్మేనా?" అని ఆశ్చర్యపడ్డాను. నులకమంచం మీద పక్కకు ఒత్తిగిలి, బిడ్డను రొమ్ముకానుకొని పాలిస్తూవుంది. నారాక కనిపెట్టి, ముఖం కొద్దిగా యెత్తిచూస్తూ, "రండి." అంది మెల్లగా నవ్వుతూ.

మంచందగ్గిర నిల్చుని, వంగి, నిద్రపోతున్న పిల్లడిని బాగా పరీక్షించాను.

"ఏం?......బాగున్నాడా?...... ఎవరిపోలిక అని మీఅభిప్రాయమో చెప్పండి."అన్నాది ఉత్సాహంతో.

"అప్పుడే ఎట్లా తెలుస్తుంది ఎవరిపోలికో?" అంటూ పక్కున నవ్వేను.

"తెలియదూ?......నిదానించి చూడండి! ఆ నల్లని ఉంగరాలజుట్టు, ఆ పొడుగైనవేళ్లు, ఆకళ్ళు, ఆముక్కు,—అన్నీ నావే! ఒక్కగడ్డంమాత్రం మీది. మీవలెనే పొడుగుగా వుంటాడనుకుంటా."

ఏఅవయవంకూడా యింకా స్ఫుటంగా యేర్పడని ఆపసికందులో అప్పుడే యిన్నిలక్షణా లెట్లా కనిపెట్టిందో ఆమెకే తెలియాలి. నాదృష్టికి నిజంగా పసిబిడ్డలందరూ రూపంలో ఒక్కమోస్తరుగానే ఉంటారు–మెత్తని గులాబీరంగు మాంసం బొమ్మలు! కాని, ఆనందంతో కులుకుతూ, బిడ్డను ఒళ్ళంతా నిమిరి, ప్రతి అవయవం ప్రేమతోతాకి, నాకు

చూపిస్తూ, ఎన్నెన్నివిధాలుగానో వర్ణిస్తుంది లక్ష్మి. "ఈ చిన్ని మొగం నాపోలిక కాదేమో చూడండి మరి? అంటూ వాడిబుగ్గను తనబుగ్గచేర్చిరాస్తూ ముద్దుముద్దుగా నవ్వుతుంది. ఆమె ప్రపంచమంతా ఆబిడ్డే!

మూడేళ్లు శ్రమపడి లక్ష్మిహృదయంలో నేను స్థాపించుకున్న ప్రణయరాజ్యమంతా మూడునెలలలో తనస్వాధీనం చేసుకున్నాడాబాలుడు. పూర్తిగా మారిపోయింది లక్ష్మి. వెనుకటి రూపమే కాదిప్పుడు. ఆకునంటుకొని ప్రాకే పురుగు తన శరీరం వదలి, రంగురంగుల రెక్కలదాల్చి, రమ్యమైన సీతాకోకచిలుకగా మారి, పక్షివలె యెగిరినట్లు బిడ్డతల్లి కాగానే అత్యద్భుతంగామారిపోయింది లక్ష్మి. జీవితార్థం తెలుసుకున్నజ్ఞానివలె దివ్యతేజంతో వెలుగొందేది ఆమెముఖం. గంభీరంగా ప్రకాశించే వామె కళ్లు. స్వార్థరహితమై, స్థిరమై, అగాధమై, జీవితాశయాలను తారుమారొనర్పగల మాతృప్రేమలో ఉండే రహస్యమహిమంటే యెట్టిదో కొంతవరకప్పుడు విశదపడింది నాకు. స్త్రీకి తల్లితనం ప్రసాదించి ప్రేమతత్వ మామె కర్థమగునట్లు చేయగలుగుతున్నందుకే పురుషుడు గర్వపడవచ్చునేమో అనితోచింది.

బిడ్డసంరక్షణనుగూర్చి తన తిండి, నిద్ర, రూపం, ఆరోగ్యం, నాగరికత—అన్నిటినీ ధారపోస్తున్నా, యింకా తృప్తిలేకుండాఉంది లక్ష్మికి. దాదివద్ద బిడ్డను అట్టేసేపు విడిచిపెట్టి ఉండడానికి యిష్టపడదు దానిమనసు. దాది, తండ్రి, తల్లి, గురువు— అన్నీ తానేనంటుంది.

ఎత్తుకోమని పిల్లడిని వాళ్ళమ్మచేతి కందిస్తూ, భద్రంగాపట్టుకోమని చిన్నపిల్లలకు చెప్పినట్లు చెప్తుంది. "పదిలమే, అమ్మా! మెడకింద చెయ్యి వెయ్యి, జాగ్రత్త—"

నవ్వుతూ ఆవృద్ధురాలు, "ఔనమ్మా! నేనేమైనా బిడ్డలనెత్తుకోవడం యెరుగుదునా మరి?" అంటుంది, అబ్బాయినందుకొని యెగరవేస్తూ.

లోకంలో యింకెవరిబిడ్డలూ తనకొడుకంత చక్కనివాళ్లు, బుద్ధిమంతులు, చురుకైనవాళ్లు కారంటుంది లక్ష్మి.

ఇప్పుడింకా యేడాదిదాటి మూడునాలుగు నెలలవాడేకాని, యిల్లుతీసి పందిరివేస్తున్నాడు పిల్లడు. తప్పటడుగులు వేసుకుంటూ, చురుకుగా నడవబోయి పడుతూ లేస్తూ, యిల్లంతా చక్కబెడుతూ ఉంటాడు! ఎక్కడా ఒకచోట కాలునిలవదు వాడికి. ఒక్కక్షణమైనా చేతులు పనిలేకుండా విశ్రాంతి కోరవు కాబోలు; ఏదో పాడుపని చేస్తునేఉండాలి. ఎక్కడెక్కడ యేయేగదులలోఉన్న ఉప్పులు, పప్పులు, అన్నీ పిడికిళ్ళతో పారబొయ్యడం; అద్దాలు లాంతర్లు, పటాలు, కాఫీకప్పులు, గాజుబొమ్మలు చేతితో సాధ్యంకానప్పుడు కర్రతోనైనా తంటాలుపడి పగలగొట్టడం; బిందెలలోను, చెంబులలోను ఉన్ననీళ్ళు నేలదిమ్మరించి యిల్లంతా వరదచెయ్యడం; దేవుడిపీఠంమీదెక్కి, విగ్రహాలను తిరగదోసి, పూజాద్రవ్యాలను విరజల్లడం; భోజనాలప్పుడు అందరివిస్తళ్ళమీదికి యెగబడి అల్లరిచెయ్యడం; పెంపుడు కుక్కను తోకపట్టిలాగి, దాన్ని నానాచికాకు చెయ్యడం; నా వ్రాతబల్లవద్ద నిల్చుని చేతికందిన పుస్తకాలు, కలాలు చిందరవందరగా క్రిందపడవేయడం; తాళంగుత్తులతో ఆడుకొని, యేమూలలమూలలనో గంటసేపు వెదికినా మళ్లీ అవిమాకు దొరకనట్లు విసిరివేయడం; పిల్లికూనల నెత్తుకోబోయి వాటిచేత రక్కులుతిని యేడవడం; చేతికిచ్చినబిస్కట్ ముక్కను కాకికి తినిపించాలన్నసరదాతో పెరటివేపున్న మెట్లమీదికి మాటికీచీటికీ పరుగెత్తడం; తల్లి జడవేసుకుంటూఉన్నప్పుడు తలనూనెసీసా, ముసలమ్మ వంటచేస్తూఉన్నప్పుడు నూనెగిన్నె, నేనువ్రాసుకొంటూఉన్నప్పుడు సిరాబుడ్డి ఏమూలనుండో అందుకొని వొలకబొయ్యడం;— ఇట్లాటి అల్లరిపనులు వాడికి నిత్యకృత్యాలు. ఎంతజాగ్రత్తపడినాసరే మడిలోఉన్న ముసలమ్మకు వాడిమూలాన రోజూ రెండోస్నానం తప్పదు. ఎవరమైనా కోప్పడితే పకపకనవ్వుతూ మీదికొస్తాడు, చేతులుచాచుకుంటూ యెత్తుకోమని.

వాడిఅల్లరికి హద్దులేకుండాఉంది. ఇంట్లో ఎవరిమీదా వాడికి పిసరంతలక్ష్యం ఉన్నట్టుకనిపించదు.

భయంనేర్పడానికి అప్పుడప్పుడు నేను కళ్లెర్రజేసి, ముఖం గంభీరంగాపెట్టి, లేనికోపం తెచ్చుకుని గద్దించబోతే కిలకిలనవ్వుతూ చనువుతో మీదపడతాడు. అప్పుడప్రయత్నంగా నాకుగూడా నవ్వొచ్చి, అమాంతంగా వాడినెత్తుకొని బుగ్గలు కందేటట్లు ముద్దులాడవలసివస్తుంది. వాడికి భయభక్తులు బోధించడానికి నేనుపడే శ్రమదమాలన్నీ బూడిదలోపోసిన పన్నీరువలె ఎందుకూ అక్కరకురాకుండాఉన్నాయి. మీదుమిక్కిలి లక్ష్మికూడా వాడిపక్షమేవహిస్తుంది. వాడితోపాటు తనూ చిన్నపిల్లగామారిపోతూఉంది. వాడెట్టిపాడుపనులుచేసినా, ఎంత అల్లరిచేసినా దానికి ఆనందమే! ఇద్దరూ ఒకటై నన్ను ధిక్కరిస్తున్నారు.

ప్రొద్దస్తమానం విసుగువిరామం లేకుండా పిల్లడితో ఆడుకుందుకు ముచ్చటపడుతుంది లక్ష్మి. ఇంగ్లీషు పుస్తకాలు, హిందీచదువు, లేసుపట్లు, ఊలుఅల్లికలు, అన్నీ మూలపడేసింది. పిల్లడు ఉయ్యాల్లో నిద్రపోతూవున్న ఆనాలుగునిమిషాలుకూడా వాడికిసంబంధించిన వ్యాపకమే యేదోకల్పించుకొని కాలక్షేపం చేస్తానంటుందికాని, నాఊసు తలపెట్టదు. ఖరీదైన రంగురంగులగుడ్డలన్నీ తెప్పించి పీలికలుగా చించి చిన్నచిన్నచొక్కాలు,లాగులు, రుమాళ్లు కుడుతుంది. లేదా శిశుసంరక్షణ విధానం బోధించే పిచ్చిపిచ్చిపుస్తకాలన్నీ చదువుతూకూచుంటుంది. లేదా ఇంగ్లీషు కేటలాగులన్నీ తిరగవేసి రబ్బరుబొమ్మలు, పిల్లల ఆటవస్తువులు, అన్నీ ఒకజాబితా తయారుచేసి వాటిని తెప్పించమని నాప్రాణాలుతీస్తుంది. తనతోపాటు నేనుకూడా అబ్బాయివిషయమై తగినశ్రద్ధ తీసుకోవడంలేదని సాధిస్తూ ఉంటుంది పైపెచ్చు.

మనభాష వాడికి నేర్పడానికిబదులు వాడిభాషే తను నేర్చుకొని యేమిటో అల్లిబిల్లిగా మాట్లాడుతుంది వాడితో. ఒక్కొక్కప్పుడు వాళ్ళసంభాషణ వింటూవుంటె ఒక్క ముక్కకూడా తిన్నగా తెలియక తెల్లమొహంవేసుకొని నిల్చోవాలి నేను.

ఒకనాడు వాడెందుకో ఏడుస్తూఉంటే బుదిరిద్దామని వెళ్ళి "ఏం కావాలమ్మా?" అని నెమ్మదిగా అడిగాను.

"బూతు!" అని గదివేపు వేలుచూపించి మళ్ళీ యేడ్చాడు.

"ఏమిటంటాడు?" అన్నాను లక్ష్మివేపు తిరిగి.

"వినలేదూ?...ఓ జత తెచ్చిపెట్టం డీవాళ."

"బూతులా?" అన్నాను నిర్ఘాంతపడి.

"అవును." అన్నాది విరగబడి నవ్వుతూ.

"అంటే?"

"జోళ్ళు! ఆమాత్రం తెలుసుకోలేరూ?బూట్లు, బూట్సు అని స్పష్టంగా పలకగలరా యేమిటి చంటిపిల్లలు?ఎక్కడినుండో తెచ్చి మీ కాన్వాస్‌జోళ్ళతో ఆడుతూవుంటే వాటినిలాక్కొని గదిలో దాచేశాను. అందుకూ ఆయేడుపు!"

లక్ష్మిసమాధానం విని నాలోనేను నవ్వుకున్నాను.

క్రమంగా అబ్బాయితో లక్ష్మికి స్నేహం ప్రబలుతూ ఉన్నకొద్దీ, నామీద నిగాతగ్గిపోవడం మొదలయింది. ఇంట్లో యిప్పుడు నా పెద్దరికం యెందుకూ పనికిరాకుండా ఉంది. అంతా వాడిదేప్రభుత్వం! లక్ష్మి, పిల్లడు యేకమై నన్ను తెరమీదిబొమ్మవలె ఆడిస్తున్నారు.

# దురాసదవాంఛ

నాదెళ్ల వేంకటరావుగారు బి. ఏ

ఎదుగ నేటికె చిట్టితల్లీ!
యెదుగబోకే కన్నతల్లీ!!
యెదిగి మృదులత గోలుపోవుచు
ముదురబోకమ్మా!!!
ఎల్లకాలం బిటులె ప్రాకుచు
నింట నవి యివి బోర్లబోయుచు
'గొల్లు' మనుచును తల్లి కసరగ
మల్లె లొలుకగ నవ్వుచుండక ॥ఎ॥

ఎత్తుకొని నే ద్రిప్పుచుండగ
'సత్త తాతా!' యనుచు సతమ
వ్యక్తమధురధ్వను లొనర్చుచు
చిత్తమలరింపుచు జెలంగక ॥ఎ॥
చింతగింజో చిల్లపెంకో
చిరిగిపోయిన కాగితంబో
చెంతనున్నది చేతబట్టుచు
చిదానందంబున రమింపక ॥ఎ॥

# కడుపు చల్లని తల్లి

బొడ్డు బాపిరాజు గారు

తొలిజన్మమ్మున నిండుబత్తి మెదలో దొల్కాడ బంగారుపూ
వుల నీ వేజగదేకమాతృకను సంపూజించితో నేడు త
త్ఫలరూపమ్మున గేహమెల్ల కళలన్ భాసిల్ల బాల్గారుమో
ముల సత్రింతురు ముద్దుముచ్చటలతో బుత్రుల్ సుపుత్రీమణుల్.

పున్నపుచందమామసరిమోముల ముద్దులమూటగట్టుచున్
జిన్నెలవన్నెలన్ జిలిపిచేతల గమ్మనితొక్కుపల్కులన్
బిన్ననినవ్వులన్ మమత బెంచెడి నిద్దపుసోగచూపులన్
గన్నులు చల్లగా సుతులు గ్రాలుట నీదు తపఃఫలంబుసూ !

చీటికిమాటికిన్ దగవుసేయుచు ని న్విసిగించుచున్న నో
బోటి ! చిరాకుసెందకయ ముద్దిడి సందిటజేర్చి తీయనౌ
మాటల నూరడించి బ్రతిమాల్పుల బుత్తువు కన్నబిడ్డ లె
ప్పాటననైన సౌఖ్యముల వర్ధిలుటే భవదీప్సితంబగున్ !

అలరుంగెంబెదవుల్ దలిర్చునగవుల్ హాసారుహాందమ్మిమో
ములదేనెల్ చిలికించు కుల్కునుడులన్ బొంగించి చిన్నారిము
ద్దులబిడ్డల్ దరిజేర నింపుకొలునై తోరంపుగ్రొంగ్రొత్తవే
డ్కలతో నుక్కిరిబిక్కిరౌ భవదదృష్టం బెన్న సామాన్యమే ?

రమణునితో కాపురముసేయుచున్న పెద్దమ్మాయి నొకసారి యరయుకోర్కె..
యీడువచ్చినపిల్ల కెచ్చోటనైనను మంచిమనువును విచారించుతలపు
చలిదిని దినిపించి చంటియు తోడుగా బిల్లల బడికి పంపించుశ్రద్ధ
పొర్వట్టి వాపోవుబుడుతకు చన్నిచ్చి జోలబాడుచు నిద్రజూపునేర్పు

చిట్టిచేతుల గళసీమ చుట్టివైచి
ముచ్చటలు సెప్పి నవ్వించి పొంగిపోవు
చిట్టితో కాలయాపనజేయుమమత
యేకమై నీకు నానంద మిచ్చుగాదె ?

ఎంతగ మాటిమాటి కలయించుచు నిన్ బురికొల్పుచున్న కా
సంతయు గోపగింప కెటులాడిన బిల్లలు చిన్నవోదురో

యింతకు నంచు వారికి రుచించెడిలీల మెలంగునట్టి నీ
శాంతము గన్న డెందమున సంతమా గృహభాగ్యరూపిణీ!
ఆకనుకోనలం దెఱుక కందకనే యమృతాతిరుచ్యముల్
శ్రీకమనీయముల్ సరసశేఖరముల్ ప్రణయప్రవాహముల్
ప్రాకునొ లోకమే తెలియరాకయె పొక్కిడిచిట్టిపాప తా
నాకలిదప్పులన్ మరచి యారయు నూరెడిబోసినవ్వులన్.

'అమ్మా'యంచును జిట్టిపల్కులను నీహస్తమ్ము జేబూని పా
లిమ్మంచున్ దొరపెట్టి బిడ్డ ఱొడిలో నింపార గూర్చుండినన్
నెమ్మోమున్ జుబుకంబు ముద్దులతమిన్ నిండించి చన్నిచ్చి మో
దమ్మున్ జెందెద వంతకన్నసుఖ మీధాత్రీస్థలిన్ గల్గునే?
ఉయ్యాలలలో నిద్రనుండి మేల్కొని యేడ్చ్వెసుగు నిన్ జూడ కేకీసలుగొట్టు
చెల్లెలితో వాదుచేసెడికొమరుండు నీపిల్పువిన్న సందిట నుజిక్కు
తండ్రి కోపింపగా దల్లడమందెడుబిడ్డ నీమాటకు బెదరుదీర్చు
నత్తింటినుండి పిల్పందివచ్చిన పెద్దతనయ నీకౌగిలి దనువుపులకచు

నీదుమందస్మితమ్మున నిలయమెల్ల
కడిదితామరకొలనట్లు కళలవెలుగు
నేమహాప్రేమశక్తు లిం తెరుకపడక
యిమిడియున్నవొ నీలోన నిందువదన!

మగువ! శ్రమమ్మునాక నవమాసము లోపికమోసి కన్నదా
దిగ బడరానిపాట్లుపడి దిద్దుచు విద్దెల బుద్ధి గుర్రలన్
సుగముగ బెంచి పెద్దలనజూచితి; బంగరుతూగుటుయ్యెలం
దిగ దిగనీక బత్తిని భజింపగలారలు వార్ధకమ్మునన్.

కూరిమి గన్నకూతు లొకకొంతయు లోపములేక భర్తలం
జేరుచు హాయి గాపురముసేయగ బిడ్డలతోడ నందనుల్
వా రొకయింటివారలయి వర్ధిల గోడలికమ్ము గొంచు బల్
పేరిమి నింక నీముదిమి బిడ్డలబిడ్డలతో చరింపుమా

లలి జంట వెంట నందడి
గొలుపుచు నింతంతవయసు కొమారారెడు బి
డ్డల సుఖయించెడి నీ కిదె
నలుపుదు జోహారు కడుపుచల్లనితల్లీ!

# నేటి స్త్రీ

కొవ్వర్తి సీతారామయ్యగారు బి. ఏ.

ఈకాలమున స్త్రీవ్యక్తిత్వము వృద్ధిచెందుచున్నట్లు మఱియేసంస్థయు నగుటలేదు. అభివృద్ధినొందుచున్న ప్రపంచము నేడేదనిన స్త్రీప్రపంచమే యని యొప్పుకొనక తప్పదు. రాజకీయములు, ఆర్థికములు, పారిశ్రామికములు మొదలుగాగలవి ఈయుగపుమానవుని ఆకర్షించి పీడించుచున్నవి. కాని స్త్రీత్వమునందు గలుగుచున్న మార్పులు మఱియేవిషయమునందును మానవజాతియొక్క భావములను తారుమారుచేయుటలేదు. సంతానము కనుటకుమాత్రమే సృష్టింపబడినదని పురుషుడనుకొనిన స్త్రీ, గొంగళి సీతాకోకచిలుకయినట్లు నేడు పూర్తిగ క్రొత్తమార్పునొంది పురుషునకు సరిసమానమైన జీవితమున భాగస్వామిని యగుచున్నది.

మొన్నటివఱకును స్త్రీ సంఘమున తావులేనిది. పురుషునిచేతిలో కీలుబొమ్మ, పూర్తిబానిస, భోగవస్తువు. నేడో! స్త్రీ పరిపూర్ణవ్యక్తి, స్వతంత్రతామందిరము, సార్వజనికజీవము. తూర్పుదేశములలో మఱియు నాశ్చర్యము. గుమ్మము దాటియెఱుగక, ప్రపంచమన నేమో తెలియక, అజ్ఞానదేవత నారాధించుచు, మనోవికాసశూన్యమై, సంఘమున పేరులేనిదై జీవముగడుపుచుండెడిది స్త్రీ. ఇప్పు డామెకు తెలియనివిషయములు లేవు. ఆమెకు కాని సంస్థలులేవు. ఆమె జొరనియుద్యములు కానరావు.

ఈపునర్జీవము సులభగ్రాహ్యము. పూర్వము స్త్రీ గౌరవస్థానము నలంకరించినను వ్యక్తిత్వములేనిది. "గృహద్వారమున కధికారిణి" యయ్యును ఋగ్వేదకాలపుస్త్రీకి సంఘమునందు పలుకుబడి సున్న. "స్త్రీలు పూజింపబడుచోట దేవతలు క్రీడింతు"రనియెనే కాని మనువు రాజకీయములం దామెకు తావులేకుండజేసెను. రామాయణపుసీత తాను 'రామునిభార్య'నని తలంచెనేకాని తాను సీత యనువ్యక్తిననుభావ మామెయందు లేదు. యూరప్పునందుకూడ స్త్రీ పూర్వయుగములందు ఇట్లే జూడబడెడిది. నిదర్శనమునకు ఒక్క రోమనుకాలపుపోర్షియో జాలు. తాను "కేటోకూతు" ననియును, బ్రూటసుపెండ్లామనియు నీయామె గర్వమునొందెను. తాను "పోర్షియో అనువ్యక్తి" అని తెలియలేనిది అయ్యెను. అట్టిస్త్రీలు నేడు వెఱ్ఱివారుగ తలంపబడుదురు. నేటిస్త్రీ యట్లుగాదు. "నేను—నేను" యను భావము ఆమె నిండుజీవము. నేటిస్త్రీకిపరిజనులపై నధికారము జేయుచు, స్వజనములగౌరవముల నొందుచు మగనిప్రియవాక్యముల నానందించుట ఆశయముగాదు. గడపదాటని జీవితమును నసహ్యించుకొనును. సంఘస్థానములేని జీవితము ఆమెకుబానిసత్వము. స్త్రీపురుషవ్యత్యాసరహితజీవితము నూతనస్త్రీయొక్క నిద్రాహారములు. "సమానత, స్వతంత్రత, స్వయంకృషి" యను మాటలు ఆమె క్షణక్షణమును బిల్చుచుగాలి.

ఈక్రొత్తజీవము నవీనప్రపంచమంతయు వ్యాకిపోయినది. రష్యాలో విప్లవమునకు పూర్వము రష్యాస్త్రీని జూడుడు. విప్లవానంతరస్త్రీని దిలకింపుడు. యూరప్పు, అమెరి

కాలు స్త్రీస్వాతంత్ర్యమునకు పుట్టినిల్లు. పశ్చిమదేశములలో 500 ఏండ్లకు జరిగినమార్పు ప్రాగ్దేశములలో 50 ఏండ్లలోనే కలుగుట ఆశ్చర్యకరమగు వింత. యుద్ధమునకుపూర్వము పరదా వెనుక కాలముగడపుచు పరపురుషునికంటబడనేరని టర్కీస్త్రీ నేడు కత్తిరించిన జుట్టుతో క్లబ్బులందు విలాసకాలక్షేపముజేయుచు కన్పట్టును. అంతఃకలహములలో మునిగి నల్లమందునకు పేరుబడియున్న చీనాలో నేడు ప్రత్యేకము స్త్రీసేనలుండుట గగన కుసుమసమానఫలము. ఒక్కజపానులోనే 1200 మంది స్త్రీడాక్టరులు, 3500 దాదులు కలరని లెక్కలు చెప్పుచున్నవి.

వీరినిమించినారు భారతీయులు. గాంధిగారి స్వరాజ్యోద్యమాందోళనయందు భారత స్త్రీలుజూపిన శక్తిసామర్థ్యధైర్యసాహసములు ప్రపంచమంతటను మూలమూలలను మారుమ్రోగినవి.

ఇప్పుడు స్త్రీలేని సంస్థలేదు. రాజకీయములందు, ఆర్థికములందు, సంఘమునందు స్త్రీ అంజవేసినది. వ్యవసాయముమొదలు వేదాంతమువఱకును స్త్రీ పురుషునితో సమానముగ శరీరమనోబలముల జూపుచున్నది. నేటిస్త్రీయొక్కవ్యక్తిత ప్రపంచవిషయములలో చక్కగ పనిచేయుచున్నది. మానవజాతి స్త్రీయెడగలిగిన పూర్వపు దురభిప్రాయముల విడచి నిజాభిప్రాయములు కలిగి నేటిస్త్రీయెడ కండ్లుతెఱచుచున్నది. స్త్రీజీవశక్తి జాతి కెట్టిఅపరావతారమో ముమ్ముందు మనము జూడగలము.

## పాంథుఁడు

శిరోమణి వారణాశి గంగాధరశాస్త్రి గారు

౧

మినుకుమినుకంచు మంచుతో మిళితమైన
కాంతి నెగిరేడు భరతశకుంతవరుని
యాకసంబున వినిపించునట్టిపాట
మధురముగఁ దోఁచుఁ బ్రాభాతపథికతతికి.

౨

మిట్టమధ్యాహ్నమున నెండగొట్టి మిగుల
నలసి మెట్టులో యిలుసేరఁదలఁచినట్టి
పాంథవరునకుఁ జుట్టును బ్రబలునట్టి
వాయు వొక్కింత ప్రోత్సాహపఱచుచుండు.

౩

మబ్బుమాయయు లేనట్టి మండుటెండఁ
బూర్ణతరమైన శ్రమమును బొందియున్న
పథికునకు మార్గమున సత్ప్రవాహములను
ముదములొల్కెడు సంగీతముల నె పాడు.

౪

క్రమముగా నంత సాయాహ్నకాంతి దొడర
నెచట నడియును జప్పుడు నేమి లేక
పాంథునకుఁ గర్ణపేయమై బరగునపుడు
దూరమందున్న పసులఘంటారవంబు.

౫

పాంథుఁ డొకకొంతవడి కాత్మభవనమరుగఁ
బథమునందున సంసతప్రపదముల్లైన
వానికెల్లను మిన్నయై వఱలు నహహా!
స్వాగతము బల్కు ప్రియురాలివలపుపలుకు.

# పద్మినీపరిణయవిమర్శనము

ఒంగోలు వేంకటరంగయ్యగారు బి. ఏ; బి. యల్.

ఇదియొక్క చిన్న మూడాశ్వాసముల తెలుగుశృంగారప్రబంధము. గద్యపద్యాత్మకముగనున్నను పద్యములసంఖ్యయే చాల నెక్కువగనున్నది. శ్రీమతి చిల్కపాటి సీతాంబావిరచితము.

శ్రీమతి సీతాంబగారు ఆంధ్రశ్రీవైష్ణవులు. ఈమె పుట్టినిల్లు నెల్లూరుజిల్లా,కందుకూరుతాలూకా కలికివాయి. ఈమె మాతాపిత్రన్వయములును భర్తృన్వయమును పండితవంశములు. "కౌండిన్యగోత్రవిఖ్యాత రాఘవార్యునకు మంగమాంబకు నాత్మజాత". 'అనఘు వేంకటనారసింహార్యుపత్ని' (1-3) అత్తగారిల్లు నెల్లూరుజిల్లా రాపూరుతాలూకా అదూరుపల్లె శ్రోత్రియము. భర్తగారు శ్రోత్రియందారులలో నొకరు.

సీతాంబగారు గడచిన శార్వరినామసంవత్సరాశ్వయుజ బ 11 లు గురువారమునకు సరియగు 1900 సం అక్టోబరు 18 తేదీన జననమొందిరి. ఈమెకు ముగ్గురు చిన్నచిన్నకుమారు లున్నారు. కుమారిత ముచ్చటల 'నీపద్మిని' యొసగినది. భర్తృసేవాపరాయణురాలగు పరమసాధ్వి. వైష్ణవత్వసిద్ధి కరవమగతికమను భ్రమతో గాబోలును గొంద రాంధ్రశ్రీవైష్ణవులు దాక్షిణాత్యద్రావిడ వైష్ణవసంబంధముల జేయుటయు; ఇండ్లలో నరవముమాటలాడుటయు గన్పట్టుచుండు నీకాలమునను యీయాంధ్రపురంధ్రి మాతృభాషయందలి ప్రేమగౌరవములచే మృదుమధురశైలితో శ్లాఘ్యమగు నీప్రబంధమును రచించుట మిక్కిలి కొనియాడదగియున్నది.

వేదములకాలముననుండియు నిప్పటివరకును మనదేశమునందలి నానాభాషలలో గ్రంథముల రచించిన స్త్రీకవిజనముయొక్కయుగంతములు కొంతకుగొంత హైందవపైతృకము (Heritage of India) అను గ్రంథమాలికలో బ్రకటింపబడిన హైందవస్త్రీకవిత (Poems by Indian Women) అను నింగిలీషు గ్రంథమున గలవు. అయితే తెలుగుస్త్రీకవులలో నొక్కరినిగూడ నిందు జేర్కొనలేదు. దీనికివెనుక వెలువడిన ఆంధ్రవాఙ్మయము. (Telugu Litrature) అను గ్రంథమున గొన్నిపేళ్లు గలవు. ఈగ్రంథము ప్రకటింపబడునప్పటికి శ్రీసీతాంబగారిప్రశంస కవితాప్రపంచమునకు పరిచితము.

నెల్లూరున వెలసియుండు 'వాగ్వల్లి'సుమసందోహమున నీ"పద్మిని" సౌరభ్యము వెలువడుటచే నీకవిగారిపేరు ప్రసక్తమగుచున్నది. ఈవిషయమున వాగ్వల్లినిర్వాహకులు ఆంధ్రదేశమునకు గొప్ప సేవజేసినవారయి వంద్యులగుచున్నారు. ఈగ్రంథ మాప్రణాళికయందు గడచిన యాశ్వయుజమున విజయముగాంచినది.

శోభవతీపురంబు నేలుచుండిన రత్నగర్భు డనపత్యుడై వెతజెందియుండ నొక్కనా డాతనికడకు నారదు డేగుదెంచి నీకీజన్మమున పుత్రలాభము లేదనియు, శ్రీతులసీవ్రతము సేయుమనియు, దానివలన యొక్క కూతురు గల్గునని యుపదేశించి జనియె. అంతట నారాజును, యాతనిసహధర్మచారిణి గౌతమీదేవియు బృందావనసేవ జేయుచుండగ వారి కొకకుమారిత గలిగినది. ఈమెయె ఈ కథానాయికయగు పద్మ.

ఈ పద్మినికి పెండ్లీడువచ్చినంతట వరాన్వేషణమునకై తండ్రి ప్రయత్నించుచుండ వీరిరాజ్యమునకు చేరువనుండు యమరావతినేత శూరసేనునికుమారుడు మాధవుడు సౌశీల్యసౌందర్యాదుల నీకన్యకు తగినవరుడని దెలిసి వాని కీవలయునని తండ్రికి కోరికగలిగినది. ఈమాధవుని గుణరూపదుణాదుల నీపద్మినియు విని వానినే బెండ్లియాడవలయునని నిశ్చయించుకొని తనమనోరథము నారాకొమరునికి దెలుప తనచెలికత్తియ కళావతికిం దేటపరచినది. అన్వర్థకళావతియగు నా కళావతి యోగివేషముదాల్చి కాషాయయోగదండాదుల బూని యమరావతింజేరి యచట కొంతకాలముండగ మాధవుని కీమహామునిపై భక్తికుదిరి యాతని సేవజేయుచుండ నొక్కనాడు తన"భావిసితులదెల్పు"మని మాధవు డాయోగినడిగెను. ఆయవకాశమునుబొంది.

చెప్పెడిదేమి యింక నృపశేఖరనందన యొక్కజవ్వనిన్
ఒప్పులకుప్పయైతనరు నొక్కమహీంద్రునిపుత్రి బెండ్లియై
యెప్పుడు పొన్నునుండి దిగ వెల్లరిలోఁ దలమానికంబవై
యొప్పుచునుందు వింక సుగుణోజ్జ్వల! మాటలువేయునేటికిన్॥ (2-39)

అని యాతనికి నోరూరబలికి తా నాయమరావతినుండి బయలువెడలి తిరుగ శోభవతింజేరెను.

పద్మిని యారాజపుత్రునిపై మనసుదగిలి విరహవేదనంబడుచుండగ కళావతి వచ్చి తాజేసినపన్నాగమం తయు జెప్పి మాధవునిరూపపటము నొకదాని వ్రాసి పద్మిని కిచ్చినది. దీని జూచుకొలదియు పద్మిని కాతనిపై మోహమతిశయించి ఏమియుదోచక యొకరాత్రి చంద్రోదయానంతర ముద్యానవనమున్బ్రవేశించి.

శారదపూర్ణిమాద్యుతి దిశల్ రమణీయముగాఁగ నిండుటల్
గోరువలు న్మకంబులును గోరి హాళాహళిగాఁగఁ గూయుటల్
మారుఁడు సాయకంబులను మాటికి నేయఁగ నోర్వలేక య
వ్వారిజగంధి యేడ్చెఁ బికవాణిని గేరు కలస్వనంబునన్. (3-14)

అట్లు విరహార్తయై విలపించుచున్నసమయంబున నొక్కకాపాలికుండు కాళికాదేవికి బలియొసంగు టకై యుత్తమరాజకన్య నొక్కదాని నన్వేషించుచు ఈరాజపుత్రి యేకతంబ వనంబుననుండుట యెఱింగి

డాయం జని భీతిలు నా
తోయజముఖి నెత్తికొనుచు దోర్బలలీలన్
బోయె నొరు లెఱుఁగకుండఁగ
మాయావర్తనుఁ డరణ్యమార్గముల దెసన్. (3-18)
వానిగాంచునంత వసుధేశనందన
పుడమిమీఁదఁ ద్రెళ్లిపడియె భీతి
నంతఁ గొంతవడికి నాముగ్ధ మూర్ఛను (3-91)

దేరి తిక్కకవి ప్రయత్నించిన శ్రీగౌరుల యైక్యమునకన్న మిన్నగ శ్రీవాణీగిరిజాతల కభేదమును సాధించి ఆ యాపత్సమయమున నిట్లు ప్రార్థనజేసినది.

సిరులిడి రక్షణన్సలుప శ్రీ రమణీమణివోచు విద్యలన్
గరుణ నొసంగ వాణియనఁగా విలసిల్లుచు దుష్టదైత్యసం
హారణ మొనర్ప దుర్గయనునట్టివిధంబుల లోకవృత్తముల్
జరిపెడు నీవు నన్నిచట సత్కృపఁ గాచు టదెంత భార్గవీ? (3-27)

ఈవిధంబున నాకాంత యాక్రందనంబుచేయుచున్నయెడ మాధవు డారాకొమారికం దలంచుకొనుచు వెఱ్ఱియెత్తినవానివలె నరణ్యమార్గంబున నశ్వారోహణంబొనర్చి యరుగుచుండ "రక్షింపుడు, రక్షింపుడు" యను వాక్రందనము చెవిసోకి ఆయార్తరవంబు విననైనదిక్కునకుంజని యందుఁ గాళికింబలియొసంగఁ బద్మినింగొని పోవు పాషండులగని తనకరవాలంబు ఝళిపించుచు యద్దురాత్ములశిరంబుల ద్రెళ్ళవేసి పద్మినింగాపాడెను. తదనంతరం బాయిరువురు యొండొరుల దెలిసికొనిరి. లజ్జచే నాపద్మిని శిరంబువంచి యొద్దియుం బలుకనేఱుం గక కరంబుసిగ్గున మిగులఁ దడబడుచుండగ మాధవుఁడే పూర్వభాషియై,

"తరుణీ! మారుడె కాక కూర్మి మనకుం దాంపత్యముం గూర్పఁగా
సరసీజాతభవుంఁడుగూడ మదిలో సంకల్పముంజేసి యి
ట్లరయ న్వేడ్క ఘటించియుండఁ దగునో యబ్జాక్షి! సిగ్గొంద" (3-65)

అని పల్కరించి నిజహృదయంబెరిగింప వినయలజ్జాసంభ్రమంబులు పెనంగొన నమ్ముగుద యాత్మగౌరవమును కులశీల గౌరవములను గాపాడుకొనుచు పరమసాధుత్వమున

"తల్లియుఁ దండ్రియుం గురులు దక్కినబంధులు తోటినెచ్చెలుల్
ఎల్లరు నన్ను నీకొసఁగ నెంతయువేడ్క నిను న్వరింపఁగా
నుల్లమునం దలంతురు గుణోజ్జ్వల! వేఱొకరీతిఁ బోవఁగాఁ
జెల్లునె? యే స్వతంత్రమును జేయఁగనౌనె?" (3-68)

అని ప్రత్యుత్తరమిచ్చినది.

అంత నాతడు గాంధర్వంబు నడ్డునెట్టు నా ప్రేయసిం దనగుఱ్ఱముమీద నెక్కించుకొని యమరావతి జేరెను. ఈశుభవర్తమానమును రత్నగర్భునకు దెలిపినంతట నాతడు కుటుంబపరివారసమేతుడై వచ్చి కన్యావరులకు యథాశాస్త్రీయముగువివాహము జరిగించెను. అందరును సంతోషించి సుఖంబుననుండిరి.

ఇంతటితో రమ్యమగునీకావ్యము ముగిసియుండిన రమ్యతరముగ నుండెడిది. "కొన్నిరహస్యములను దగురీతిని జెప్పి యత్తరుణిని పడకటింటికి బంపుడీ" మొదలగునవియు గలవు. అయినను వీనియందెచటను దూష్య ప్రసంగములెవ్వియు లేవు. అసహ్యములగు రహస్యప్రకటనలును లేవు. కావ్యసౌకుమార్యమునకు కార్కశ్యము కలుగలేదు.

ఈకవికి కవిత్వసంపద సహజముగనుండునటుల దోచుచున్నది. యతిప్రాసములకై కష్టపడక పద్యములనడక సరళమై లలితమై యున్నది. పదరచనయందెచటను కటుత్వములేక మృదుమధురముగ నున్నది. 3-10 సీసభాగమున "వీభూతి" యను ప్రయోగమున్నది. శబ్దసిద్ధికి లోకమే పరమప్రమాణమగునేని నిదియు సాధువేయగును. "విభూతి" వారికంటె "వీభూతి" వారె లెక్కకుమిక్కిలిగ నున్నారు. కళాప్రపూర్ణ మహోపాధ్యాయ వేంకటరాయశాస్త్రిగారు అముక్తమాల్యదావ్యాఖ్యానమున (1-17) "తప్పిదారి" యందలి "దా"కు గతిగల్పింప వ్యాకరణసూత్రమొకటి జూపియు "ఇట్లె లోకమందు ప్రయోగము" అనియు శాసించి యొకానొకచాటువాక్యము నుదాహరించియున్నారు.

అష్టాదశవర్ణనలతోగూడిన మహాకావ్యలక్షణములన్నియు ఈచిన్నిప్రబంధంబున నిమిడియున్నవి. చంద్రోపాలంభనము, మన్మథదూషణ,విరహతాపము,వనవిహారము,ఋతువర్ణనములు, జలక్రీడ, పుష్పలాలికావిలాసము లోనగు కావ్యసంప్రదాయములు చక్కగ ననుష్ఠింపబడియున్నవి. వరూధినీగిరికలంబోలి యిందలి నాయికయు 'కలస్వనంబున' నేడ్చినది.

కవి స్త్రీయగుటచేత పెండ్లింటియలంకారములను, బువ్వంపుబంతులచందమును, పెండ్లికొమారితయలంకారము లోనగువిషయములను రమణీయముగ జెప్పినది:—

వాకిళులముందు కదళికల్ వరుస నిలిపి
వెలయ పుష్పసరంబుల వ్రేలగట్టి
గుమ్మములకుఁ జందనంబునుఁ గుంకుమయును
సరవి బూయించి కలపముల్ జల్లి వేడ్క.
అన్నము సూపము ఘృతము

న్నన్నుగఁ బచ్చళ్లు మంచిపరమాన్నంబుల్
మిన్నయగు నూరగాయలుఁ
గ్రన్నన చిత్రాన్నములును గమ్మనిచారుల్. (3-147)
అప్పడములు వడియంబులు
తెప్పలుగా నిడ్డెనలును దేనెతోళల్ వె
న్నప్పంబు లతిరసంబులు
నొప్పగు లడ్వములు గారెలోగి హోళిగలుఁ౯. (3-148)
చక్కెరయుఁ గదళిఫలములు
మక్కువతో ద్రాక్ష మంచి మామిడిపండ్లుఁ౯
చిక్కని మీగడపెరుగులు
జక్కఁగ సాపడిరి బుధవితానముతోడ౯. (3-149)

పెండ్లికూతురివర్ణనలో నొక్కెడ నామెకు "వలిపె చెంగావిపట్టువల్వ గట్టి గరిమ సరిగంచుఱవికె వేడ్కలర దొడిగి వెంట్రుకలనార్చి కీల్గంటు" వైచినది. ఇంకొకచో "వెలిపట్టు చీర గట్టగనిచ్చి యాకుపచ్చరైక" దొడిగించినది. ఈ వస్త్రపరిధానమునందలి యౌచిత్య మాడువారి కశిక్షితవిద్యగదా!

"శ్రీభాష్యకారాచార్యకరుణాకటాక్షలబ్ధపంచసంస్కారపవిత్రిత" యగుటచే నీయమ యచటనచట శ్రీ వైష్ణవసంప్రదాయాభిమానము జూపినది. రత్నగర్భునకుఁ బుత్రికావర మీయవచ్చిన సురమౌని "ఊర్ధ్వపుండ్రంబు"ధరించెను. పద్మినిచెలికత్తియ కళావతి యోగివేషము దాల్చినపుడు "మేనినిండ భూతినియలంది"నను "శారదాపూర్ణిమాచంద్రు గేరు మొగంబున నూర్ధ్వపుండ్రంబు"నే బొందుపరచినది. మాధవుని "నగుమొగంబున గీరునామంబు"నలంకరించినది. మరియు పెండిలిబువ్వమునకువచ్చిన బందుగులెల్లరు పారిభాషికముగ "సాపడిరి"

ఇట్లు అభిమానములజూపినను మంగళసూత్రధారణముహూర్తమున.

గౌరీకళ్యాణంబులు
వారక భూదేవపుణ్యవనితలు ముదమొప్పారగఁ

బాడిరనియు జెప్పినది. (3-142)

ఇందును సనాతనధర్మములకుగాని సంప్రదాయములకుగాని భంగమేమియు లేమి నెరుగనగును. శ్రీ రుక్మిణీదేవియు తనస్వయంవరసందర్భమున పురాణదంపతులగు నుమామహేశులనె గొల్చి గౌరీదేవికి మ్రొక్కినదిగదా.

ఈమె కవిత్వమున దీర్ఘసమాసములు, క్లిష్టాన్వయములు, నిఘంటువులజూచి వెదకినపదములులేవు. సామాన్యపు వాచకము గలవారునైత మర్థముజేసికొనగలరు.

భూసురు లక్షతలంగొని
భాసురముగ వేదములను బఠియించుచు నా
రాసుతునకుఁ బద్మినికి౯
ఆస౯ నాసీసు లొసగితిమోదముఁ౯. (3-145)

అను పద్యమురొక్క నాల్గవపాదమునందలి మొదటి నాల్గక్షరములలో నచ్చుదప్పున్నటుల దోచుచున్నది. కవయిత్రి "ఆసను నాశీస్సు లొసగి రతిమోదమున౯" అని పఠించియుండును. ఉన్నట్లుండనిచ్చిన అర్థహీనముగ పరిహాసమున కెవరయిన "ఆసన్యాసి" యని చదువవచ్చును.

ఈమె జేసినవర్ణనలు స్వభావసుందరములయి యున్నవి. దిక్ప్రదర్శనముగ గొన్నిటి జూడనగును:—
వసంతర్తువర్ణనలు:

కోమలంబులౌ చిగుళ్ళుగొంచు జీర్ణపర్ణముల్
భూమిమీద రాల్చ వేడ్కఁబూను తరులఁగాంచ నా
రామలక్ష్మి య వ్వసంతురాక నెంచి పచ్చనౌ
కోమలాంబరంబు దాల్చుకొన్నలీలఁ గన్పడెన్॥ 2-83

వనవిహారమున;

అలసితివమ్మ చాల వికచాంబుజపత్రవిశాలనేత్ర! మే
మలరులఁ గోతుమమ్మ యిటు లందమునై తగు పూలపాన్పుపై
బాలుపెసగంగ విశ్రమము పొందగదమ్మ విరుల్ గ్రహించుచున్
జెలువుగ నంతిసీమకును జేరఁగఁబోవుదమమ్మ నెమ్మతిన్. (2-116)

పద్మిని కంతుసంతాపసంతప్తమానసయై చంద్రాదుల నుద్దేశించి జేసినయుపాలంభనములలోని పద్యములు రసస్ఫూర్తి గలిగినవైయున్నవి.
అందొకటి:—

పలుమారు నాపైకిఁ బరుగులెత్తెదవేల? పవనుఁడా! నినుబట్టి పాముమ్రింగ
మాటికి ననుఁజేరి మాటలాడెదవేమి? చిలుక! నిన్బంధించి చిక్కవలుప
కన్నులెఱ్ఱగఁజేసి కఠుకూకలిడెదేమి? పికమ! నిన్గాకులు బిట్టదల్ప
చలమూని ఝుంకృతుల్ సల్పెద వదియేమి? తుమ్మెదా! నీమేను దుమ్ముగాను
పంచపాతకులని మిమ్ము బలుకవలయు నట్టుగాకున్న నబలల బిట్టలంచు
బుద్ధి మీకేలగలుగు దుర్బుద్ధులార! ఎగ్గొనర్చితిమే మీకు నెన్నడైన? (3-10)

ఈక్రిందిపద్యము సుకుమారమగు ధ్వన్యనుప్రాణితమైయున్నది.

తమ్మి యరవిచ్చి వలపులు ధరణినెల్లఁ
గ్రమ్మకొనసాగె కొదమభృంగమ్ము జేరి
యలరుతేనియ గ్రోలఁగావలయు నింక
నంబుజాననలార! ముదంబుమీర॥ (2—80)

ఇందు కొదమభృంగసాహచర్యవిలాసము సొంపుగ నుద్ధరింపబడినది.

శ్రీమతి సీతాంబగారు సామాన్యములగు సంపద్విభవములచే నొప్పి పరువున సంసారయాత్ర జరుపుకొనుచున్నారు. ఈప్రబంధముగాక "సముద్రమథనము" అను నాటకమును, కొన్ని నవలలనుగూడ నీయమ రచించినటుల దెలియుచున్నది. అవి యముద్రితములుగ నున్నవి. సంసారభారమునువహించి గృహిణీధర్మముల నిర్వర్తించుకొనుచు నీమె గొప్పభాషాసాహిత్యమును గడించి కావ్యరచన జేయగలిగియుండుట యబ్బురపు విషయమైయున్నది. నెల్లూరుమహాజనులును, మహిళాజనమును సభలను జరిగించి ఈకవికావ్యముల సన్మానింప నర్హులగుదురు. విద్యాశాఖాధికారులును ఈగ్రంథమును మెట్రిక్యులేషన్, ఇంటర్మీడియెటుపరీక్షలకు పాఠ్యగ్రంథముగ నుంపదగుదురు. ఆంధ్రస్త్రీలోకము మీకావ్యమునకు ప్రాచుర్య మబ్బజేయదగుదురనియు విన్నవించుచున్నాను.

# కాఁపువలపు

నజ్ఝల కాళిదాసుగారు

౧

వాడినరెల్లుపూవులను వాంఛను తెచ్చితివేల బాల! ప్రే
లాడెదు నీదుజుట్టుననె యల్లెద వానిని రమ్ము హాయిగా
నీడకుఁబోయి కోయిలలు నేర్పెడుపాటలు పాడుకొంచు లే
దూడలువోలె నాడుకొనఁ దోరపుఁగోరిక యయ్యె నెచ్చెలీ!

౨

అల్లదె చూడు మూయెలగ నల్లితి నూడలు మఱ్ఱిచెట్టునన్
జల్లగ దానిపై నిదురచక్కిలిగింతలు పెట్టుచుండ రే
యెల్లను నాడుకొందుమ చెలీ?...కనుచీఁకటి లేఁతవేఁకువన్
రెల్లులచాటునందు నిదురింతమ మోమున మోముజేర్చుచున్?

౩

ఏమిది నెచ్చెలీ మొగము నించుకప్రక్కకువంచి, యెత్తి నా
మోమును జూతువూరకయె? పూవులు కోయగఁ గోర్కెయయ్యె,ర
మ్మా—మృదువైన యీయిసుకమంటపమందు రహస్యవాక్యముల్
ప్రేమను చెప్పుకొందు వినిపింపక నీవొకయింత నవ్వగా.

౪

ఈసెలయేటిచెంగట నిదేగతి గాలులకౌఁగిలింతలన్
మూసినకన్నులన్ దెరవఁబోక సుకమ్ముగ నిద్రపోదు—నా
కోసమెయైన లేఁతవెలుఁగున్ జిరునవ్వుల చుక్కకన్నె లా
యాసపుచూపులన్ నిలుపునా తుదిముట్టనికారుచీఁకటిన్.

౫

గాలులతోడ సొమ్మసిలి కాలపుటంచుల దాటిపోయి యే
మూలలనో కాంతియైనఁ జొరఁబోనియెడన్ బ్రళయమ్ములేని తీ
రాలను నాదుకన్నుగవఁ గ్రమ్మెడు నీచిరునవ్వువెన్నెలన్
బాలిక యేవియో వలపుఁబాటలఁ బాడుచునుందు హాయిగా.

# మా అమ్మ

శ్రీమతి వి. వేంకటలక్ష్మమ్మగారు

నాచిన్నతనములో మాతండ్రిగారు మాఅమ్మ నెక్కువ శ్రద్ధాదృష్టులతో జూచి యుండిరనువిషయము నాకు బాగుగ జ్ఞాపకమున్నది. వైవాహికజీవితమున స్త్రీపురుషుల స్వభావములు ప్రకృతియందించుక విభిన్నముగనుండును. స్త్రీస్వభావ మించుక తక్కువగ నుండును. పురుషప్రకృతి వేఱుగనుండును. మానాన్నగారు స్వభావమునం దెంతయుమంచి వారుగ నుండెడివారు. కాక యందఱియెడ ప్రేమను చూపెడివారు. వారివదాన్యత చెప్పుకో దగినది. దుఃఖప్రపూర్ణమగువిషయమును వారియెదుట వచించినచో దానిని విశ్వసించి ప్రతీకారమొనర్చుటకు సిద్ధముగనుండెడివారు. గౌరవాదులలో వారి కెట్టికొఱతయు నుండెడిదిగాదు. పూజ్యురాలగుమాతల్లి యీవిషయములన్నియు నెఱుగును. ఆమెయు నిట్టి సద్వర్తనమునే హృదయమునందు నిల్పికొనినది. కాని మాతండ్రికంటె ఆమెకు వివేక మధిక ముగ కలదు. ఎంతటియుదారమనస్కురాలైనను సంసారమును దిద్దుకొనుటలో గాలము విశేష మామెకు వ్యయమగుచుండెడిది. దుఃఖితులపట్ల హృదయపూర్వకమగు సానుభూతిని దెల్పుచుండెడిది. మాతండ్రి తఱచు ఇట్టి దుఃఖితులవిషయమున మోసపోవుచుండెడివారు. మాతల్లి యెంతయు మెలకువగనుండెడిది. వత్సరములు గడచుకొలదియు మాతండ్రి మాఅమ్మ వివేకముపైననే యాధారపడి సర్వ మామెయిష్టప్రకారముగనే సాగించుచుండెడివారు. వృద్ధావస్థయందుసైత మామె పతిపరాయణురాలగు పత్నిగాను, ప్రేమపూరితయగు మాత గాను ఉండినది. గృహవిషయికమగుశాసనమంతయు తండ్రిహస్తములయందేయున్నను సామా న్యముగ నంతయు మాతల్లికే అప్పగించెడివారు. విమర్శనావసరములగు విషయములన్నియు మాతండ్రి తనవివేకముపై విశ్వాసముంచక యంతయు మాతల్లిపైననేయుంచి యామె యిష్టానుసారముగ ప్రవర్తించుచుండెడివారు.

ఈకారణమున మాఅమ్మ పరమపదించినపుడు తద్వియోగజనితదుఃఖము మా తండ్రికి సహింపరానిదాయెను. మాతల్లిదండ్రులు 50 వర్షములు ఆదర్శయుతమగు వైవా హికజీవితము గడపిరి. ఇట్టి యాదర్శదంపతులు లభించుట కడుంగడు కష్టసాధ్యము. వారు పరస్పర మత్యంతప్రేమను జూపుకొనుచుండువారు.

నేను విదేశములకు వచ్చినతరువాత మాఅమ్మ మరణించినపిదప మాతండ్రి నాకనేక లేఖలు పంపిరి. ఆపత్రములన్నియు కరుణాపూరితములు. తన పత్నీవియోగమువల్ల పీడితుడై భావపూరితమగు తనహృదయమునుండి వెలువరించిన యావిషయములన్నియు కోమలము లును, హృదయద్రావకములును. ఆలేఖలలో తాను మాతల్లితో కలిసిపోవుట కెంతయో నభిలాషగలిగియున్నట్లు ప్రకటింపబడినది. ఆలేఖల జదివిననేను నాకన్నీటి నాపుకోజాలక పోతిని. మామాతృవియోగమున దుఃఖితులై తమ యశాంతమగుమనసు నోదార్చికొనుట

కును, విశేషించి తమయేకాంతసమయమున తివాహితము చేయుటకును మాతండ్రి యీ దృశకవితను ప్రారంభించియుండిరి. తమజీవితమునందు వారొక్కపంక్తియు కవితారూపమున వ్రాయలేదు కాని యిన్నాళ్లైనపిదప పత్నీవియోగమున తన దుఃఖపూర్ణహృదయమునసున్న భావములను కవితారూపమున వ్రాయమొదలిడిరి. ఈకవితను బఠించి యొకడు "తమ కవితచే సంతప్తమైననాహృదయముకూడ నోదార్పబడినది. అత్యంతమగు హార్దిక మోదము చేకూరినది" అని వ్రాసెను. మాతండ్రి యీకవితామూలమున దుఃఖభారమగు తమహృదయమునకు విశ్రాంతిగలుగునని వ్రాసియుండలేదు కాని యన్యులహృదయసాంత్వనము గలుగచేయుటయే వారియుద్దేశ్యము. వారి కవితలోని హృదయమును గరిగించునట్టివి కొన్నిటి ననువదించి నీక్రింద వ్రాయుచున్నాను.

"ప్రియే! అతీతములగు వత్సరములను ధ్యానించుకొనినప్పుడు అంతటి సుఖముగను, సంతోషముగను మనము జీవించినదినములను స్మృతికి దెచ్చుకొనునపుడు, ఈయానందము చిరస్థాయిగాదనియు, ఈభగవత్ప్రసాదము శీఘ్రముగనే యంతరింపగలదనియు నాకు దెలియుచున్నది. కాని, ప్రేయసీ! పరివర్తనసులభము కాని యీశ్వరదత్తములైన మన హృదయములు విభేద మెఱుంగక కలసిపోయినవి. అదియే అఖండప్రేమ యనునొకవస్తువు. ప్రియే! అయినను ఈ సంసారమునందు మనజీవితములు నశించును. మనశరీరములు పాంసువులో నైక్యమైపోవును. కాని ప్రేమ యెపుడును నష్టముగాదు. అది పరమాత్మలో స్థానమేర్పఱచుకొనును. అయ్యో! నిన్ను కాలము పరమపదమునకు గొంపోయినది. నేనొంటరిగ ఏకాకినై కాలముగడుపుచున్నాను. కాని, ప్రేయసీ! నాప్రేమస్రవంతి శుష్కింపలేదు. దాని ప్రవాహము నిరంతరవేగమున బ్రవహించుచున్నది. ప్రియే! ఆస్వర్గీయభవనమున నంతటను సుఖమును, ఎల్లపుడును శాంతమును, చేకూరగలవు. మన మిద్దరము తిరిగి కలసికొనెదము. మఱి యిక యనంతకాలముదనుక మనకు వియోగము కాజాలదు."

సాహిత్యదృష్టిద్వారా యీకవితను జూచుటలేదు. ఆదృష్టిలో యీకవితయందు సౌందర్యము లేకపోవచ్చును. కాని యీకవితలోనిప్రతిపదము దుఃఖోద్వేగజనితబాష్పములతో వ్రాయబడినదనియు, ఇందుమూలమున పితృహృదయవేదన మేమాత్రము తగ్గిపోలేదనియు నాకు తోచుచున్నది.

మే మందఱము-అనగ సోదరీసోదరులము-మాతండ్రి చూపినంతశ్రద్ధను మాతల్లిపై చూపుచుండెడివారము. నేను గృహమును వీడి విదేశములకేగినపుడు అటనుండి మాతల్లి కనేకవిషయప్రపూర్ణమగు పెద్దపెద్దలేఖలను వ్రాయుచుండెడివాడను. ఆలేఖల నామె యింటనున్న మాతమ్ములచే చదివించుచుండెడిది. నేను హిందూస్థానమునకు వచ్చినపుడు బొంబాయినుండి ప్రతివారము బయలుదేరు ఓడతపాలుపై నొక్కొక పెద్దయుత్తరమును శీఘ్రముగ బంపుచుండెడివాడను. ఒకవారము నాకు బంపుట కవకాశము లేకపోయినది.

వెంటనే మాతల్లి కెట్టివిచారము కలుగకుండునట్లు తంతినిచ్చితిని. తనవృద్ధావస్థయందు సైతము ఆమెకు నామూలమున యెట్టివిచారమును గలుగలేదనుట నాకు బాగుగ స్మృతి యందున్నది. నేను తఱచు మాఅమ్మ కిట్లు వ్రాయుచుండెడివాడను. "తల్లీ ఒకవేళ ఓడయొక్క ఇబ్బందులమూలమున నొకవారము నాయుత్తరము నీ కందకపోయినచో నీవేమాత్రమును చింతింపవలదు." తఱచు గుప్తపరీక్షకభటుల (C. I. D. Police) కరుణాదృష్టులలో నాలేఖలు పడుచుండెడివి. అపుడు నాలేఖలు అందుట కెక్కువయిబ్బంది యగుచుండెడిది. ఈకష్టమును దప్పించుకొనుటకు నాకెట్టియుపాయమును దోచినదిగాదు. ఏదియెట్లైనను మ అమ్మకు నేను తప్పకుండ వారమున కొకపరియుత్తరమును వ్రాయుచుండెడివాడను.

శ్రీ దీనబంధు సి.యఫ్. ఆండ్రూసుగారి హిందీవ్యాసమున కనువాదము.

# నీ వెవ తెవు ?

కొమ్మనమంచి జోగయ్యశర్మగారు.

అఖిలకల్యాణసంధాయి, అమరసౌఖ్య
సంపదలకిక్క, యానందజన్మభూమి,
నిర్మలతరంగనాకధునీప్రవాహ
శీకరంబులఁ బులకరించినతలంబు,
నైన విష్ణుపథంబును నాశ్రయించి,
యిట్లు దురపిల్లుచుంటి వీ వెవతెవమ్మ ?
అతిమృదుశిరీషపుష్పశయ్యాతలాన
నధివశించి, యమృతాస్నంబు లారగించి,
చెలిమికత్తియ లెవ్వను వెంట సేవఁజేయ
దేవసౌధాంతరగృహాలఁ దిరుగుచుండి,
యతులితానందసందోహమందు నిన్ను
అకట ! యెవ్వడే ! కఠినుఁ డీయంధకార
బంధురగృహాలలో నుండఁబనిచెనమ్మ !
అంతులేని శోకాగ్నిచే నవయు నీదు
వేణిబంధమే గాఁబోలు ! వీడి, మింట
నీలిమాంబుదపంక్తియై నెగడె ! సడలి
జారినసుమాలుగాఁబోలు ! చదలఁదరళ
కాంతు లెగఁబోయుచుండు నక్షత్రమాల !
స్వర్గభూమి సందర్శనేచ్ఛామనీష
నడుగు డెంచితో ! నందనోద్యానవీథిఁ
బూలబొదరిండ్లలోన నుయ్యాలలూగి,
పుణ్యభాగీరథీతీరపులినమందు
అమరకన్యలతో నాటలాడియాడి
తిరిగి నగరంబుఁ జేర, మధ్యేపథానఁ
గటికచీకటు లెల్లెడఁ గడలుకొనఁగ
నెలవుతప్పిన నాగకన్నియవ ! అన
నవనవాగతవర్షదినాలలోనఁ
జిటికెలోఁ గానుపింతువు ! చిటికెలోనె
మాయమౌదువు నీరదమాలలోన
నిట్టితరళించుచుందు ! వీవెవతెవమ్మ !

# సౌందర్యము

**శ్రీమతి దేవులపల్లి జగదంబగారు**

## ౧

పండిత బదరీప్రసాద్ శుక్లా చాలాగొప్పవాడు, మర్యాదస్థుడు, పిల్లజమీందారు. అయిదారువూళ్లు ఆయన చేతిక్రింద వుండేవి. ఆయనకు వకకుమార్తె వకకుమారుడు. కుమార్తెకు 14 సంవత్సరములు. ముసలితల్లి, ఆయనభార్య, ఇంకా గుమాస్తాలు నౌఖర్లుకలసి 15 మంది.

## ౨

ఆయనకుమార్తె లీల చాలా తెలివితేటలుగలపిల్ల. ఇంగ్లీషు మూడవఫారము ప్యాసుఅయినది. సంగీతము, చేతిఅల్లికలు, కుట్టుపని, వినోదములయినపనులు చాలా వరకు నేర్చుకొన్నది. లీల చిన్నతనములో మశూచకముపడుటవల్ల శరీరము గుంటలుపడి దేహసౌందర్యము చెడగొట్టెను. కాని కళ్ళు, ముక్కు, మొగము చాలా తీరుగా వున్నవి. బదరీప్రసాదుగారికి రాత్రి పగలు యిదేచింత. 14 సంవత్సరములకన్య. ఎక్కడా వరుడు దొరకలేదు. చూస్తూ చూస్తూ పేదవాడికి, మూర్ఖుడుకి యివ్వలేడు. తెలివైనకుర్రాడికి, చదువుకున్నవాడికి యిద్దామంటే డబ్బుదాహము అధికముగా వుండేది. అది తీర్చుటకు సిద్ధపడితే పిల్లఫోటో చూస్తాము పంపమనికోరేవారు. అదిచూచి బాగు లేదని తిరిగి పంపివేస్తూవుండేవారు. యీసంగతి చూచి ఆయనకు నిద్రాహారములు మందగించినవి.

## ౩

ఒకరోజున సాయంకాలము 5 గంటలకి బదరీప్రసాద్ వాకిటిలో వాలుకుర్చీపై కూర్చొని వార్తాపత్రిక చదువుచుండెను. అంతట ఆయనతల్లి కోడలుని వెంటబెట్టుకొని వచ్చి అక్కడ కూర్చొని "నాయనా! బదరీ! యీడువచ్చినపిల్లను యింట్లోపెట్టుకు యీలా వూరుకుంటే యేలాగు?" అని ప్రశ్నించెను. బదరీ (చదువుచున్నపత్రికను ప్రక్కనవుంచి) "నేనేమి చేసేదమ్మా! ఎంతప్రయత్నముచేశినా పిల్లఫోటో చూచి యెవరూ యిష్టపడకుండావున్నారు."

తల్లీ:—యేం, మనపిల్లకు గుడ్డా, స్పొట్టా యిష్టపడక పోవడమునకు? ఆ మచ్చలేకదా! అవి లేకపోతే రత్నంలాంటిది పిల్ల.

బదరీ:—ఆమచ్చలుచూచే వప్పకుండావున్నారు. యిప్పటికాలపుయువకులు విద్యాబుద్ధులు, తెలివితేటలు చూడరు యెంతసేపు పైతోలుచూచి భ్రమపడతారు.

తల్లి:—యేదో ఆలోచించి వెంటనే పెళ్లి చేస్తేగాని లేకపోతే కొంపమునుగుతుంది" అని చెప్పి వెడలిపోయెను. ఆయన కొంతసేపు అట్లు కూర్చొని దీర్ఘాలోచన మొదలుపెట్టెను. యేమి పాలుపోవడము లేదు. యింతలో అకస్మాత్తుగా ఆయనకు వకసంగతి జ్ఞప్తికివచ్చెను. "ఫొటోను రిటచ్చి (Retouch) అనగా దిద్దించి పంపిన కార్యము సాధింపవచ్చును. గాని మోసముకాదా! మర్యాదపోదా! తరువాత పిల్ల యేమిబాధలుపడునో!" అని విచారించెను. "ఆలాగు చెయ్యకపోతే మరిపెళ్ళికాదే!" అని కొంతసేపు తర్కవితర్కములుచేసి "వైవాహికములందు అబద్ధములాడినను తప్పులేదు. మనవారందరిలో పరిపాటె. పెళ్ళిళ్ళలో కబుర్లు రూపాయికి పావలాలే నిశ్చయం." అని సిద్ధపడుచుకొని ఫొటో రిటచ్చి (Retouch) చేయించి పంపుటకు నిశ్చయించుకొనెను. అప్పుడే యిదివరకు చాలామందికి ఫొటో పంపడము తిరిగి రావడము అయినది. వారికి పంపుతే నమ్మరు. అందుచే క్రొత్త సంబంధము మాట్లాడి యీఫొటో పంపాలి" అని నిశ్చయించెను. అంతట హృదయభారము తగ్గి భోజనమునకు లేచెను.

## ౪

సాలిగ్రామ్ ఇంటరుసీనియరు చదువుచున్నాడు. బుద్ధిమంతుడు, అమాయకుడు. తల్లిదండ్రులకు యేక

పుత్రుడు. విశేషము ఆస్తిలేదు. మామూలుగృహస్తులు. తల్లి యేలాచెప్పితే ఆలా నడుచుకుంటాడు. పిల్లవాని బుద్ధివిశేషములు విని ఆస్తి లేకపోతేమానె, మనపిల్లకి తగినవరుడు అని నిశ్చయించి పురోహితుని ద్వారా కబురుపెట్టెను. జరగవలసినమాటలు జరిగినవి. నాలువేలు కట్నము, తక్కిన లాంఛనములు జరుపుటకు వప్పుకొనిరి. పిల్లఫొటో పంపమనికోరిరి. "రిటచ్చి (Retouch) చేయించిన ఫోటో పంపిరి. వియ్యపురాలు, వియ్యంకులు చాలా సంతోషించిరి. పిల్ల చక్కనిది. విశేషకట్నముతోకూడా వచ్చుచున్నది అని కుమారునకు చెప్పి ఫొటోను చూపించిరి. చాలా సంతోషించినాడు. పెళ్లి యథావిధిగా జరిగిపోయినది. బదరీప్రసాదు, భార్య యేలోపము రానీయక చాలాడబ్బు ఖర్చుచేసిరి. పెళ్ళిమూడురోజులు వధువు ముఖముమీద మునుగుతీయలేదు. అయిదవ రోజు పిల్లను, పెళ్ళివారిని అంపకముపెట్టేరు. పిల్లకి చాలా సారెసామాను వగయిరా పెట్టిరి. యిన్నాళ్లు పెంచి అత్తవారింటికి పంపిస్తూయున్నా తల్లి తండ్రి కంట తడిపెట్టి, పిల్లకు చాలాబుద్ధులు చెప్పి పంపేరు. పెళ్ళికుమారుడుగారిగ్రామము చేరిరి. చూచుటకు యిరుగుపొరుగులమ్మలక్కలంతా చేరేరు. లీలఅత్తగారు వూళ్లోవాళ్ళకి తనకోడలును చూపుదామని లీలమునుగు తీసింది. కోడలుముఖము చూచి తెల్లపోయినది. 'మనకు ఫొటో పంపిన పిల్లముఖము యిదేనా' అని తనకనులను తాను నమ్మకపోయెను. చూడడమునకు వచ్చినవారిలో గుసగుసలు పుట్టెను. "కళ్లుపెద్దవి. అందమైనముఖమే గాని ముఖముపై స్ఫోటకపుమచ్చలు లేకుంటే చాలాబాగుండును"అని ఒకతె రిమార్కుప్యాసు చేశినది. "యేమిటో! సంసారికి చక్కదన మెందుకు!"అని మరివొకతె సరిపుచ్చినది. యేమైనను లీలఅత్తగారికి బోధపడలేదు. వెంటనే పెనిమిటిదగ్గిరకు పోయి;" చూచేరా! వియ్యాలవారు మనలను యెంత మోసపుచ్చినారో! వారు పంపిన ఫొటో యీపిల్లవలె యున్నది గాని ప్రత్యక్షముగా చూస్తే యీపిల్లముఖమునిండా మశూచకపు మచ్చలే! ఫొటోలో యెంతోశుభ్రముగాయున్నది. యీమాయ యేమిటి?" అనెను. ఆయనకూడా వారిమోసమునకు చాలా ఆగ్రహము తెచ్చుకొనెను. గాని జరిగిన దానికి విచారించిన లాభములేదని గ్రహించి, భార్యతో "సంసారులకు చక్కదన మెందులకు? ఆపిల్ల పుట్టింటివారు చాలాసొమ్మును మనవిషయమై ఖర్చుచేసినారు. మనం పిల్లఫొటో కోరితే పంపినారు. చూచుకొని మనం అంగీకరించినాము. నీవుగాని, నేనుగాని, మనకుర్రవాడుగాని, యెవరమైన స్వంతముగా పోయి చూడకపోవుట మనపొరపాటు. యిప్పుడు అల్లరిపెట్టుట మర్యాదగాదు"అని భార్యను సమర్థించెను. యీ సంజాయిషి ఆమెకు నచ్చలేదు. యింకా మనస్సు తృప్తిలేదు. తనకుమారుడు వచ్చినవెనుక ఆయనకు చెప్పి ఆపిల్లను యేలనీనని, తిరిగి పెళ్ళిచేస్తానని, వారు చేసినమోసమునకు ప్రతిఫలం చేస్తానని చిందులుత్రొక్క మొదలుపెట్టెను. సాలిగ్రాముతండ్రికి తిరిగి పెళ్లిచేయుటకు యెంతమాత్రము యిష్టములేదు. కాని భార్యతో వేగలేక వూరుకొనెను. ఆసాయంకాలము కొడుకుతో తల్లి సంగతియావత్తూ చెప్పి తిరిగి పెళ్లికూడాచేస్తానని చెప్పినది. కొడుకు, భర్త తనచేతులలో వున్నారు. ఇంక ఆవిడఆటలు సాగకయేమిచేస్తాయి! గాని పాపము లీలగతి ముందు యేలానున్నదో!

రాత్రి 9గంటలకు సాలిగ్రాము మంచముపైకూర్చొని ఆలోచిస్తూయుండెను. మంచిసుందరుడు, యవ్వనుడు, చదువుకున్నవాడు, చక్కని తెలివితేటలుగలపిల్లను వివాహము చేసుకుందామనివుద్దేశముతోయుండేవాడు. లీలఫొటో చూచి యివిఅన్నియు కుదిరినవని చాలా సంతోషించి, కార్యభారము తల్లిదండ్రులపై విడిచిపెట్టెను. తిరిగి ఫొటోను యెగాదిగా చూస్తూ మంచముపైకూర్చొనెను. యింతలో పనులన్నీసరిపెట్టుకొని లీల గదిలోనికివచ్చి క్రేగంట పెనిమిటిని చూచెను. ఆమె వచ్చిన చడి తెలిసియు భర్త ముఖముయెత్తి

తనవైపు చూడకపోవుట యేదో ఆగ్రహకారణమని గ్రహించి తలవంచుకుని నిలువబడియుండెను. సాలిగ్రామము మంచముదిగి లీలదగ్గరకు పోయి, తనచేతిలోవున్న పొటోను, ఆమెముఖమును పరీక్షించెను. మిక్కిలికోపముతో ఆమె ముఖము వైపు తీక్ష్ణముగా చూచుచుండెను. లీల భయకంపిత హృదయముతో కనుల నీరు గ్రమ్మ, తలవాల్చి యుండెను. అంతట సాలిగ్రామము యిట్లు సంభాషించెను :—

సాలిగ్రాము :—మీ నాన్నగారు మాకు పంపిన పొటో నీది కాదు. అది యెవరిది?

లీల:— నాకేం తెలుసు? యెవరిదో!

సాలి:— నీకు తెలియకుండా నీతండ్రి యీ మోసముచేసెనా? నేనునమ్మను.

లీల:— సత్యము చెప్పుచున్నాను. నాకేమి తెలియదు. పెళ్ళిముందు నాకు పొటోతీయించినారు. అంతకంటె నాకు తెలియదు.

సాలి:— (తనచేతిలోవున్న పోటోను ఆమెకు చూపి) ఇది మాకు పంపేరు. యిది నీదేనా ?

లీల: — (తలవంచుకొని పొటో చూచి) ఇది నాదేనా?

సాలి:—నీదే అని మీనాన్న పంపేరు. అని (లీల మొగమును, పొటోను, రెండు నిదానించి చూచి), నిశ్చయముగా యిది నీదేగాని పొటోను(Retorch) దిద్దించినారు. ఇది చాలామోసం. ఇట్లు చేయుటలో మీవాళ్లవుద్దేశము యేమి ? అని (ఆ పొటోను అచ్చట పారవేసి వెళ్లిపోయెను.)

లీల:— (భర్త వైపు చూచి, నిరాశతో) తప్పు యెవరివల్లను లేదు. నా కురూపితనమే కారణము. అని నాతలంపు. అని జవాబు చెప్పెను.

సాలి:—(పోటోతీసి మేకుకు తగిలించి)నీ తండ్రి చాలా అనుచితమైనపనిని చేసినాడు. నీ నిజమైన పోటో పంపవలసినది.

లీల:— (మాట్లాడలేదు.)

సాలి:— అటువంటి మర్యాదస్తుడు, పెద్దమనిషి యిట్టి నీచకార్యము చేయరాదు.

లీలకు బేజారుఎత్తిపోయి నోట మాటరాలేదు. ముందు తనగతి యెట్లున్నదో అని దైవముపై భారము వైచి నేలకూలబడెను. ఈసంగతి శోభనమునాటి రాత్రి జరిగెను.

## ౬

తెల్లవారగనే తల్లి కుమారుని చూచి, "కోడలు వచ్చినదా?" అని ప్రశ్నించెను. సాలిగ్రామము జవాబు చెప్పలేదు. తలవంచుకొని వెడలిపోయెను. కుమారునికి యిష్టములేదని గ్రహించి మళ్లీ పెళ్లిచేస్తాను. అని చాటుట మొదలుపెట్టెను. యిట్లు నెలరోజులు గడచినది. ఇంక లీలసంగతి యెట్లుందంటే భర్తకు ఆమెయందు ప్రేమలేదు. ఆమెతో విశేషము మాట్లాడలేదు. గాని, ఆమెమాత్రము పెనిమిటికి అన్ని పనులు అతిశ్రద్ధాభక్తులతో జరుపుచుండెను. అంతే గాక యింటిపనులుయావత్తూ మిగుల జాగరూకతతో చేయుచు అత్తమామలయందు అతిభక్తితో తనతల్లిదండ్రులవలె చూచుకొనుచుండెను. యింత సాధుశీల భూమిపై యున్నదా! అప్పట్లు మసలుచుండెను. యిదిఅంతాచూచి సాలిగ్రామముకోపము పటాపంచలై పోయెను.

ఒకరోజు రాత్రి సమయమున సాలిగ్రామము యేవోకాగితములు వ్రాసుకొనుటకు తనగదిలోనికి వచ్చెను. లీల తనమంచముపై బోర్లపడుకొనివుండెను. ఆయన రా వేగమే లేచి నిలుచుని తలవంచుకొన్నది. సాలిగ్రాము దగ్గరకువచ్చి "ఒంట్లో బాగులేదా?" అని ప్రశ్నించెను.

లీల:—(మాట్లాడలేదు.)

సాలి:—"మొగము యెత్తిచూడు" అని తన చేతితో గడ్డముపట్టుకొని పైకెత్తెను. కండ్లవెంట నీరుగారుచున్నది. కండ్లెర్రగా చింతనిప్పులవలె నున్నవి. తలవెంట్రుకలు చెదరివున్నవి. చెక్కిళ్లు

కన్నీళ్లతో తడసియున్నవి. యీ వైఖరి చూచి స్నేహపూర్వకముగా, "యేం, యేడుస్తూయున్నావు, యెందు కలాగున్నావు? " అని ప్రశ్నించెను.

లీల, పతిమాటలు విని మరింత వెక్కి వెక్కి యేడువ మొదలుపెట్టెను.

సాలి:—(ఆశ్చర్యములో లీలతలపై చేయవేసి నిమురుచు) " సంగతేమిటో చెప్పకుండా యెందుకు యేడుస్తావు యేమివచ్చినది. నాకే మీ బోధపడ లేదు సంగతి చెప్పు."

లీల:—(యేడుస్తూ) నేను చచ్చిపోతాను. ఆలా గైతే తెరిపి.

సాలి:—యేమి ! కారణము చెప్పు.

లీల:—(కళ్లుతుడుచు కొంటూ) మధ్యాహ్నము అత్తగారు యిరుగుపొరుగు స్త్రీలతో నేను కురూపి ననియు, మోటుదాని ననియు మీకు తిరిగి మంచి చక్కనిదాన్ని, బుద్ధిమంతురాలిని పెళ్ళిచేస్తానని, మా వాడికి యీ అందవికారమైన దయ్యాన్నికట్టేరు దీన్ని వదిలిపించుకోవాలి, మా వాడికి చక్కనిపిల్ల దొరకదా, అని యిటువంటి పలుకులు! నెలరోజులాయ. వినలేక చెవులు రంధ్రములు పడుచున్నవి. యేమిచేసేది ? భగవంతుడు నాకు అందకారము తెచ్చిపెట్టేడు నా చేతిలో పనికాదుకదా! యిప్పుడు బాగైపోవుటకు" అంటూ తిరిగి యేడుపు మొదలు పెట్టెను లీల. సాలిగ్రామహృదయము కరగెను. లీలయొక్క సత్ప్రవర్తన, సాధుశీలత, తనయడల భయభక్తులు, నిత్యము తనసేవ యేమరక చేస్తూవుండడము చూచి యిప్పుడిప్పుడే లీలమీద ప్రేమ రాజొచ్చెను. ఇప్పుడు యీ సంగతి విని అతనిహృదయము కరగి యిట్టు ఆలోచించెను. 'రూపము లేకపోవుట ఈమె అపరాధమా ! గుణము మంచిదికాదా ! కోకిలకు రూపములేకపోయినను, దానిశ్రావ్యకంఠమును బట్టే కదా దానిని ప్రపంచము అంతగౌరవించుచున్నది. హృదయసౌందర్యము చూడవలెగాని శరీరసౌందర్యముతో నాకు ప్రసక్తిలేదు. కేవలము సౌందర్యమే యెంచి యిట్టిగుణవతిని, నిరపరాధిని అంధకారమున త్రోసిన ఈమెకు దిక్కెవ్వరు ? నేను యీమెను నిశ్చయముగా ప్రేమించెదను.' అని అనుకొని లీలవైపు చూచెను. లీల యింకాయేడుస్తూనే యుండెను. లీలయొక్క అమాయికత్వమునకు జాలినొంది సాలిగ్రామ దయతో "నువ్వు వ్యర్థముగాయేడ్చుచున్నావు ఆమె అట్లు అనుకుంటే అనుకోనీ. అన్నమాత్రాన అయిపోయిందేమిటి? "

లీల:—అవుతుంది. యెందుకవదు? నేను కురూపిదాన్ని. అనేకమంది పిల్లనిచ్చుటకు సిద్ధముగా యున్నారు.

సాలి:— సిద్ధముగానుంటే పెళ్ళిచేసుకొనుటకు యెవరు సిద్ధముగాయున్నారు?

లీల:— మీఅమ్మగారు మీకు పెళ్ళిచేస్తానంటే మీరు చేసుకోరా ?

సాలి:—లేదు. ఆమెకు బోధపరుస్తాను. నిన్ను యిటువంటిమాట లాడవద్దని, తిరిగి పెళ్లాడనని చెప్తాను. అని లీలను శాంతపరిచి తల్లిదగ్గరకు పోయెను. తల్లిని చూచి "అమ్మా! నీ కోడలును యెందుకు నీవు అట్టి మాటలాడుతావు? " అని ప్రశ్నించెను.

తల్లి:—యేమిటన్నావురా నాయనా !

సాలి:—కురూపిదని నాకు తిరిగి పెళ్ళిచేస్తానంటూ వున్నావట.

తల్లి:—అవును. నీవు అంతచక్కనివాడివి, చదువుకున్నవాడివి, బుద్ధిమంతుడవు. నీకు అట్టిపిల్ల తగదు. గనుక చక్కనిపిల్లను చేస్తాను.

సాలి:— చదువుకున్నవాడిని, బుద్ధిమంతుడను కాబట్టే అటువంటి పాపకార్యము చేయకూడదు. నాకు జబరదస్తీగా పెళ్ళిచేస్తావేమిటి?

తల్లి:—(విస్మయముతో) యేమిటి ! నీవు పెళ్ళి చేసుకోవూ !

సాలి:—యెందుకు చేసుకోవాలి భార్యవుండగా?

తల్లి.—కురూపిగనుక. ఆమెతండ్రి మోసము చేసెను గనుక.

సాలి.—ఆమెదేహసౌందర్యముతో నాకు పని లేదు. బుద్ధివిశేషత హృదయసౌందర్యముపరీక్షించేను. ఆమెతండ్రి చేసినమోసమునకు యేమియుయెరుగని ఆమెనుశిక్షించుట న్యాయముకాదు. "అడవిపందులు చేను మేస్తే వూరపందులచెవులు కోయు"నట్లున్నది.

తల్లి:— బాగుంది! యెలా మారిపోయినావు!

సాలి:—మునుపటిమాదిరిగా దాన్ని నీవు అంటే నేను సహించలేను. వ్యర్థముగా అబలను బాధపెట్టుట

నాకు బాగుగా తోచలేదు. ఒక్కచక్కదనమే మనము చూడవలశినదా? లేక దానిసత్ప్రవర్తనమా? ఒకయేడాదినుండి ఆపిల్ల మనయింట యెట్టి భయభక్తులతో మెలగుచున్నదో కాసంత పరీక్షించవద్దా!

తల్లి:—(మూతి ముణుచుకొని) ఇంకా చక్కనిది అవుతే మరీ పొంగిపోదువు గాబోలు నాయనా! యీ కురూపిదానిని పెట్టుకునే వెనక వేసుకొస్తూయున్నావు.

సాలి:—రూపము భగవంతునిసృష్టి గాని మనం పెట్టుకొన్నది కాదు. నేను వకవేళ కురూపినయితే మరొకసురూపిని పెళ్ళి చేసుకొంటానంటే నాకేలాగు వుంటుంది, నీకేలాగువుంటుంది? గనుక నాఆఖరు నిశ్చయమిదే. అది కురూపి, పెళ్ళి తిరిగి చేస్తానంటే నేను వప్పుకునేది లేదు. నాకు చాలా దుఃఖముగా యుంటుంది. అవమానముకూడాను.

అంతటితో తల్లి మాట్లాడలేదు. మరుచటిదినము లీలను కల్సుకొని సాలగ్రాము యిట్లు ప్రసంగించెను. "యీరోజు నేను అందరిని ముఖ్యముగా మాతల్లి గారిని—నిన్నేమి అనవద్దని, అటువంటిమాటలు వినలేనని చెప్పితిని. ఇక నీయడల వారు అత్యాచారముగా ప్రవర్తించరు."

లీల:—పతినైపుచూచెను. ఆచూపులో ప్రేమ, కృతజ్ఞత యిమిడియున్నవి. అన్నదికదా! 'సత్యముగా మీరు మళ్ళీ పెళ్ళిచేసుకోరా!'

సాలి:—యెందుకూ, కారణం?

లీల:—"నేను రూపవతినిగాకపోవుటచేత"(అని సిగ్గుతో తలవంచుకొనెను)

సాలి:—(ఆమెను దగ్గరకుతీసుకొని ఆలింగనము చేసుకొని ప్రేమపూర్వకముగా తలనిమురుచు) లోకంలోఅందరికీ నీవు కురూపిగా కనబడవచ్చుగాని నామట్టుకు సౌందర్యదేవతవలె నున్నావు. నేను నీ హృదయసౌందర్యమును ప్రేమించేను. హృదయసౌందర్యముముందు ముఖసౌందర్యము యెన్నోవంతు? ముఖసౌందర్యము నాకవసరములేదు.

లీల:—సంతోషముతో భర్తమెడ కౌగలించుకొని "అట్లయితే యెందరు నన్ను కురూపి అనుకొన్న నాకేమిలక్ష్యము? మీదయ వక్కటివుంటే ప్రపంచకము జయిస్తాను. నేను మిమ్మును మనస్ఫూర్తిగా కోరునది అది వక్కటే. ఇన్నిరోజులనుండి నేను పడు మనోవేదన, దుఃఖము నేటితో మంచువలె యెగిరిపోయినవి మీ ప్రేమయేకదా నాకు సామ్రాజ్యము? నేడుమొదలు సంసారములో నావంటి సుఖవంతురాలు లేదనియే తలుస్తాను. (అని పతిపాదములపైబడి ముద్దుపెట్టుకొనెను.)

సాలిగ్రాము లీలప్రేమకు, సత్యకాలమునకు మెచ్చి, లేవనెత్తి, హృదయమున కదిమి, గట్టిగా ముద్దిడి, ఇన్నిరోజులనుండి ఆమెయెడల చేసినఅపచారమునకు క్షమింపమని వేడుకొనెను.

హిందీ 'చాందు'నుండి అనువాదము.

## శబరి

గోటేటి సత్యనారాయణ మూర్తిగారు

చిని(గినవల్కలంబులను జింపిరిజుట్టున నుంటినంచు నీ
మనమున లేశమాత్ర మనుమానము నొందక రమ్ము కానుకన్
గని కరమూని గైకొనుము కాంచనరత్నము లీయలేను దీ
నను నను( గంట( జూడు రఘునాయక ! పాయనిభక్తి మ్రొక్కెదన్.
కాననమంతయున్ దిరిగి కాంచినపండ్లను గోసి మంచివా
వానిని వేరుగా(, గోరికి దాచితి( దియ్యనిపండ్ల నయ్య! యే
పానకమైన(గాని సరిరా దివి పోల్ప(గ( గైకొనంగదే
భానుకులాబ్ధిసోమ ! పరిపంథివినాశనమూలకారణా !
చూడుము మధురఫలంబుల(
జూడుము నన్ గృపనుగొల్చుచూపులతోడన్
జూడుమ యీఫలరుచులను
జూడుము నీరూపులేనిచోటుల నాలోన్.

# సోదరికి

వఝ్ఝల వేంకటేశ్వరకవిగారు బి. ఏ.

క్రమ్మినదేమొ నీహృదయరంగములోని ప్రతాపవహ్నితే
జమ్ములు మాయఁగానివురు; జాడ్యముఁగొన్నవొ శృంఖలాప్రయో
గమ్మున నీస్వతంత్రతలు; కానియెడన్ బురుషప్రయత్నల
భ్యమ్మగు నే దసాధ్యము మహాద్భుతమా భవదీయశక్తికిన్?
రసనాంచలమున సరస్వతీనాట్యమ్ము వెలయింపఁజాలు కవిత్వశక్తి;
కత్తిచేఁబూనినఁ గదనన్నై పుణ్యమ్ముఁ జూపింపనేర్చు ప్రతాపశక్తి;
దేశోపకారైకదీక్షఁగైకొని రాజ్యతంత్రముల్ నడిపించు మంత్రశక్తి;
ఆచారకాలుష్య మడఁగించి సంఘసంస్కారంబుఁ జేయు విజ్ఞానశక్తి;
అఖిలశక్తులు నీహృదయంబునందె యిమిడియున్నవి, మేల్కొల్పు మింకవాని;
నున్నతికిఁ బాటుపడుచున్న సోదరులకు, సోదరీ! తోడుపడుము, చేయూఁతనిమ్ము.
నీనునుఁజూపు సంపదల నీడల విశ్రమ మందకుండినన్,
నీనవహాసచంద్రికలనిర్మలమార్గముఁ గానకుండినన్,
నీనుడితేనియల్ మనసునిండ ముదంబునఁ గ్రోలకుండినన్,
మానవజాతికిన్ విజయమంగళ మెక్కడిదమ్మ సోదరీ!
నీకనుల్ వేడి క్రొన్నిప్పుకల్ రాల్చునా కలుషసంతానంబు కాలిపోదె?
నీచూపు చలువవెన్నెలతేట లీనునా గాఢాంధకారంబు కదలిపోదె?
నీవీక్ష యమృతధారావృష్టిఁ గురియునా విషవృత్తి దూరమై వెడలిపోదె?
నీదృష్టి దుఃఖాశ్రునిచయంబుఁగార్చునా కఠినపాషాణంబు కరఁగిపోదె?
ఎంతకాలంబు గడచెనో యిప్పటికిని నీవు నిదురించుచున్నావు నేఁటికైనఁ
దెలివిఁగాంచుము, నాలుగుదెసలఁ గనుము, సోదరీ తోడుపడుము మాయుద్య
మాహృదయంబులన్నియుఁ గ్రమంబుగ నాశలు సన్నగిల్లఁగా [మముల.
వ్యాహతవాంఛలన్ గలఁత నందినవేళల నీవచస్సుధా
వాహిని మాయధైర్యములఁ బాపి, వినూతన శక్తినిచ్చి, ప్రో
త్సాహముఁగూర్చి సాహసమొసంగి శుభంబిడఁగాదె సోదరీ!
ఆకాశంబునఁ దారలై మెరసి దివ్యప్రేమ సంపూరితా
లోకంబుల్ ప్రసరింపఁజేయుచును గల్గుంగావుతన్ మంగళ
శ్రీకల్యాణము మీకటంచు మధురాశీర్వాదముం బల్కు హిం
దూకాంతామణులన్ దలంచి చను మాత్రోవన్ సదా సోదరీ!

# నారీహితము

విద్వాన్ సూరి గుచ్చి కృష్ణమూర్తిగారు

ప్రస్తుతము దేశమున నొకవిధమగు ననిదంపూర్వకవికాసము గల్గి స్త్రీపురుషులెల్లరు నైకమత్యమున దేశకల్యాణమునకుఁ గడంగుచుండిరని వ్రాయుట కెంతయు సంతోషించుచున్నాను. మున్నులేని మహిళా సమాజము లెన్నియో నెలకొల్పఁబడినవి. మున్నులేని బాలికాపాఠశాల లెన్నియో ప్రభుత్వమువారిచే నేమి ప్రత్యేకనియోజకవర్గవు చేఁగాని నెలకొల్పఁబడి ప్రచాలనమున నున్నవి. అందు విశేషించి హిందూబాలికల సంఖ్యయే యెక్కుడుగనున్నది. కొలఁదిసంవత్సరముల క్రిందట పంచములలోనే విరివిగనున్న విద్యాప్రచారము నాక్షేపించినజాతులవారే విజ్ఞాననయనముల విప్పి తమతమ దుహితృగణమును విద్యాశాలలకు నేఁ డంపుచుండుట భారతాభ్యుదయమును జాటుచున్నది. రాజమహేంద్రవరమున స్త్రీలకుఁ బ్రత్యేకముగ ప్రభుత్వమువారిచే నామోదింపఁబడి విశ్వవిద్యాలయపరీక్షల ప్రకారము విద్యావిధానము నడుపఁబడుచుండెడి సంస్కృతకళాశాలసైతము నెలకొల్పఁబడి సక్రమముగఁ గొనసాగింపఁబడుచున్నది. ఎన్నఁడును గడపదాటి యీవలకువచ్చు నలవాటులేని యాంధ్రమహిళాగణము నేఁడు సుమారములగు పట్టణములయందు సమావేశమగుచుండు మహిళాసమాజములకుఁ బ్రతినిధురాండ్రుగ నేగి యం దధికముగఁ బాల్గొనుచుండుట మనము గనుచున్నాము.

కాని, యెంతటివిరివిగ విద్యాప్రచాలనము దేశమునందు జరుగుచున్నను దీనిని గుఱించి ప్రజల కొక విధమగు నసంతుష్టి లేకపోలేదు. కాక మహిళామణులకు వలయునట్టి విజ్ఞానముగానీ వలసినంత వైదుష్యముగానీ గలుగుచుండుటలేదనుట సత్యదూరము గాదు. ఇట్టి యసంతుష్టికి నిధాన మెయ్యది యనుట మనము మునుముందు విచారింపవలయును.

ప్రస్తుతము ప్రచారములోనున్న పాశ్చాత్యవిద్యాప్రణాళిక ననుసరించి హిందూపాఠశాలలయందు విద్య నుపదేశించుట యెంతయుఁ గూడనిపని. బాలురకుఁ గూడనట్టి విద్యావిధానము పనికిరాదు. కుటుంబపోషణమం దంతగ ధనరూపమగు బాధ్యతలేనిపడఁతుల కట్టివిద్యావిధానము సుంతయుకూడనిది. పాశ్చాత్యవిద్యాప్రణాళిక దాస్యమార్గమును సూచించుననుట యెల్లఱు నెఱిఁగినదే. స్వామి వివేకానందులవారు పాశ్చాత్యసంచారము చేయునపు డొకయుపన్యాసములో "మీవిద్య యెక్కువధనమును వ్యయమొనరించి తక్కువవేతనములపైఁ బనిచేయుబానిసలను సృష్టించు"నని నుడివియున్నారు. ఇందలి సత్యసూక్ష్మమును భారతీయు లెఱుంగకపోరు. ఇట్టిది పురుషులకే కూడదనునపుడు స్త్రీలవిషయమునఁ జెప్ప నేల?

కనుక స్త్రీపురుషులెల్లరు సాధ్యమగునంతత్వరలో నీప్రణాళికను మార్పించుజతనము చేయవలయును. ఊరక పాశ్చాత్యవ్యామోహమునందుటలో నర్థములేదు. నే నొక స్త్రీసంస్కృతకళాశాలను జూచితిని. దానిని నిర్వహించునది విద్యావతియగు నొకవనిత. కాని దానినామముమాత్రము పెద్ద యక్షరములతోఁ దళతళ మెఱయులోహముతో నాంగ్లభాషయందుఁ జెక్కఁబడియున్నది. కేవలము సంస్థలను విమర్శించుటకు నే నీవిషయము నుద్ఘాటించుటలేదు. పరిహాసమునకు నేనిది వ్రాయుచుండుటలేదు. కాని మనవారికున్న పాశ్చాత్యవ్యామోహము నించుక యుదాహరణములతోఁ జూపుటకే వ్రాయుచుంటిని.

పాశ్చాత్యవిద్య నేర్వరాదనియు నాయభిప్రాయముగాదు. సమయమున్నంతదనుక శక్తికొలంది యెల్లవారు నన్నివిద్యలను నేర్చి యందందుఁగల సారవిశేషముల నెఱుంగుట యెంతయు సమంజసము. కాని ముందుగ స్వభాష, స్వదేశశుభము ననునవి చూడవలయును. తనదానిని వదలి మఱియొకదానికై శ్రమపడుట యెంతయు వెంగలితనము.

బాలికాపాఠశాలలయందు భారతీయవీరాంగనలచరితములను, పవిత్రవతులకథలను ముఖ్యముగ నేర్పుచుండవలయును. మానవాదర్శమగుజీవితము నలవడఁజేయవలయును. బాలికాపాఠశాలలయందుఁ బురుషుల కెట్టిప్రవేశమును లేకుండుట మంచిది. సంసారవతులగుస్త్రీల నందుపాధ్యాయినులుగ నియమించరాదు. కేవలము బ్రహ్మచర్యవ్రతావలంబినులైన మహిళామణులును, విధవలగువారు నందుపాధ్యాయినులుగ నుండి స్నానపానభోజనాదివసతు లాయావరణములందే యేర్పాటుగావించుకొని విద్యార్థినులతోఁబాటటనే యుండిపోవలయును. ఇట్టివిధమగు శిక్షావిధానమువల్లనెట్టి విజ్ఞానము, శీలము, కార్యదక్షత గలుగునో యోచింపుఁడు.

దేశసౌభాగ్యవిషయమునఁ బురుషు లెట్టిపాలును గైకొనుచుండిరో స్త్రీలు నైత మట్టిపాలును గైకొనగును. విశేషించి సర్వమానవసౌభ్రాతృత్వము గలిగెడి, యైకమత్యముగలిగెడి, విశ్వకల్యాణమునకుఁ బ్రప్రధమ కారణమైన యంటరానితనమును రూపుమాపుటకు స్త్రీలు ముందంజవేయవలయును. తమతమ గృహములందు నిత్యకృత్యములకై యేర్పఱచుకొనెడి దాసీలను పంచములనే నియమించుటకు స్త్రీలు కంకణము కట్టుకొనవలయును. తమతమ యిండ్లయందుఁగల బావులలో నీరుదోడికొనుటకు పంచముల కనుమతి నీయవలయును. ఈ రెండువిషయములందును పురుషులకంటె స్త్రీలే చేయవలసినభాగ మధికముగఁ గలదు. దీనివలన దేశమునం దంటరానితనము సగము నశించును.

స్త్రీలు తాము సమావేశపఱచుకొనెడి మహిళాసభలయందు హరిజనోద్ధరణవిషయమునఁ గొన్ని తీర్మానములఁ బ్రవేశపెట్టవలయును. ఊరిలో చందాలమూలమునఁ గొంతధనమును బోవుచేసి వనితలచేతనే యూరూరు నిల్లిల్లు దిరిగి యంటరానితనము రూపుమాయునట్టుగఁ బ్రచారముచేయింపవలయును. పురుషులు ప్రచారముచేయుటలోను స్త్రీలు ప్రచారము చేయుటలోను ఫల మొకటియేయైనను స్త్రీ ప్రచారమువ ఫలప్రాప్తి యించుక చేరువలోనుండునని నాయాశయము. ఎండకన్నెరుగని యువిదలుసైత మట్లు సమస్తకష్టములకు నోర్చి యెండనాక వాననాక యింటికిదూరమై ప్రచారముసేయుచో నేమానవునిహృదయము కరుగకయుండును ? ఏపురుషుఁడు తనమాఢ్యాచారమును వీడకుండును. ? ఈ మధ్య నసహాయోద్యమమునందు స్త్రీలు నడుములుబిగించి ముందునకువచ్చి తీవ్రములగుప్రచారములు చేయుచుండుటచేతనేగదా యాయుద్యమ మంతమహోన్నతదశకు వచ్చినది?

ఇపు డూరూర స్త్రీప్రార్థనామందిరములు హెచ్చినవి. స్త్రీలు భక్తియుతలై పలువు రేకముగఁగూడి తమంతటఁదాము భగవన్నామ ముచ్చరించుకొనుచు భజనసేయుచుండుటయో, లేక యేభక్తునేని బిలిపించి హరికథాది కాలక్షేపములఁ జేయించుటయో మనము నేఁడు చూచుచున్నాము. అట్టి ప్రార్థనామందిరములకుఁ బంచములనుసైత మాహ్వానించి వారికిఁగూడఁ దత్తదుపదేశములనిచ్చి వారి మానసమును పరిశుద్ధముచేయవలయును. ఇట్టి విధముగ వనితలందఱును అంటరానితనమును రూపుమాపుజతనము ముఖ్యముగనెంచికొనుచుఁ దద్విషయమునఁ బ్రచారముసేయుచో నైకమత్యము త్వరలోఁ జేకూరును. దాన భారతదేశభాగ్యము త్వరలోఁ గల్గును.

బాలికాపాఠశాలలయందుండెడి గ్రంథాలయములలోని పుస్తకములు మిఖుల నీతిబోధకములును, జ్ఞానోత్పాదకములు నైయుండవలయును. కేవలము సారహీనములును కాలము నతివాహితముచేసెడి కల్పితకథలు గల పుస్తకముల నుంచరాదు. అసభ్యసారస్వతముగల పుస్తకములను బాలికావిద్యాలయములందుంచుట యొక మహాపాపము. అట్టిగ్రంథములుగల బాలికావిద్యాలయములను నేను గొన్నింటిని జూచినాను.

తద్విద్యాలయములలోని యుపాధ్యాయినులుసైతము పాఠ్యపుస్తకములను నిర్ణయించుటలో నెక్కుడు శ్రద్ధ పుచ్చుకొనవలయును. దేశమునందు విజ్ఞానము ప్రబలఁజేసి పుణ్యమార్గమును జూపించెడి యుపాధ్యాయినీ వృత్తి తమపదనుగర్వము ప్రతియుపాధ్యాయినికి నుండవలెను. కాని కేవలము తాము తమయుదరములను బూరించుకొనుటకును, సారహీనమగు సంసారమును బోషించుటకు నిట్టివృత్తి యవలంబించితిమను నసభ్యపుటూహను మనసునుండి పారఁదోలవలయును.

స్త్రీగౌరవము దేశము బాగుగ గుర్తింపవలెను. పూర్వమునందున్న వనితాగౌరవ మెల్లవారు నెఱుంగవలెను. భార్యలేనిచోఁ బురుషుఁ డెట్టిపుణ్యకార్యమును జేయఁదగదు. వివాహాదిపుణ్యకర్మలందగ్నులను ప్రదక్షిణించునవసరమున, యజ్ఞాదులఁజేయు నవసరమున భార్య తనపార్శ్వమున నుండవలెను. ఇది హిందూ ధర్మము. కనుకనే శ్రీరాముఁడు సీతాదేవిని వాల్మీకిపర్ణశాలకుఁ బంపినవెనుక హిరణ్మయసీతాప్రకృతి నొకదానిని సృష్టించి యాగము చేయఁగల్గెనేగాని యంతటి మహానుభావుఁడు దేవదేవుఁడుగూడ నొక్కఁడు నట్టి పుణ్యకార్యము చేయఁగల్గెనా? మన శాస్త్రములు సమ్మతించునా?

కనుక నెల్లవారును మహిళాజాతిని గౌరవించి, విద్యావివేకాదులందు వారికిఁగూడ స్వాతంత్ర్యము నిచ్చి యధఃపతితమైయున్న యాజాతికిఁ దొల్లింటితేజము నీవలయును. స్త్రీలుసైతము యుక్తమగు విజ్ఞానము సంపాదింప యత్నించుచు నుచితరీతిని ప్రవర్తింపుచు దయాశాంతగుణముల నలవరచుకొని దేశకల్యాణమునకై పాటుపడవలయును.

# రహస్యధ

జి. సి. హెచ్. వెంకటేశ్వర్లు గారు

పద్మినీకాంతపైఁటపై బవ్వళించి
స్వాభిమతమును దాఁచు హంసంబుపగిదిఁ
బూని సౌందర్యపారంబుఁ బొందఁగోరి
రాలిపోవును కుసుమంబువ్రాత యేమొ.

పగలు రాత్రులె బ్రతుకంచు భ్రమయు ప్రజల
పెనఁగులాట నిశీథినీప్రియుఁడు గనఁగ
ప్రకృతి చైతన్యరహితమై పరగునపుడు
పొంగిపోయెడి ప్రమదాన తొంగిచూచు

అల జలాశయంబులఁ జాల సప్పుడీయు
సాగరం బేల పొంగదు చదలుదాఁక
సర్వరత్నజిగీషమై గర్వమాఁచి
కొను మహీతలం బేలనో క్రుంగిపోదు.

శిలల గరగించు నీళులచింకవోలె
గారు కన్నీటిని దుముఁగలము గాని
కడుపులోనుండి చీల్చుచు గసటుమ్రింగు
హృదయఘోరదుఃఖాగ్నిని జిదుపగలమె?

ఉదయగిరియందె యాసూర్యుఁ డుదయమంది
అస్తగిరిపొంతనే కాని యణఁగిపోఁడు
నిత్య మాశానిరాశల నిండియుండు
జీవిజీవితం బేలనో చిటిలిపోదు.

కంటకావృతమైనది కనుకనే గు
లాబి పొందె సుమంబుల లలితపదవి
సర్వతోముఖప్రాబల్యసౌఖ్య మున్న
కాఁడు లౌకికజ్ఞాని దుఃఖంబు లేక.

# పంచములు; దేవాలయములు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

ప్రాచ్యప్రతీచీదేశములన్నిటికిని పూజ్యుడైన గాంధీమహాత్ముని ఆదేశానుసారము అస్పృశ్యులకు దేవాలయప్రవేశమొసగుటకు సనాతనవాదులమనువారు తీవ్రప్రతిఘటనలు గావించుచున్నారు. కొందర రనుకూలురైకూడ నున్నారు. సర్వజనసమ్మతమును బడయకయే కొందరు యేమూలలనో ధర్మసభలనుజేసి అస్పృశ్యులకు దేవాలయప్రవేశాదు లొసగకూడదని తీర్మానించి ప్రకటించుచున్నారు. అట్లు వీరు పంచములకు దేవాలయప్రవేశ మొసగరాదని ఘోషించుట మనదేవాయములు మనశాస్త్రచోదితమైన కర్మలననుసరించి పూర్వమువలె నుండినగదా పంచములు ప్రవేశించుటచే దేవాయముయొక్క పవిత్రత జెడుట? పంచములకంటె అథమముగా మనము శౌచాదులు విడిచి భక్తిభావము నశించి ప్రవర్తించుచున్నప్పుడు పంచములు దేవాలయమునకు వచ్చిన తప్పేమి? భక్తిశ్రద్ధలతో ప్రార్థింప నుద్యుక్తులైన పంచములు భక్తితో ప్రార్థనాదులు సలుపుచుండ మనము వారినిచూచి వారివలన భక్తిజ్ఞానముల సంపాదింపవచ్చును.

ఇక మనదేవాయములు మనపూర్వులచే కొన్నిశతాబ్దములక్రిందట మతచిహ్నములుగనో, నిర్గుణోపాసన మొనర్పజాలనివారికనియో, సంసారసాగరమున మనశ్శాంతి లేశమైనను లేక దైవము గలడనుమాటయే మరచి తిరుగు సంసారులు దారిలో బోవుచు దేవాలయమును కాంచినక్షణమైనను దైవము గలడనుబుద్ధి బొడముటకనియో, మరియేకారణములవలననో పవిత్రాంతఃకరణములతో మనచిత్రకళావైశద్యము తేటపడునట్లును నిశ్శబ్దముగనుండి భగవత్ప్రార్థనము జేసుకొనుటకును సర్వజనాకర్షణముగను నిరాడంబరముగను శాశ్వతముగను చారిత్రప్రసిద్ధముగను నుండునట్లు దేవాలయముల నిర్మించిరి. అట్లు కేవలమును నిర్మించి విడిచివేయుటయేగాక తత్సంబంధమైన కార్యక్రమాదులు శాశ్వతముగా జరుగుటకు తగు నుపాధులుగూడ కల్పించిరి. ఇట్టి దేవాయములు పూర్వము విద్యాపీఠములై న్యాయనిర్ణయస్థానములై జ్ఞానబోధకు బుట్టినిండ్లై సర్వజనసమాదరణీయములై విద్వదుపదిష్టములై సర్వజనసుగమములై యుండెడివి. మఱియు నిండ్లకడ దైవప్రార్థనము చేసుకొనుటకు తగుమనస్స్వాస్థ్యము గుదురని జనులు దేవమందిరమునకు బోయినతోడనే గృహచింతల విడిచి యేకాంతముగ భగవధ్యానమగ్నులై యుండునట్లుగూడ నుండెడివి. ఆకాలమున నట్టి దేవాలయములకు కేవలము దేవాలయధర్మమునేగాక జ్ఞానసంపత్తితో సమస్తధర్మములును దెలిసి కాలజ్ఞులై ప్రజలకు ధర్మమును జ్ఞానమును బోధపరచి వారిని సన్మార్గమున ప్రవర్తింపజేయగలవారే ధర్మకర్తలుగా నుండెడివారు. మరియు విద్యల నారితేరి శృతిస్మృతిపురాణేతిహాసాదులు బాగుగాదెలిసికొని ప్రజలకు సకాలములందు దైవప్రార్థనాదులొనర్పు కాలముల నిర్ణయించి వారికి మనమతమునెడ భక్తివిశ్వాసములు గలుగునట్లు వారికి సదుపదేశ

ములుజేయుచు మతమున నెట్టిసందేహముగలిగినను సందేహవిముక్తి జేయుటయందు సామర్థ్యముగలిగి దేశీయు లన్యమతస్వీకారులు కాకుండజేయుచు సర్వజనుల భ్రాతృభావమున జూచుచు విజ్ఞులగువారే దేవతార్చకులుగా నుండెడివారు. వీరలేగాక మొత్తముమీద దేవాలయపుసిబ్బందియంతయు నిట్లే యుండెడిది. (ఇప్పట్టున సుప్రసిద్ధచారిత్రక పరిశోధకులగు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారి 1923 సంవత్సరము మార్చి శారదలోని "హిందూ దేవాలయములు" అను వ్యాసమును జదివిన మనదేవాలయపుపూర్వస్థితి బోధపడగలదు.) ఇప్పుడన్ననో ధర్మకర్తలకడ నివన్నియు మృగ్యములు. వారింటి కింత దేవాలయమునుండి ప్రసాదమేగిన జాలును. తక్కిన విషయములు వారికక్కరలేదు. ఇక తక్కినవారిమాట చెప్పుటకేమున్నది? ప్రసాదమును తనకు పంపని యర్చకుడు దేవాలయముననున్నచో వాడందుండి తొలగవలసియుండును. చదువరియగు అర్చకు డసలుపనికిరా డాధర్మకర్తకు. అందుచేతనే మనము దేవాలయమునకు ప్రార్థనకొరకుబోయిన నందు ప్రార్థనాప్రసంగము వినబడదు సరిగదా ధర్మకర్తమొదలు దాసీపర్యంతము ప్రసాదప్రసంగకలహములే వినబడును. ఇక మనము ప్రార్థనచేసుకొనుట యెక్కడ? ఒకవేళ భక్తిపారవశ్యమున దైవమునకు మ్రొక్కుట కుపక్రమింప నావెంటనే యర్చకుడో లేక దేవాలయపుకింకరుడో వచ్చి దేవునకు డబ్బిమ్మని టొకాయించి గట్టిగా మతిబోవునట్లు కేకలిడుచు నడుగును. అందువలన మనము అక్కడ చేతులు జోడించుటకైనను అవకాశములేదు. ఎందులకు వీరిట్లడుగుదురు? వీరి జీతములు అయిదుమొదలు పదిరూపాయలేయగుటవలన. ఇంకా కొన్ని దేవాలయములకు దర్శనార్థమేగిన టిక్కట్టుకూడ కొనవలెను. సింహాచలమున నీపద్ధతి ప్రస్తుతముగలదు. ఇక్కడి యాచారములు జూచిన పంచములయాచారములకంటె కనిష్ఠముగానుండును. ఇక్కడ ప్రసాదమని అన్నము మొదలగునవి యమ్ముదురు. కొనిన తప్ప చచ్చుచున్నను ఎవరికిగూడ నిసుమంతప్రసాదమైన బెట్టరు. మన మొకకానీ యక్కడిచ్చిన అది సంస్థానమునకు బోవును. నాకొకకానీ యివ్వరా! అని యాచార్యుడు ప్రార్థేయపడి అడుగును. ఇట్టి వనేకములు ప్రతిదేవాలయములోను జరుగుచునేయున్నవి. ఇట్లు ప్రసాదముల నమ్ముకొనమని దైవదర్శనమునకు 'టికెట్' కొనమని యేయాగమనిగమములలో జెప్పబడియున్నదో తెలియరాదు. ఈ యాగమనిగమములు మానవకల్పితములే గాని వేరుగాదు. ఇట్టి దురాచారములకు సనాతను లేమందురో? యేవియో కొన్ని బొమ్మల జూపి పామరుల మోసపుచ్చి ధనమార్జించుచుండుట దివ్యస్థలములలోనే జరుగుచున్నప్పుడు చిల్లరదేవాలయములమాట చెప్పుటకేమున్నది. పాప మీ విషయమున దేవాలయపునౌకర్ల ననవలసినపనిలేదు. వారికి తగినయుపాధి నొసంగిన వారట్లుజేయరు. ఇదంతయు మనముజేయుచున్న పనియేయని తెలిసికొనవలెను. ఇక గ్రామములలోని దేవాలయములు యూరికి కొంతదూరములోను ఊరులోకూడ నున్నవి. ఈ దేవాలయ

ములకు మనవారు పోవునట్లెన్నడును కానరాదు. పట్టణములలోనే బోవనప్పుడు పల్లెలలోని దేవాలయములకు బోవువారెవరు? పూజారిమాత్రము దీపారాధనాదులకు వెడలునట్లు కాననగును. ఆదేవాలయములు అర్చకుడు వెళ్లునప్పుడు తక్క తక్కినవేళల పందులు మొదలగు తిర్యగ్జంతువులకు నివాసములు. పందులు దూరుచున్న దేవాలయమునకు పంచముడు పోయిన తప్పా. పంది చేసినపుణ్యము పంచముడు చేయలేదు.

విజ్ఞులు ఆలోచింపుడు. నాయనలారా! సనాతనవాదులారా! మీరు విధివశాత్తుగానైనా దేవాలయమునకు వెళ్ళినారా? వెళ్లకపోయిన పోనిండు. దేవాలయపుసమాచారములనైనను వినుచున్నారా? మీ రీరెండుపనులను పరిశీలించియుండినచో సనాతనధర్మమును నిప్పటి విధముగా కాపాడుదుమన్నమాట విడిచివేసి పంచములను మీలో జేర్చుకొందురు. మీ రెన్నడైనా దేవాలయమునకు బోయియుండినగదా పంచములు దేవాలయమునకు రాకుండా చేయగలశక్తి మీకుండుటకు? దేవాలయద్వార మెటున్నదో మీకు తెలియనప్పుడు మీరు సనాతనధర్మమును గాపాడగలరా? ఇదంతయు వట్టిడాంబికము. మీకు సనాతనధర్మమునెడగాని, యాధునికధర్మమునెడగాని విశ్వాసమన్నమాటలేదు. మీ చెయ్యి మీదుగానుండిన జాలు. మీరు కిక్కురుమనరు. ఇట్లు నేనున్నదున్నట్లు వ్రాయుచున్నందులకు మన్నింతురుగాక! మొన్ననే యొకదేవాలయమున ఆదేవాలయపు సర్వజన సాధారణసభ జరిగినప్పుడు వారు ప్రకటించిన ఆదాయవ్యయపట్టికలో ఆసభకు వచ్చినవారి కొరకు దేవాలయపుధనమునుండి కొంతపైకమును ప్రసాదములకొరకు ఖర్చుపెట్టినట్లు జూచియున్నాను. ఇట్లు దేవాలయపుధనమును ప్రసాదాదులక్రింద వ్యయపరచుచున్నప్పుడు దేవాలయములు బాగుపడునా? మనమతప్రచారము జరుగునా? మతప్రచారముకొరకు జ్ఞానబోధకొరకు వ్యయపరచవలసిన దేవాలయపుద్రవ్యమును ప్రసాదములకై పెండ్లిండ్లకై వ్యయపరచుచున్నప్పుడు అట్టిదేవాలయపు ధర్మకర్తల నేమనవలెనో బోధపడకున్నది. ఇక దేవాలయపు ఆచారములన్నియు ఆగమములలో జెప్పబడనవియే. ఇట్లనేకవిధములుగా వెలయుచున్న మన దేవాలయములు ప్రార్థనాలయములు గాక ప్రసాదాలయములై వెలయుచున్నవి. ఇందులకనే మహాత్ముడు మనదేవాలయపుసమాచారములు బాగుగా దెలిసినవాడు గావున భక్తివిశ్వాసశూన్యులై ప్రసాదదాసులైన యగ్రజాతులవారు దేవాలయములకు వెళ్లుటకంటె భక్తివిశ్వాసములుగలపంచములు దేవాలయమునకు బోయిన విగ్రహములు తేజోవంతములై చైతన్యముగలిగి ప్రకాశించునని నుడివినాడు. సనాతనధర్మమని, నిత్యకర్మానుష్ఠాననిమగ్నులని లోకమునకు వెరచి బాహ్యకర్మలనుమాత్రము జేయుచు పూర్వాచారపరాయణులగు మీరే దేవాలయమున కొక్కమారైనను వెళ్ళరు. సరిగదా ఆవిగ్రహమునకు నర్చించుట బహునీచముగా తలంతురు. అట్టియెడ పంచములు దేవాలయ

మునకువచ్చిన మీకేల యాబాధ? దేవాలయములయెడ మీకెంతమాత్రమును గౌరవము లేదు. గౌరమున్న యెడల సకాలముల ప్రార్థనాదులకు వెళ్లుదురు. అట్లు నిత్యమును దేవాలయమునకు నియతిగా ప్రార్థనకొరకు వెళ్లుచున్నచో మనదేవాలయములు మహోన్నత దశ నందియుండును. అట్లు దినదినమును జేయు నియతప్రార్థనమువలన సర్వ సమ దృష్టి కలుగును. అప్పు డందరిని సమానముగ జూతురు. అందువలన పంచములు అగ్రజాతులు అన్న భేదము నశించిపోవును. అట్లు సర్వసమదృష్టి పూర్వమునుండియు యున్నచో మనవా రితరమతముల స్వీకరించియుండరు. మీరు కేవలమును స్వార్థపరులై పంచముల న్మీరు వెడలగొట్టితిరి. దేవాలయములుకూడ మీదృష్టికి నీచములయినవి. మీరు సనాతనధర్మ మందురేగాని సనాతనధర్మమేదియో మీకు దెలియదు. సనాతనధర్మవాది మహాత్ము డొక్కడే. కావున వాదోపవాదములు విడిచి మీ రూరుకొనుట మేలు. మనదేవాలయ ములు అందలికార్యములు అందలియాచారములు ఆగమశాస్త్రమునకు విరుద్ధముగానున్న మాట లోకవిదితము. ఇప్పు డన్నికర్మలును శాస్త్రవిరుద్ధములుగానేయున్నవి. శాస్త్ర విరుద్ధమైనవి యాపద్ధర్మములందురు కాబోలును. కానిందు పంచముల నిప్పుడుకాదు, యెప్పుడును దేవాలయమునకు రానిచ్చుట ఆపద్ధర్మమే యనుకొని వారికి దేవాలయ ప్రవేశ మొసంగుదురుగాక.

అది యట్లుండ, నిక వారికి శుభ్రతలు లేనికారణమున దేవాలయప్రవేశాదులు వీలు గాదని మరియొకనేరమును వారిపయి నారోపించుచున్నారు. కాని అది సరికాదు. శుచి త్వములేని బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, కుష్ఠురోగులు మొదలగు వారనేకులు దేవాలయమునకు వచ్చి గర్భాలయమువరకును పోవుచునేయున్నారు. వీరలేగాక మన మస్పృశ్యులుగా భావించు మహమ్మదీయులను, క్రైస్తవులను, మతాంతరులను మనము తరచుగ సహపంక్తివిందులకే పిలిచి యాదరించుచున్నాము. మనమతమునిన నసహ్యించు కొనువారినే యాదరించుచున్నప్పుడు మనమతస్థులును, మన సంఘములోనివారును, మన జీవనోపాధికొరకు, మనమతముకొరకు, మనశ్రేయస్సుకొరకు వారి కాయకష్టమునేగాక తుదకు ప్రాణముకూడ నర్పించుచున్న పంచములను వెలిగానుంచి వారికష్టములకు తోడ్పడక వారిని సంఘములో దిరుగనియ్యక అణగద్రొక్కుట సిగ్గుగ దోచుటలేదా? కనుక "కలౌసంఘే శక్తిః" అనుమాట జ్ఞప్తినిడుకొని దేశకాలానుగుణ్యముల గుర్తెరిగి తొలుత వారి కట్టిపరతు లను నేర్పరుపక సంఘములో జేర్చుకొనుట యుత్తమమార్గము. అట్లుకాకున్నచో మహా త్ముడు వారి కుపదేశించిన శుచిత్వాదినిబంధనలకులోంగి తొలుత వారికి దేవాలయపు ప్రవేశ మొసగి వారి యభివృద్ధికి తోడ్పడిన యుభయతారకముగ నుండుటయేగాక దేశాభివృద్ధికి ప్రథమసోపానమై వెలయును.

# వెలమవీరుఁడు

ఓలేటి సీతారామమూర్తిగారు

[వెలమవీరుఁడు పాపారాయఁడు రాజాముకోటయందుఁ గాచియున్నాఁడు. దారుణ ప్రళయకోలాహలము నించిన బొబ్బిలిసంఘమరణమందు రంగరాయాదిపద్మనాయకులు వీరశయన మలంకరించుటయు, మల్లమాంబాదిమానవతులు మానరక్షణార్థము తమకు తామై పొడుచుకొని మరణించుటయు నాదిగాఁగల విషాదవృత్త మాతనికిఁ దెలియవచ్చెను. అప్పటి యాతని వీరహృదయోద్గతములగు భావములు.]

కడకంటివీక్షణకాంతిరేఖిక లిప్తకాలంబు బఱపి తన్గాంచువారి
స్వీయకార్యార్థులై వెడలుచు తనమట్టి యనిలభంగము తాకునట్టివారి
బరకటాక్షనిశాతభల్లంబు తనకీర్తి నరవిచ్చుకలనైన నరయువారి
విజయానిలధ్వానవిక్షేపమగు తన్ను నల్లన స్పృశియించునట్టివారి
నసమహర్షసుధారసప్రహ్లాదవిలాససంతతోత్తుంగగౌరవసంభృతోద్ధ
తామలస్ఫుటస్వాతంత్ర్యయావహృదయకలితుల నొనర్చు వీరబొబ్బిలిపురంబు !
శుంభన్మనోహరశుభవసంతునిరాక రక్తినించెడు వనలక్ష్మివోలె
అమృతచంద్రిక చల్లనగుచూపులను వెల్గి సాగియుచుండు తరంగసుదతికరణి
లేతనవ్వుల గుబాళింపు చందురుపూతకాంతిలో విరికల్వకన్నె పగిది
బాలభానుని కావిపరువంపు బంధూకరుచులలో వికచసరోజమట్లు
రంగరాయాదివీరవర్గంబుఁ గాంచి నిత్యపులకితగాత్రసందీప్తితోడ
రమణ హసియించు బొబ్బిలిరాజ్యలక్ష్మి కట్టిదుర్గతి లభియించె; నెటు సహింతు ?
అక్కట ! మొక్కవోవని హృదంతరభూరిపరాక్రమోద్ధతిన్
జక్కని పేరు దాల్చియు రణంబున బొబ్బిలి నేఁడు క్రుంగెపో !
నిక్కము తాండ్రపాపయ గణించును గెల్పు నుదగ్రమూర్తియై
దక్కను మానగౌరవనిధానము వెల్మకులోద్భవాళికిన్.
ఆనందంబున నైక్యమై హృదయవిన్యాసార్ద్రిసత్పౌరుష
శ్రీనిత్యోద్భవభావసంచయముతో సిందూరరాగాక్షిదృ
క్కోణస్ఫూర్తిని రంగరాయనృపుఁ డాఘోరాజిలోఁ బోరి తా
పౌనఃపున్యపవిత్రకీర్తియుతుఁడై భాసిల్లె ధైర్యోద్ధతిన్.

బొబ్బిలి నితాంతకదనోగ్రభూమియందు
వెల్లువయి పారు మావెల్మవీరవరుల
బహుళరక్తంపుజాడలు పాడువడినను
పృథులవీరగంధము గుబాళింపఁగలదు,
భయమెఱుంగని రంగభూపాలు హృదయ
ఘుసృణకిసలయరాగార్ద్రిమసృణరుధిర
పూరమునఁ దోఁగు బొబ్బిలిపుణ్యభూమి
ప్రణుతవిక్రమగీతాళి పాడుకొనును.

"మానమె మామకీనవపమండనమై భువనార్ద్రిహృద్యస
న్మానితమై, గుణప్రతతి మానుగ మిన్నయి, కీర్తిదేవతా
హ్వానమునై నిరంతరము భాసిలు మానములేని చానకున్
జ్ఞానవిలాసమేమిటికి, సంపదలేటికి, ప్రాణమేటికిన్?"

అనుచు నిశాతహేతిఁ గొని యాహవభూమిఁ జరించు భర్తకున్
మునుమున యాంతరంగమునఁ బూజలొనర్చి కడింది కత్తిపో
టున సురలోకసౌఖ్యము పటుస్ఫుటకీర్తివిలాసమూర్తియై
గొనఁ బయనించె మల్లమ యకుంఠితమానవతీలలామయై.

తనమవ్వములు కాంచి తానె మురిసెడు ముగ్ధసూనకోమలియందుఁ దేనెచుక్క
తొలిప్రొద్దుచాయలోఁ దులలేనికోయిల తొలుకాడుపాటలో చలువఁదనము
నింగిమబ్బులయందుఁ దొంగిచూచి హసించు విమలచంద్రికయందు నమృతరసము
మురువీను కెరటాల పరువులు దొరకొను సెలయేటిగర్భాన లలితగీతి

పదిలపఱచిన పావనప్రకృతిమాత
పద్మనాయకకోమలీభవ్యహృదయ
వాటికను మానపరిమళప్రథితకలిత
మారుతము వీవఁజేయు ననారతమ్ము.

వినుతకృత్యచరిత్రుఁడై మననివాని నామ మది ఫలరహితమై నవసికొనుచు
కాలభీకరగర్భాంధకారసీమ శిథిలమైపోయి విస్మృతిపథినడంగు
క్రమపౌరుషకోష్ణరక్తంబు హృదిని దందడింపంగ వీరకృత్యం బొనర్చి
యమలజీవియై మహనీయుఁడైనవాఁడు శాశ్వతంబుగ సద్యశోసాంద్రుఁ డగును.

ఈ క్షుధాఘోషణోజ్జితపృథివియందు శేముషీలేశరహితుఁడై స్థిరనితాంత
సత్కృతు లొనర్పఁజాలని జడనరుండు సాంద్రగహనను మవ్యర్థజన్ముఁ డగును.
హేయకాయప్రవర్ధనకృత్యములను ప్రబలమూర్ఖతమిస్రదివాంధ మగుచు
సిలుగునొందుచు కీర్తివర్జించుకొను నభాగ్యునిసమాధి నింద్యమై పాడువడును.

ఎదఁ జలింపక వైరినిష్కృపకృపాణధారలకు వెనుదీయ కొదలల నొగ్గి
కడఁక మావెల్మవీరులు కదనసీమ లలితశేముషీకవచకలాపులైరి.
వెలమయోధుల విక్రమవినుతచిహ్నసమితి భూరికాలాయతి సమయుగాని
విశ్రుతతదీయవృత్తముల్ వినినయపుడు భరతపుత్రులు గగ్గురుపాటు గొనరె?

మబ్బుల నీలపున్ దెరలమాటునఁ జిక్కిన వేళ దీప్తులన్
జొబ్బిలఁజేయు భాస్కరుఁ డనూననిజప్రభఁ జూపలేఁడు; మా
బొబ్బిలిరాజ్యలక్ష్మియుఁ బ్రమోదపటుస్ఫుటవిక్రమంబు పె
ల్లుబ్బియు దిర్విపాకమున నోటమిదాల్చి యడంగె హృద్వ్యథన్.
కాలము మార్పుపొందినది; గార్దభనాయకుబొబ్బరింతయే
పాలితశౌర్యలక్ష్మి హరిఁ బర్వఁగ జేసెడు; పద్మనాయకుల్

కీలితవిక్రమోన్నతులు క్రిందయిపోయిరి; ధర్మమార్గ మా
మూలముగా కటా! విడిచెపో! జయలక్ష్మికి స్థైర్యమున్న దే?
కాయ మశాశ్వతంబని ప్రకామవిహారము సల్పి కంటికెం
జాయలచాలుతో హృదయసంభృతశౌర్యమరీచితోడ స్వే
చ్ఛాయతవృత్తి సంగరమునందు వెలార్చెడు వెల్మపౌరుషా
ప్యాయనరీతు లాంధ్రజను లౌదలలూచుచు మెచ్చుకుందురా?

మాసిపోవునె సుధాహాసమోహనసితస్ఫూర్తి యాంధ్రులయశోమూర్తి యింక?
పంచబంగాళమై పరువమ్ము వీడునే తుందుడుకొందు యాంధ్రులజయేచ్ఛ?
సమసిపోవునె లోకసంస్తవనీయనిస్తంద్రహాసిని యాంధ్రశౌర్యలక్ష్మి?
వాడిపోవునె యింకఁ బోడిమి నిడు నైగనిగ్యాల యాంధ్రసౌభాగ్యసుమము?

అకట! కౌముదీదివ్యశోభాతిశయవి
లాససంపన్నయా నాంధ్రరాజ్యరమణి
హృదయభేదనకర దైన్యవృత్తితోడ
నింత హైన్యమ్ము నెట్లు భరింప నేర్చు?

తలఁచిన నాదుగుండె శతధా శకలంబులుగా కవోష్ణతుం
దిలపరితాపబాష్పతతి తేఁకువ దప్పఁగ దూటుచుండెఁ గ
న్నుల; ననుకంప దేహమున నూల్కొనుచుండె, మహోగ్రకోపవి
శ్చలనవవహ్నికీలములు జాల్కొని నాయెద దందడించెడున్.
ఈనడిరేయి చుక్కవెలుగేని హసింపని ధ్వాంతవీథిలో
మానరహోవకుంఠనసమాశ్రితమైన యొడందతోడ వి
న్నాణపువిచ్చుకత్తిఁ గొని నైపుణిఁ జొచ్చెద నుప్తవైరిసే
నానివహంబు; ఆ విజయు న్యక్కృతిఁ జెందెద చండమూర్తినై.

అత్తరంబున విజయరామావనీశు
శోణితము గ్రోలి నిశ్శంకనూని యవల
తాండ్రపాపయవీరరక్తంబు గొనుమ
ఓనిశాతకపాణమా! ఓటుపడక.

# నిద్ర

కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు

ఎల్లజగమును మనసున బల్లవింప
కిరణతతిచేత నమృతంబు గురిపి గురిపి
కాలవశమున నస్త్రాద్రికనుమలందు
చూచుచుండగ రేఱేడు సురిగిపోయె
కారుచీకట్లు నలుగడ గ్రమ్ముకొనియె
మలయపవనాల సందడి మాటుమడిగె
విపులమైనట్టి యాకాశవీథిలోన
మిణుకుమిణుకని తారకల్ మెఱయుచుండె

ప్రకృతియంతయు శాంతమై బరిణమించె
అపుడు పచ్చనిబయలులో హాయిగాను
విమలగీతిని బాడంగ వీణదీసి
కంఠమెత్తంగ మన సెంతొ కలగిపోయె
పులకసంతతి మేనెల్ల మొలకలెత్తె
కంట బాష్పాలు జొటజొట కారజొచ్చె
వీణెతంతుల నాదంబు విరసమయ్యె
గాఢనిద్రయు నన్నంత గాగలించె.

# మమైక దైవ సంప్రార్థనము

కవికొండల వేంకటరావుగారు బి.ఏ.బి.యల్.

సూర్యభగవానుభంగి సన్ జూడనిచ్చి
కృషినిఁ జేయించు నాచేత ధృతిమెయిఁ బ్రభు!
అల్ల ధ్రువసునక్షత్రంపుటధ్వమట్లు
నాదుదారి తప్పనిది తిన్ననిది కూర్చు;
అస్తమించు చందురుభంగి నతిరహస్య
మతి నిరాడంబరమగు విశ్రాంతిఁ దేల్చు;
దేవ! నీదు దయారస మానిశాఖ
మాసమధ్యాహ్నవర్షంబుమాడ్కి నన్ను
నిరతమునుఁ జల్లఁ దడుపఁగ వరమొసంగు.

గగురుంబాటున నిల్చు వెండ్రుకలు
తీగల్గాఁగ స్వేచ్ఛా ద్రుటిక్
వగలం గారెడు బాష్పమౌక్తికము
లంతస్థాయికిన్ బూసలై
సొగసుం దేల్చఁగ నాశరీర మిది
నీ చోద్యాలకుం దంబురై
నిగమానంద సువేద్య మ్రోగునది
మన్నింపంగఁ జెల్లున్ శ్రుతిన్.

దూరమునకు దూరంబు నుందువు ముకుంద!
చేరగడకుఁ జేరికవయి సేవగొందు
పట్టి నినుఁ జేరి సేవ నే ముట్టిసేతుఁ
జూపుసారింతు దిక్కులు ప్రాపులుగను.

సంతోషాశ్రులు మంచుగా గురిసి
నాచక్షుల్ ప్రవర్షించుఁ బో
చింతాబాష్పములన్ మహోష్ణముగ
నీచే నైనచో రెంటినిన్
శాంతిన్ దాంతిని గూడఁగట్టుకొని
విశ్వాప్తా! భవద్బింబమున్
నుంతేఁ జూచుకొ! చూడలేను నిను
నాచూడ్కుల్ శతార్ధ్రింబులై

కోటీందుల్ రవికోట్లు లింకను నుతుల్
గోటానకోట్లూరకే
చేటన్ జల్లెడ నెత్తి పోసినటు
నీచే దిర్దిరన్ దిర్గుచున్
నీటంగూలుట నేర్తుఁగాక భవ!
వందేత్వాం భజేత్వాం ననున్
నాటం బోదొకనాటికాంతియును
నీనవ్య ప్రభారంభునిన్.

నీలో లేనిది లేదుగా బయట
నిన్నిర్మాణమం దన్నియున్
నీలోనే లయమందుగాఁ దుదకుఁ
బానీయంబులన్, బృథ్వినిన్,
గాలిన్, నిప్పును, నాకసంబును
మహాకారాలతోఁ జూపుచున్
లీలన్ మాయముసేయుచుందు, నిను
గుర్తింపంగ రా దాకృతిన్.

జలధికల్లోలముచ్చలమౌ తరంగంబు
జలధిలోనే శాంతి సమయుఁ దిరిగి
భూమి లేచినమొక్కఁ బొడమినచిగురాకు
కారాకుగా మాఱి ధారుణిఁ బడు
ఆకాశమున రిక్క నవఘుల్లించినకళ
యాకాశమున దిక్కు లరసి క్రుంకు
దారపుత్రాదులఁ దగిలిన మమకార
మవ్వారి కొఱకగు నాత్మ నిముడు
నీవె నిత్యుఁడ వజనుత! నీవె చూడ
నుందు వెవ్వేళ నచ్యుత! నీ కడుపున
నీకు నెఱుపలఁ బుట్టిన నిఖిలవస్తు
నిచయము నశింప నేమాదు మిగులు దేవ!

చూతున్ నిన్ను మహాసముద్రముల
పెన్నీరింకి పోనిమ్ము, ఖ
ద్యోతుల్ చంద్రపయోధరాదులును
నుద్ధూతాలు గానిమ్ము భూ
పాతాళాదిసమస్తలోకముల
దీపాలారిపోనిమ్ము మ
చ్చేతోమోదము నిన్ను శేషశయనా!
శ్రీభాతినొప్పారెడిన్.

వందన మాదిదేవ! నతి వాసవవంద్య!
జోహారు సచ్చిదా
నందుఁడ! సత్ప్రణామము ఘనాఘన
శీతలవత్సలాఢ్య! మ
ధ్యందినభానుతేజుఁడ! నమస్కృతి!
దండము నిశ్చలుండ! ని
స్పందకటాక్ష! యంజలి తపఃప్రతిభుండ!
నమో! నమో! నమో!

## ఫాల్గునికము

హరి రాధాకృష్ణమూర్తి గారు

కని ముదమారఁ బెంచిన వికాసము కాలకిరాతుచే వినా
శన మొనరింపగాఁబడ నశాంతిని ఘూర్ణిలు భూతపంచకం
బును విలపింప నొప్పదని పుణ్యసమాశ్రితమా వసంతశో
భను దరిఁజేర్పగాఁ దలచు ఫాల్గునికమ్మ! శుభంబు నీకగున్

తన యనుయాయు లెంతయుముదంబున నిండ్లనె ప్రొద్దుపుచ్చగా
పనివిను కర్షకుం డొగి నవశ్యము దారసుతాదులం బ్రియం
బున బచరించుచున్ భవునిపూజ్యతరాశ్వము గేరు దుక్కిటె
ద్దును వెనుఁదట్టుప్రొద్దు లివి తోచునె యేయెడనైన మాసమా!

పవళుల నెన్నియో నెలలపాటునఁ గాళ్ళ కురుల్ దిగంగఁ గ
ట్టువడిన గోగణంబులు కడున్ ముదమొంది చరించుగాదె యు
త్సవముఁ దలంచుచుం భృధులతైర్థికభావము లంకురింప నీ
ప్రవిమలమైన సద్యశము రావముతో డలగించి మాసమా!

అన్నెముపున్నె మేమెఱుగనట్టిరుకన్నియలం గరంబున
భ్యున్నతి గోరకే పితరు లొక్కనిసుంగున కిచ్చి వారి సౌ
ఖ్యోన్నతికెల్ల స్వస్తినిడ నూరక చూచుచునున్న దాన చే
మన్నను నిన్ను జెల్లదొ ప్రియంబులు శ్రేయములన్న నిట్టివే?

చైత్రమాసాదులనెడి శీర్షంబులొప్ప,
షష్టిహాయనములపేర్ల సంచరించి
సర్వశుభముల మాకు నొసంగునట్టి
కాలమా! నీకు మా నమస్కారశతము.

# పశ్చాత్తాపము

జంధ్యాల జానకిరామశర్మగారు

౧

మోహనరావు తనగదిలో విచారముతో కూర్చొనియుండెను. సమీపముననున్న బల్లపై నాఁటి యుదయమున వచ్చిన టపాలు పడియుండెను. మాటిమాటికి నా లేఖల నిటునటు త్రిప్పుచుండెను. తాను నిరీక్షించియుండిన యుత్తరము మాత్రము కనుపించలేదు. ఒకప్పు డేమియుఁ దోఁచక యిటునటు గదిలోఁ దిరుగును, మఱొకప్పుడు వీధిలోనికి పోయి యెవరిరాకనో నిరీక్షించును, నిరాశుఁడై మరల గదిలోనికి ప్రవేశించును, నిట్టూర్చుచు కుర్చీపైనఁ గూరుచొనును. ఎన్నియోపర్యాయము లిట్లు జరిగెను. కొంతవడికి తపాలు బంట్రోతు వచ్చి "బాబూ! ఉత్తరము వచ్చినది." అనెను. మోహనరావు వెంటనే యాతురతతో వెళ్లి యుత్తరము తీసికొని విప్పిచూచెను. ఆతనియానందమున కంతులేదు. తాను నిరీక్షించుచుండిన యుత్తరమే! లేఖఁ జదివి దీర్ఘనిశ్వాసము విడిచెను. సీత్కార మొనర్చెను. "నేనెంత దుఃఖపడుచున్నానో దాని కేమి తెలియును? మొదట మాటయిచ్చి యిపుడు మరలించుకొనుచున్నది, నాకు గలుగు లోకనిందకై వెఱవవలదని యెన్నియోసార్లు చెప్పితిని. లోకులు కాకులు, నోటికివచ్చినట్లు ప్రేలుచుందురు. పరుల దోషము లెన్నుచుండుటయే వారిపని. లోకులకు వెఱచినచో లోకమున జీవించుటయే కష్టము. కాని, కమలా! నన్నేల నిరసించెదవు? ఇంతవఱకు నీయాశ బెట్టుకొని దినములు గడపుచున్నాను. ఇఁకమీఁద నీవులేక బ్రదుకజాలను. నీవు లేని జీవనము తావి లేని పూవు, వెన్నెల లేని రేయి, జలము లేని కొలను. వెంకి యుండఁగా నన్ను బెండ్లాడుట కిష్టపడవో? జననిందకు జంకుచున్నావా? అట్లైన నిదిగో! దానికిఁ దగుప్రయత్నమంతయు నేఁడే చేసెదను. నీకొఱకు నాసర్వస్వము ధారవోసెదను. ఎట్టిపాపమునకైన నొడిఁగట్టెదను. కాని నిన్ను మాత్రము వదలఁజాలను." అనుకొనుచు మోహనరా విల్లువిడచి విహారమునకు బయలుదేరెను.

౨

మోహనరావు విదేశములయందు బారిష్టరీపరీక్షయం దుత్తీర్ణుఁడై యిచటికివచ్చి రెండుసంవత్సరము లాయెను. తండ్రి యిచ్చినధనము కొంత యిక్కడ, కొంత విదేశములలో వెచ్చించెను. ఇఁక మిగిలియున్న దొకమేడమాత్రమే! కావున న్యాయవాదవృత్తివలన వచ్చునదితప్ప వేఱు రాఁబడి లే దాతని కిప్పుడు.

బాల్యమునుంచి మోహనరావు పాశ్చాత్యనాగరికతాప్రియుఁడు. మఱియు నింగ్లండు వెళ్లివచ్చిన పిమ్మట నిఁకఁ జెప్పవలసినదే లేదు. చిన్నతనములో నింగ్లండుదేశమునుగుఱించి యిక్కడ వినుచుండిన విషయములన్నియుఁ బ్రత్యక్షముగాఁ జూచివచ్చినవాఁడు. వస్త్రధారణమంతయుఁ బాశ్చాత్యపద్ధతియే. వేయేల? అందరు తనను బాశ్చాత్యుఁడని తలఁచుట కెన్నిమార్గము లవలంబింపవలెనో యాతఁ డొకటియుఁ గొఱతలేక యవలంబించెను.

మోహనరావుకు పదునాల్గవయేట వెంకమ్మతో వివాహమాయెను. వెంకమ్మ కొంతసౌందర్యవతియే. ఆంధ్రభాషావైదుష్యము గలదు. గృహనిర్వహణమునందు మంచినేర్పు గలదు. కాని మోహనరావు దృష్టిలో నామె యొకపల్లెటూరిగొడ్డు. ఆమెవేషము జూచి యాతఁ డెప్పు డసహ్యపడుచుండును. నడిమి పాపిట, నొసటఁ బెద్దకుంకుమబొట్టు, అన్నిటినిమించినయమాయికత్వము, పూర్వకాలపుఁ బేరు, ఇంగ్లీషురాని

# LODHRA
FOR
# LADIES'
TROUBLES & DISORDERS.

లోధ్ర

స్త్రీల ఋతుదోషాది రోగములకు

LODHRA PRESS, MADRAS.

నగలనిర్మాణమున సిద్ధహస్తులు




సురాజ్‌మల్ లల్లూభాయ్ అండుకో

రాళ్ళవర్తకులు, నగలవ్యాపారులు, బంగారు, వెండి వస్తునిర్మాతలు

313, ఎస్ప్లనేడ్, మద్రాసు.

ల్లోపము, ఇవియున్నియుఁ నామెయెడ నాతనికిగల విముఖతకుఁ గారణములు. తానొక నవనాగరికురాలికి భర్తయైయుండవలెనని యాతనికోరిక.

మోహనరావొకనాఁడు నాటకమునకు వెళ్లి యచ్చోటికే వచ్చియుండిన కమలయను నిరువదేండ్ల ఆధునిక నాగరికతావలంబినియగు యువతిని జూచి, మోహించెను. ఎట్లట్లో యామె మైత్రి సంపాదించెను. చివఱ కొకరినొకరు జూచికొనక త్రుటికాలమైన నెడబాసియుండఁజాలనంతటిచెలిమి యేర్పడెను. ఆచెలిమి వృద్ధియై యిద్దఱును వివాహమాడునట్టి స్థితికిఁ బరిణమించెను.

మోహనుడు వివాహితుడనియు, నతనికొక పుత్రుఁడుగూడఁ గలఁడనియు కాలక్రమమున గమలకుఁ దెలిసి మిగుల వగచెను. సపత్నీకుని బెండ్లియాడిన లోకనింద యటుండఁ దనకుమాత్ర మేమిలాభమని యెంచి వెంకమ్మ జీవించియుండఁగా మరల తానొకర్తె యాతని పెండ్లియాడిన ప్రజానిందకుఁ బాలుగావలసివచ్చు ననియు, నామె జీవితకాలములో నది యసంభవమనియు మోహనునకు దెలిపెను. మోహనుఁ డామె ననేక విధముల బుజ్జగించెను. కాని యుపయోగము లేకపోయినందునఁ దనమార్గమును నిష్కంటక మొనర్ప నిశ్చయించికొనెను.

## 3

వెంకమ్మ కాపురమునకువచ్చి కొన్నిసంవత్సరములాయెను. మోహనునకు దారావాత్సల్యము శూన్యము. అతఁ డామెయెడ నెల్లప్పుడు దోషములే వెదకుచుండెను. మిడుమిక్కిలి విదేశమునుండి వచ్చి కమలాసంసర్గము లభించినప్పటినుండియు భార్య కూర్చొనినఁదప్పు లేచినఁదప్పు. క్షణక్షణ మామెపైఁ గ్రోధ వీక్షణముల బఱపును. పాపము! వెంకమ్మస్థితి దినదినమునకు విషమించుచుండెను. ఆమెకు ధైర్యము చెప్పువా రెవ్వరును లేరు. రేయింబవళ్ళు విలపించుచుండును. ఒక్కొకప్పు డాత్మహత్య జేసికొనఁగోరును. పుత్రవ్యామోహ మామె నాయకార్యకరణమునుండి నిషేధించుచుండెను.

ఈచింతతోనే యామె నాలుగైదురోజులనుండి మంచము పట్టెను. ఆమెను విచారించి మందు మాఁకు లిచ్చువా రొకరును లేరు. అసహాయురాలై మంచములోనే బాధపడుచుండెను. అయిదుదినములు గడచెను. నేఁ డామె భర్తతో మాట్లాడ నిశ్చయించుకొనెను.

రాత్రి తొమ్మిదిగంటలైనవి. వెంకమ్మ మంచములో పడియుండి తనదౌర్భాగ్యమును దలఁచుకొని యేడ్చుచుండెను. కుఱ్ఱవాఁడు ప్రక్కననే నిద్రించుచుండెను. ఇంతలో మోహనరావు వాగదిలోనికి వచ్చి "ఇదిగో! ఈమందు తీసికో, ఎంతసేపటినుండియో వైద్యునివద్ద కూర్చొనియుండఁగా నిప్పుడు మందిచ్చి నాడు." అని పలికి యామె యేమియో చెప్పఁబోయిన వినక మందుగ్లాసు నచటఁ బెట్టి వెళ్లిపోయెను.

అమాయకురాలగు వెంకమ్మ నిశ్చేష్టయాయెను. భర్తతో మాట్లాడఁదలఁచెను. కాని యాతఁడు వినిపించుకొనక వెడలిపోయెను. మందు చూడఁగనే యామె కాశ్చర్యము గలిగెను. కాని యిట్లనుకొనెను. "వారికిమాత్రము వ్యక్తిత్వము లేదా? నా స్థితికి జాలిగొని మందు తెచ్చినారు. మనస్సులో నన్ను ప్రేమించుచునే యుందురు. కాని నామంచికొఱకే నన్ను కసరుచున్నారు. నేనే మూర్ఖురాలను. నేనే ఇంగ్లీషు చదివియున్నట్లయితే.................

గడియారము పదకొండుగంటలు కొట్టెను. ఆమెతల తిరుగుచుండెను, హృదయము కొట్టుకొను చుండెను, కడుపులో సహింపరానిబాధ కలిగెను, కన్నులయెదుట చీకటి గ్రమ్మెను. మందులోనివిమర మామె గ్రహించినది. బాలునిఁ జూచి పలవింపసాగినది. తనముద్దుతల్లి తన్ను విడిచి పోనున్నదని యెఱుఁగఁడు గదా బాలుఁడు! వాఁడు గాఢనిద్రలో నుండెను.

వెంకమ్మహృదయము వేఁగుచుండెను. మృత్యుకాలము సమీపించినదని తెలిసికొని భర్తను పిలిచినది. అతఁడొకయపరాధివలె వచ్చి యేమియుఁ బలుకజాలక కుర్చీమీఁద కూర్చొనెను. వెంకమ్మ వికవికనవ్వి "నేను మిమ్ముఁ బాసి పోవుచున్నాను. ఇది నాకును సంతసమే. మీసౌఖ్యముకొఱకే నాప్రాణములు పోవుచున్నవి. నాయాత్మకు శాంతి లభించున ట్లాశీర్వదింపుఁడు" అని పలికి కుమారునివైపు జూచి "వీనిని మఱవకుఁడు. సాధ్యమైనంతవఱకు వీని కేవంత గలుగకుండఁ గాపా..." అని చెప్పునప్పటి కామె స్వరము మాఁగిపోయెను. కండ్లు తిరిగిపోయెను. అట్టిస్థితిలోఁగూడ నామె భర్తృపాదములు స్పృశింపఁ గోరినది!!

౪

మూఁడు నెలలు గడచినవి. మోహనుఁడు కమలను వివాహమాడెను. ఇల్లంతయు పాశ్చాత్యనాగరికతాపూర్ణమైపోయెను. షికారువెళ్లుట కొకమోటారుకారు, బొంబాయి కలకత్తాలలోని సంగీతము వినుట కొక రేడియోమిషను తెప్పింపఁబడినవి. ఇల్లంతయు దాసదాసీజనంబులతో నిండిపోయినది. ఏల యందురా? కమల నవనాగరికతాశిఖర మధిష్ఠించినయువతి. అదియునుగాక యున్నతవిద్య బడసినది. పాశ్చాత్యనాగరికతావాయుమండలమునఁ బెంపఁబడినయామె కున్నతపదాధికారులగు స్త్రీపురుషులపరిచయ మున్నది. ఇంటిపనులు చేసికొనుటయు నామెకు గౌరవభంగమే. సామాన్యకార్యము లొనర్చుకొనుటకైన నామెకుఁ దీరిక యేదీ? ఒకప్పుడు మిత్రులకు విందులు చేయును. మఱొకప్పుడు తానే విందుల కేఁగును. వేఱొకప్పుడు సినీమాలకు నాటకములకు వెళ్ళుచుండును. ప్రాతఃకాలమున కాఫీపుచ్చుకొని మిత్రసందర్శనార్థము వెడలినచో మధ్యాహ్నమున కింటికివచ్చును. భోజనానంతరము వార్తాపత్రికాపఠనమునందు కొంతకాలము గడపి, పిమ్మట విహారమున కేఁగి రాత్రి యేతొమ్మిదిపదిగంటలకో యిల్లుచేరును. ఆమె దినచర్యయంతయు నిట్లున్నది.

౫

మొట్టమొదట నాలుగైదు నెలలవఱకు మోహనున కేమియుఁ దెలియలేదు. కమల యాతనికండ్లకు సుగుణపుంజమై చూపట్టుచుండెను. కాని కాలక్రమమున నాలుమూలలనుండి ఋణదాతలరాకలు, జీతములిమ్మని సేవకులకేకలు నెక్కువకాఁగా బారిస్టరు కొంచెము కండ్లుతెఱచుకొనెను. కమలకీవిషయమైనచింతయే లేదు. తనఖర్చు కొంచెమైనను తగ్గించుకొనఁజాలనని యామె స్పష్టముగాఁ జెప్పివైచినది.

ఒకనాఁడు మోహనరావెక్కడినుండియో రాత్రిపండ్రెండుగంటల కింటికి వచ్చెను. అప్పుడు కమల నిద్రపోవుచుండెను. అతఁడామెను లేపి భోజనముపెట్టు మనినాఁడు. మొదట నామె లేవనే లేదు కాని పిమ్మట నొకప్రక్కకొత్తిగిలి "రాత్రిపండ్రెండుగంటలకు భోజనముండు ననుకొంటివా?" అని పలికెనే గాని లేవనుమాత్రము లేదు.

"అత్యవసరమగు పని యుండుటచే నాలస్యమైనది. శీఘ్రముగఁ చేసికొనకపోయిన చిక్కులపాలగుదును. భోజనములేనిచో భుజించునదేమి?

"నాకేమి తెలియును? నీవు సమయమునకు లేకుంటివి. చెప్పియును వెళ్ళలేదు. కావున అన్నము మిగుల్చలేదు."

"లేనిచో వంటచేసిపెట్టుము."

"నేనా? ఇప్పుడు వండిపెట్టవలెనా?

"అవును. వండియైనఁ బెట్టవలెను."

"నిర్దయుఁడా! సభనుండి యలసిసొలసి వచ్చిదాన నిప్పుడు నీకు వంటచేయవలెనా? సిగ్గులేక మాట్లాడుచున్నావా? ఇట్లు సుఖపెట్టుటకేనా నన్ను పెండ్లియాడినది? పరమేశ్వరుఁడు వచ్చి ప్రార్థించినను ఆపని కాఁజాలదు."

పాపము! మోహనుఁడు గ్రుడ్లుమిణకరించుకొని యూరకుండెను. వెంకమ్మ నడికిరేయినైనను తాను ఏమియు భుజింపక భర్తృప్రతీక్ష సేయుచు నెట్లుండినది యిప్పు డాతనికి స్మృతిగోచరమైనది. ఘుర్ఘ్వడతో నటులే మంచముపై పరుండి, "ఆహా! వెంకాంబా! నీ వెన్నఁడైన నిట్లు పలికియుంటివా? నిర్భాగ్యుఁడనై నిక్షేపమువంటి నిన్ను చేతులారఁ బోఁగొట్టుకొంటినే? శతజన్మములకైన నా యీ దుష్కృతికి నిష్కృతి యుండునా?"

పశ్చాత్తాపకాండ ప్రారంభమైనది.

వెంకమ్మ పోయినప్పటినుండియు కుఱ్ఱవానిని దాదులే పెంచుచుండిరి. కమల పొరబాటుననైన వానిని గన్నెత్తిచూడదు. దాదులకుమాత్ర మే మంతశ్రద్ధ! నెలనుండియు వానికి జలుబు దగ్గు తటస్థించెను. జ్వరముకూడా తగిలెను. వానివిషయ మెత్తుకొనినవారే లేదు. మోహనుఁడు మాత్రము పిల్లవానిని జూడఁ బోయెను. తన్ను తాను నిందించుకొనెను. వైద్యుని పిలిపించి చూపింపగా నది నెమోనియాజ్వరమనియు, బాగుగ చికిత్స చేసినచో నిమ్మళించుననియు చెప్పెను. మోహనునిప్రాణము కొంచెము కుదురుపడెను. "నేను చేయగల దేమికలదు? కచ్చేరికి వెళ్ళకతప్పదు. వీనిని గనిపెట్టియుండుటకు వీలులేదు. కావున కమలతో వీనిని జూచుచుండుమని చెప్పెద" ననుకొని కమలగదిలోనికిఁ బోగా నామె యెచటికో ప్రయాణమగుటకు సిద్ధపడుట చూచి "ఎక్కడికి ప్రయాణ?"మని యడిగెను.

"నీకెందుకు? కార్యాంతరమున వెళ్లుచున్నాను."

"తప్పనిసరియా?"

"అవును?"

"కుఱ్ఱవానికి నెమోనియాజ్వర మఁట ! వైద్యుడు చెప్పినాఁడు."

"అయిన నేనేమిచేయవలె?"

"నీవెక్కడికి వెళ్ళవద్దు. కుఱ్ఱవానివిషయము చూడుము. దాదులు వట్టిమొద్దులు. ఒకటి కింకొకటి చేయుదురు."

"బాగుగనే యున్నది! మంచిమాట చెప్పితివే! నేను వెళ్ళకపోయిన నక్కడ నలుగురు నవ్వరా?"

"వెళ్ళనిచో నచ్చట నవ్వు, వెళ్లినచో నిచ్చట యేడుపు!"

"నీకే. నా కేమి? నేనుండను. నేను వైద్యురాలను గాను. వైద్యురాలిని పిలిపించుకో!"

"ధనవ్యయమగుయోజనతప్ప మరిలేదు. వైద్యురాలిని పిలిపించిన పదిరూపాయిలు వృథావ్యయము. ఇప్పటికే వేలకొలఁది ఋణమైనది. నీ కేచింతయు లేదు. కేవలము విహారములే విహారములు!"

"మాట మాట్లాడిన నావిహారములయేడుపే? నేను నీబిడ్డకు దాసీత్వ మొనర్పరాలేదు. నాఖర్చులు భరింపలేనివాఁడవు నన్ను వివాహమాడుటేల? నీకుఁ దగినదాని నెవతెనైన నేల పెండ్లాడవైతివి?"

ఈమాటలు వినుటచే నాతనిక్రోధమున కంతులేకపోయెను. తాలిమికిఁగూడ దరియున్నది!

"భాషణములచే నేల బాధపెట్టెదవు? నిన్ను పెండ్లాడినందుల కిపుడు పశ్చాత్తాపపడుచున్నాను. నీ కిపుడుజూచిన సౌఖ్యానందములే తప్ప యితరవిషయమే పట్టదు. భారతనారీమణు లెట్టియున్నత త్యాగపూర్ణ జీవనము గడపవలయునో నీకు లక్ష్యమే లేదు."

"నాకు నీబోధనము లవసరములేదు."

"నేఁడు నీవిల్లు వదలి బయటికి వెళ్ళజాలవు. నీవు నాయాజ్ఞను పాలింపకతప్పదు. నిన్ను వెళ్ళనీయను. నాకు ప్రతికూలముగా నీవు వెళ్ళలేవు. పో! పిల్లవానిని జూడు."

"అ దెన్నఁడు కాదు. కాఁజాలదు. నేను వానివద్దకు వెళ్ళను. నన్ను వెఱ్ఱివెంకమ్మగా తలఁచితివా? నేను వెళ్లుట కెవ రడ్డుపెట్టెదరో చూచెదను."

అని చెప్పుచు కమల యక్కడనుంచి వెళ్లిపోయెను. మోహనుఁ డామెను పట్టుకొన నెంచెను గాని మరల యేమనుకొనెనో కుఱ్ఱవానికి మందిచ్చుటకై వెడలెను. భోజనముచేసి, కుఱ్ఱవానిని చూచుచుండమని దాదితో చెప్పి తాను కచ్చేరికి వెళ్ళెను.

## ౬

సాయంత్రము నాలుగుగంటలకు మోహనుఁడు బడలికతో నిల్లుచేరెను. ఇంటిలో కమల లేదు. ఏడ్చుచున్న బాలు నెత్తుకొని "కమల యెక్కడ?" అని దాసి నడిగెను. "పండ్రెండుగంటల కింటికి వచ్చి, భోజనము చేసి, తన బట్టలు మొదలగునవి తీసికొని స్టేషనుకు వెళ్ళిపోయిన" దని దాసి చెప్పినది.

ఈమాటలు వినుటతోడనే యాతఁడు చిత్తరువులోనిబొమ్మవలె నిశ్చలుఁడైపోయెను. కమల యింత సాహసించునని యతఁ డెఱుఁగఁడు. ఆమెగదిలోనికి వెళ్ళినాఁడు. ఆమెవస్తువు లేమియు లేవు. బల్లపై నొకజాబుమాత్రము పడియున్నది. అందిట్లుండెను.

> "...ఇఁక నే నిచ్చట నుండజాలను. ఉండుటకుఁ గోరి కయు లేదు. తమరు నాఖర్చులు భరింపజాలరు. రేయింబవలు జగడములాడుకొనుట నాకిష్టము లేదు. పుట్టినదిమొదలు స్వతంత్ర జీవనము గడిపిన నేనిపుడు పరతంత్రురాలనై యుండఁజాలను. తమరు నాస్వాతంత్ర్యమునకు భంగము గలిగింపఁ దలఁచి యున్నారు. కావున నేను వెళ్ళిపోవుచున్నాను.
>
> నేను వెళ్ళుటకుఁగల రెండవకారణ మేమియన పాపాత్ము లెంతపనికైన సాహసింతురు. ఒకప్పుడు పాపకృత్యము లొనరించినవా రింకొకప్పుడు చేయకుందురా? వెంకమ్మయెడఁ దమ ప్రవర్తనవింటిని. నాయెడఁగూడ నట్లే ప్రవర్తింపఁగూడదో? నాప్రాణము నాకు తీపి. సెలవు. 'కమల'

ఉత్తరము చదువుచుండగనే యాతనిపాదములు కంపించుచుండుటచే కుర్చీలో కూలఁబడినాఁడు. వెంకమ్మను దలఁచుకొని గంటలకొలఁది విలపించినాఁడు "హా! ప్రాణేశ్వరీ! కలుషాలవాలయగు కమలకై నిఖిలసద్గుణనిలయవగు నిన్నుఁ బోఁగొట్టుకొంటినే! ఇఁక నాకీజన్మ మేల? కాదు. కాదు. నిన్నుఁ గలసికొనుట కిదే నేనును వచ్చుచున్నాను."

పశ్చాత్తాపకాండ పరిపూర్ణమైనది.

మోహనుఁ డింకొకగదిలోనికి వెళ్ళి రివాల్వరును సరిజేసి గుండెకుఁ గుఱిజేసికొనినాఁడు. ఢామ్మని పెద్ద శబ్దమైనది. అదరిపడి కుఱ్ఱవాడు "అమ్మా" అని యఱచినాఁడు.

# కీచకుడు : ద్రౌపది

సామవేదం జానకీరామశర్మ గారు

(అది కీచకుని సౌధము. సుదేష్ణ పంపున మద్యముఁగొనిపోవచ్చిన ద్రౌపదిని కామపీడితుఁడగు కీచకుఁడు వెంటాడించినాడు. గత్యంతరములేక పరుగెత్తునామెతో)

కీచకుఁడు

ఓలలితాంగి, నీవువినవో మఱి, పేరున కాతఁడౌను భూ
పాలకుఁ డంతెగాని పరిపాలన నాయది; నాకనుంగవన్
రాలినఅగ్నిదీప్తికి ధరాపతులెల్ల గులాములౌదు రీ
మేలుదలంచి నాపలుకు మీఱకు; నిల్వు మొకింతసేపటన్

ఒకపఱి కాలకించి నను నొల్లనిచో పరుగెత్తిపోగదే
వికచనవాంబుజాక్షి! వినవే, వినవే, ఇదిరాజవీథి, నా
కిఁక భయమేల నంచు మది నెంచకుమా విరటుండుకాదు పో
రికిఁ ద్రిజగంబులడ్డినసరే, నను సింహబలుం గదల్తురే?

నాలోనెత్తురు నీకునై ఇటుల నన్యాయంబుగా మన్మథో
ద్వేలంబై ఉడుకెత్తుచున్నఁ గనరాదే సుంత లోలాక్షి? త్వ
ల్లీలాలాపరసప్రమోది, తనుసంశ్లేషార్థి, మన్మానసం
బేలా ఇట్టుల కాల్చెదీవు? వినవే ఈభీతి నీకేలనే?

నిను నాఅంతిపురాంగనాజనము తన్వీ! శీఘ్రమందుంచి నీ
కనుసన్నం బచరించుఁ గార్యము లనంగప్రాభవాధిక్యసం
జనితానందరసోపభోగమట! నీజన్మంబు నూహించి వే
జనకే పోయిన రాదు కాలము శరజ్జైవాతృకాభాననా!

ఓ నవనీలనీరదశిఖోజ్జ్వలినీ! స్మరదుర్నివారశ
స్త్రానలదహ్యమానతనుధారిని! నన్ననుకంపఁ జూడరా
దా? నికటమ్ము జేరవలదా? ఇటులేల కృధాతిరిక్తవై
నానయనప్రసారమున నాదరణంబొనరించి పర్వెదో?

ఓయి జయద్బలా! యనుచు నోయనుచున్ ఎలుఁగెత్తి బాష్పధా
రాయుతనేత్రవై అటు బిరానజనన్ నినుఁ గాచువారు లే
రాయెడ, మద్భుజాప్తబహుధాయతరాజ్యరమాప్రహృష్టుఁడౌ
నాయుర! అన్యులా కనులనారయఁజాలరిఁకేల చెప్పవే?

విచ్చినపూవు నా మొగమువిప్పి హసించినఁజాలు నేను నీ
ఇచ్ఛ తెఱంగునన్ మదికి నింపుజనింప చరించి నాకమం
దచ్చరలట్లు లీ వనునయమ్ములతో మహనీయసాధమం
దిచ్ఛమెయిం బ్రవర్తిలు నహీనశుభమ్మొనగూర్తునే చెలీ!

రాదా నీత్వమే మేలుగాఁదలఁచి నీ విస్వర్గసౌఖ్యమ్ము నీ
డేదో కానగరానిపాపమునకై ఏలా వృథాపుచ్చె? బా
లా దీనిం దలపోతు మొక్క త్రుటి రారమ్మిట్టు లాపైన నీ
కే దాక్షిణ్యముకల్గు కామదురితాగ్నిజ్వాల చల్లార్పగన్

ద్రౌపది

దుర్వారోన్నతబాహుశౌర్యవిభవస్తోమాభిరాముల్ స్ఫుర
ద్గర్వాంధద్విషనాశనాతివిశదఖ్యాతుల్ నృశంసాచర
ద్గర్వోన్మత్తకలావిభంజనులు నిత్యప్రాభవోపేతగం
ధర్వుల్ మృత్పతు లేవు రిప్పుడిటు నీతాపంబు చల్లార్పరే?

కాలముచేరువాయె చెడుగా! అవుగాము తెఱుంగలేక, వా
చాలతఁ జూపి దుర్గతివశమ్మయిపోయితి; వొతవెట్టి వీ
లీల పతివ్రతాంగన వరించి నశించినవారిఁ జూడఁబో
వీ; లయకాలబుద్ధి జనియించిన దంతముఁగోరి కీచకా!

ప్రజ్వరిల్లుమహాగ్నిని ఫలమటంచు
భ్రమసి చెడిపోతి వింక మద్భావ్ప్రచయము
కారణమ్ముగ నెల్లి నిన్ జేరు మృత్యు
వనుభవింపకతీర దీయఘము క్రూర!

# సన్మార్గము

కర్లపాలెం కృష్ణరావుగారు

సర్వాంగసౌందర్య సౌశీల్యవతినిచ్చు
విద్యగలదె? ప్రేమవిద్యగాక
భోగాస్పదంబగు పూబోడిగొనివచ్చు
ధనముగలదె? ప్రేమధనముగాక
ఆనందవార్ధియా యతివనుబంధింప
బలముగలదె? ప్రేమబలముగాక

స్వర్గసౌఖ్యమునిచ్చు సద్గుణవతిదెచ్చు
శక్తిగలదె? ప్రేమశక్తిగాక
లలితసుస్నిగ్ధలావణ్యమిళితకలిత
సరసశృంగారవతిగూడి సఖ్యమంద
ధర్మయుతమగు ప్రేమసాధనముగాక
మార్గమితరంబుగలదె? సన్మార్గులకును



లీ లా క న్య

ప్రభాతపిలింకంపెనీవారి 'నిర్బంధప్రమాణము' (Branded Oath) అను మాట్లాడు ఫిలిమునందు నటించి గొప్పఖ్యాతిగాంచిన భారతనటీరత్నము.

*By courtesy of "Kinema Pictorial"*

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## దశావతారముల జోలపాట

జో, జో, జో, గోకులబాల,
యెంతయూచినా నిదురింపవేర "జో"
స్వేచ్ఛగా వేదముల దొంగిల
మత్స్యరూపము దాల్చివారిధి
జొచ్చివేగమె ప్రముచ్చుసోముని
జంపి తెచ్చిన మురళికృష్ణా "జో"
ప్రేమ మందరగిరిని మోయగ
కూర్మరూపము దాల్చి యమృతము
దేవతల కందిచ్చి యసురుల
బంపిన గోపాలకృష్ణా "జో"
వరహారూపము దాల్చిభువిని
వరుస జాపగ జుట్టగల్గిన
పరమదుష్టహిరణ్యాక్షుని
పొగరు నడచిన గోపబాలా "జో"
నారశింహ్వరూపుడవై
హేమకసిపు ద్రుంచి భువిలో
ప్రేమ మీరగ ప్రహ్లాదుని
గాచి రక్షించిన కృష్ణా "జో"
వామనుడవై బలిని ద్రొక్కి యు
వారితంబుగ సురల బ్రోచియు
కామితార్థము లొంద మానులు

అయ్యగారి నరసింహమూర్తిగారు

గాచియుండిరి నీకై కృష్ణా "జో"
పరశురామాకృతిని గైకొని
కార్తవీర్యుని కదనమందున
సరగునను ఖండించి రాజుల
సయ్యనను గూల్చిన కృష్ణా "జో"
దాశరథివై రావణాది
దానవుల మర్దించి హనుమం
తా విభీషణాదిభక్తుల,
బ్రోచి రక్షించిన కృష్ణా "జో"
క్రూరశిశుపాలాదిద్రోహుల
గూల్చి యుధిష్టరునియాగము
కోరి సంరక్షింప మానుల
డెందములు ఆనంద మొందెను "జో"
స్థిరముగా ధరజనుల కెల్లను,
బరగ నహింసాదిధర్మము
లరయ బోధన సేయుటకుగా
ప్రొద్దు చాలదు నిదురపోరా "జో"
కలియుగాంతమునందు ప్రబలెడి
కలుషమతులందరిని గూల్చియు
కరుణ భక్తుల బ్రోవకల్కివ
తారమెత్తగ వేళలేదుర "జో"

## సహానం

కొమ్మపై కోయిల కూయుట మాని
పాపాయిపాట విని పక్కున నవ్వె

శ్రీమతి చావలి బంగారమగారు

"మాటలెరిగినవారు మాటాడగలరా?
మాటల్లు మనకేల పాటలేగాని

పాపామ్మ నీపాట బాగున్నదమ్మ
నీముందు నేనింక పాడలేనమ్మ
నీవు నేను కలసి పాడుతూనుంటే
ఈపేటవారలకు ఇక పాటలేవి?
పాటలెరిగిన మనము పాడుతూనుంటే

పాటలెరిగినవార్కి మాటలేలమ్మ
పేటవారలమాట పాటించకమ్మ
పాటమెరిగినపాట పాడవోయమ్మ
మనవారిమాటలకు మనకేల వులుకు
మనపాటలకు నేడు మాధవుడు బలుకు.

## ౨. కథలు

## బాదరాయణసంబంధము

శ్రీమతి టి. సుప్పమ్మ గారు

మనలో సహజముగ ననేకులు సామెతలను కలిపి ముచ్చటించుటకు వాడుకలేనివారై యున్నారు. సమయానుకూలముగ యుక్తాయుక్తవిచక్షణలెరిగి లోకోక్తులగలిపి ముచ్చటించుటయు భాష కొకభూష యనియే నాతలంపు. సామెతలు గల్గుట కొకకారణము మొదట నుండియేయుండును. "బాదరాయణ సంబంధ" మని మనము సమయానుకూలముగ వాడుచుండుసామెత కొకచిన్నగాథను నేను కర్ణాకర్ణిగా విన్నటుల నిందు చేర్చుచున్నదాన.

అనగాఅనగా ఒకఊరిలో నొకబ్రాహ్మణు డుండేవాడు. ఆయనకు నలుగురుకొడుకులు నలుగురు కూతుళ్ళు ఉండేవారు. ఆయనే ఆవూళ్ళోకెల్ల అన్నివిధాల సంపన్నుడని చెప్పాలి. వారింట్లో ఎప్పుడు వచ్చేవాళ్ళువస్తూయుంటే, వేసేవిస్తరివేస్తూయుంటే, తినేవాళ్ళుతింటూయుంటే నిరతాన్నదానము జరుగుతూయుండేది. ఆయనభార్యకూడా విసుగువేసటలేకుండా అన్నపూర్ణవలె వంటయింట్లోనే ఆవిడకు పని సరిపోతూయుండేది. వాళ్లింటికి ఎవరువచ్చినాసరే, ఎవరుపోయినాసరే 'ఎందుకువచ్చారు. ఎన్నాళ్లుండేరు.' అని అడుగకయే కావలసిన ఉపచారాలు ఎంతఅనామికునికైన వియ్యంకునిలాగు చేస్తూయుండేవారు. సంస్థానములాగు జరుగుతూయుండేది. ఈలాయుండగా ఈసడి ఒక సాపాటురాముడు దూరతోపాస్తివాడు గ్రహించి పెట్టెబేడా, గుడ్డగుడుసూ, భార్యాపిల్లలూ బండీఎద్దూ, నౌకరీతోటి బబర్దస్తుతో తీసేసిన తాసీలుదారుడిలాగు అట్టహాసముగావచ్చి వేళవేళకు తిండితీర్థాలతోటి కాలము గడుపుకొంటూయుండేడు. అసలు యింటియజమాను డేమనుకొన్నాడు ఈ తీసేసిన తాసీలుదారును చూచి? తన కోడండ్రకో అల్లుండ్లకో నిండా అయిన బంధువని అనుకొన్నాడు ఆతాసీలుఆయన ఆవిడయుండే కలియకలుపుతనాన్నిచూచి. అంతే కాకుండా తన కోడండ్రబాంధవ్యములోను, అల్లుండ్రబాంధవ్యములోను గొప్పఉద్యోగస్థులున్నారని వినడంబట్టి ఇంటి యజమానురాలు ఏమనుకొన్నదో ఎరుగుదురా? తనపెనిమిటికి తెల్సినవారనుకొన్నది. కొడుకులూ—తన తండ్రికో, బావమరుదులకో తెల్సినవారనుకొన్నారు. కోడండ్రేమనుకొన్నారు? తమపెనిమిట్లకో, మామగారికో, యింటిఅల్లుండ్లకో తెల్సినవారనుకొన్నారు. కూతుళ్ళును, అల్లుండ్రును ఆలాగే తలచేరు వారివారిపనులను వారు చూచుకొంటూయుండే అలవాటుగనుక. ఈలా కొన్నినాళ్ళు, వారములు, పక్షములు, నెలలు గడిచాయి. ఆబ్రాహ్మడిమూడవకొమారుడు యిప్పటి నవయువకులజట్టులో చేరినవాడు. చురుకుగల బుద్ధిమంతుడు. ఆతడీలా యెంచేడు ఒకనాడు. "ఎవడు ఈనవీనుడు? నాకు తెల్సినంతలో ఎందరో అతిథులు మాయింటికి వచ్చిరి. ఎవరికి ఇ.తగా ఉపచారాలు, ఇంతగా శుశ్రూషలు జరిగేవిగావు. మావారు ఎంతనిరతాన్నదాతలయినా ఈయన 'ఎవరు? ఎందుకొచ్చేరు? ఇంతకాలముండడములో ఎవరికి బాంధవ్యము?' అని విచారించినవారేకారు. వీరికి ఏమి పనిలేదూ, పాటాలేదు. వచ్చి ఆరుమాసాలయింది. ఎవరు వీరిని విచారించువారు యింతకు కనుబడలేదు. అయినా నాన్నగార్ని అడిగి తెల్సుకోవాలి.' అని ఒకరాత్రి భోజనాలుముగిసినతోడనే బిరబిరా నాన్నగారి వద్దకుపోయి 'నాన్నగారూ, ఆరుమాసాలుగా మనయింట్లో సమస్తఉపచారాలతోటి వియ్యంకునిలాగు విందు

గుడుస్తూయుండే పెద్దమనిషి ఎవ'రని అడిగేడు. తల్లిని, అన్నలను, అల్లుండ్రను యింట్లోవారందరిని అడిగేశాడు వరుస తప్పకుండా. అందరూ మాను తెలియకువాళ్లను. అకుగు మాకు తెలియగువాళ్లను విచారించు అంటూ అందరు దీపముదగ్గర గుమిగూడిచేరితర్కించేరు ఫలితము ఎవడికి సంబంధించినవాడు కాడని తేలింది. ఇంట్లోవీరందరు కలిసి మాట్లాడుకోవడము వీధియరుగుపై భార్యతో ముచ్చట్లు ఆడుచున్న ఆతడు విన్నాడు. అరేఅరే మనగుట్టు యింక బయటపడుతుంది యిక్కడ యుంటే ఇక్కడ యింక ఉండడము పరువుగాదు. స్థానభ్రష్టత్వంచేయాలి. ఇక్కడ అనువుపడదు.' అని ఆతీసేసినతాసీలు లోపలజరిగిన గడిబిడిఅంత భార్యకు రహస్యముగా చెప్పి 'ఏలా వీరడిగిన ప్రశ్నకు జవాబు చెప్పతానురా'అని రాత్రిఅంతా ఉబుసుపోక అట్లాయిట్లా పొర్లుచూ ఆలోచిస్తూ కోడినిద్రతో కాలముగడిపేశాడు. పొద్దున్నే నిద్రలేస్తూనే పెట్టెబేడ సర్దుకొని బండి కట్టించి భార్యను పిల్లల్ని బండెక్కించేడు. మన నవయువకుడు నిద్రలేచినతోటే అదేకలవరముండేవాడు కనుక ముందుగా తలాకిట్లోకి మరదియ్యింకుని విచారించటానికి వచ్చేడు. కుటుంబమంతా వచ్చింది యీ తమాషా చూడటానికి. అప్పుడు యింటిముసలాయన ముందుకు వచ్చి 'ఎవరయామీరు? చాల రోజులనుంచి మాయింట నుండినను మంచిచెడ్డలను విచారించకపోతిమి మన్నించాలి. అని పాతకాలపుమోస్తరు భయభక్తులతో అడిగేడు. అప్పుడానవీనుడు యీ క్రిందివిధాన శ్లోకము చెప్పుచు బండిఎద్దును అదలించాడు. శ్లో. అస్మాకం బదరీచక్రం యుష్మాకం బదరీతరుః బాదరాయణసంబంధం యూయంయూయం వయంవయం. అనగా 'మాబండిచక్రాన్ని రేగుకర్రతో చేయించాము. మీ పెరటిలో రేగుచెట్టున్నది. ఇన్నాళ్లు మీయింటిలో విందులుగుడవటానికి యీ బాదరాయణసంబధమేకాని, మీరుమీరే. మేముమేమే.' అంటూ ఎద్దును అదలించి అదిలించి తరుముకొంటూ పారిపోయాడు. అప్పుడు కుటుంబమంతా తమ తెలివితక్కువతనానికి చాలా ఆశ్చర్యపడ్డాది. కథ కంచికి వెళ్లింది. కామాక్షమ్మ యింటికి వచ్చింది.

## వాయస మహాసభ

శ్రీమతి కే. రోజియమ్మగారు

ఒకప్పుడు కాకు లోకయరణ్యప్రదేశమందు సభజరుపనిశ్చయించి మయూరమరాళ గరుడకపోతశకుంతసంతానములకును, జలచరములగుమత్స్యములకును, తుదకు మానవులకును ఆహ్వానపత్రికలనంపెను. నభాస్థల మొకవిశాలవటవృక్షము. పక్షులు శాఖలపై గూర్చుండెను. ఇతరమృగములన్నియు పచ్చికబయలు నలంకరించెను.

అంత నొకహంస లేచి, సభనుద్దేశించుచు జెముడుకాకి నగ్రాసనాధిపత్యము వహింపగోరెను. అన్నియు నేకగ్రీవముగా నొప్పుకొనెను. తక్షణమే జెముడుకాకి యెగిరియున్నతాసనమలంకరించెను. పక్షులు కలకలారవములుసేయుచు సంతోషసూచకముగ టెపటెప ఱెక్కలుగొట్టెను. అగ్రాసనాధిపతి తొలిపలుకులు కొన్నిబలికి కూర్చుండ చిరంజీవి లేచి సముచితరీతి నిట్లుపన్యసించెను.

భ్రాతృవరులారా! స్వజాతీయులారా! మానవశ్రేష్ఠులారా! పరాత్పరునిసృష్టిలో పక్షిజన్మ మెంతయుత్కృష్టమైనది! అట్టిజన్మమెత్తుట కఠంబు సుకరంబుగాదు. ఎన్ని నోములునోచినగాని, ఎన్నిక్రతువులొనర్చినగాని, ఏయేతీర్థములగ్రుంకిడినగాని నిట్టిజన్మము కలుగగలదు? వేయేల! పక్షిజన్మమెత్తుటయను మహాభాగ్యము పూర్వజన్మసుకృతఫలముగాని

వేరొంటు గాదుసుమండీ. దేవతలకుసహితము పక్షులన్న ప్రాణము. సృష్టికర్తయగు బ్రహ్మదేవుని మోయునదెద్ది? మరాళము గదా! జగద్రక్షకుడగు విష్ణుదేవునివాహన మెద్ది? గరుడపక్షి గదా! మహేశ్వరు తెక్కుడేది? మయూరము గదా! నవగ్రహములలో నొక్కడగుశనిని మోయుభాగ్య మున్నదది? నా స్వజాతీయుడగు [illegible] యని నొక్కి వక్కాణించుచు మురియువాడ. అయినను కొందరుమానవులు పక్షులను తృణీకరించుచు కాకులన్న గ్రదీసికొందురు. మేము మానవసంఘమునకు జేయు నమోఘసేవను బాటింపక దూషింతురేగాని భూషింపరు. మేము పీనుగుల దిందుమట! తినకున్న మానవసంఘమునకు కీడా? మేలా? మృతకళేబరముల నట్లేవిడిచిన వాయువు దుర్గంధయుతమై వ్యాధులు ప్రబలును. అప్పుడప్పుడు మమ్మును గుఱిబెట్టి కాల్చిచంపుట కొందరుతుంటరిమనుష్యుల కాటపాట. మేమైతే వారి కెట్టియపకారము జేయబోము. మరేలనో వారు మమ్మిట్లుదూరుట?

మేము నల్లగానుందుట మరియొకదోషమట. 'సరే. మరి మానవులలో కాఱుమబ్బంత కఱ్ఱివాం డ్లెందరు లేరు. గురిగింజ తన నలుపెరుగదనుసామ్యమున కిదియె ప్రబల నిదర్శనము. సత్యము. ముమ్మాటికి సత్యము. దేహపరిశుభ్రతలేని మానవులుకొందరు 'త్రికరణశుద్ధి, త్రికరశుద్ధి' యని వదరుచుందురు. దేహశుచినెరుగని యీ మహానుభావులు త్రికరణశుద్ధికై త్రిలోకములు దిరిగినను ప్రయోజనములేదు. ఉట్టికెక్కలేనమ్మ స్వర్గమునకెక్కుటిదియెకాబోలు? దేహశుచి దైవభక్తికి ప్రథమసోపాన మన్నాడు మహానుభావు డొకడు. వారమునకొకసారియో నెలకొకసారియో స్నానముచేయువారున్నారన్న నది యతిశయోక్తికాదు మేమైతే దినమునకు ముమ్మారు జలకమాడుదుము. ఎవరు శుచిగలవారో నిర్ణయించుబాధ్యతను నేటిసభాసదులకే విడిచిపెట్టెదను.

మామీద మరియొకనింద. మేము పిరికిపందలమట. ఆకు పైబడిన నదరిపడునట్టియు, ఎలుక కనబడిన నెగిరిపడునట్టియు ధీరులకన్న మేము భీరువులముగాము. ఒక్క ఫిరంగిగుండు గాల్చినజాలు. మిన్నువిరిగి మీదబడెనన్నట్లు పలాయనమాదురు. అనేకులు కూర్చుండి భుజించుచుండగా వారిపాత్రలలోనుండు పదార్థముల నెంతధైర్యముతో గొనిపోదుము! పిల్లలచేతులలోనుండు రొట్టెముక్కల నీడ్చుకొనిపోయి వారినేడ్పించుట చిన్నపనియా? దుర్జనులే మమ్ము దూషించి రాలుగువ్వవారు. సజ్జనులు మాయందుండు సద్గుణముల నెరుగుదురుగాన మమ్ము శ్లాఘింతురు. ప్రతిదినము తాము భుజించుటకు ముందు మొట్టమొదట మాకే కొన్నియన్నపుముద్దల నిడుదురు. పెద్దలశ్రాద్ధదినమున మాకు కావలసినంత భోజనమును సిద్ధముచేసి దానిని తినవలెనని మమ్ము ప్రార్థింతురు. కావున, మదీయజాతీయ సోదరసోదరీమణులారా! మనము మనకర్తవ్యమెరిగి మానవకోటిని సేవింతము. 'పరోపకారార్థమిదంశరీర' మన్నలోకోక్తిని మరువకుందము.

మాలో సంఘీభావము మెండు. ఇతరపక్షియేదైన నొకకాకి నడ్డగించి తరిమిన, మేమందర మేకీభవించి దానినోడింతుము. స్వార్థపరత్వము మాలో సున్న. తినుట కేమైనలభించిన కాకులన్నియు గుమిగూడును. ఒకటి 'కావు,కా'వని యరచి తక్కినవాని నన్నిటిని చేరజీరును.

కాకులు భూతదయగలవన్న నామాటలు విశ్వసింపరేమో యను శంక. ఎద్దుగాని, ఆవుగాని పుండుచే బాధపడునపుడు మే మాపుండులోని క్రిములను చంపి తినివేతుము. అందుచే పుండు త్వరలో మానును. కావున నోమహాశయులారా! చక్కని దేహము కన్న చక్కని నడవడి మంచిదని నా యభిప్రాయము. మన మందరమును మనప్రవర్తన విషయమై జాగరూకులమై భక్తిశ్రద్ధలతో శక్తివంచనలేక నితరుల సేవింతము.

చిరంజీవి తన గంభీరోపన్యాసమును ముగించి కూర్చుండగా నాటి మహాసభ ముగిసెను. తదుపరి సభాసదు లెల్లరు నల్పాహారమునుగొనుటకు వెడలిరి.

(హిందూ సచిత్రవారపత్రికనుండి అనువదింపబడినది.)

## ముత్తవ్వకట్నం

భాగవతుల యజ్ఞనారాయణ శాస్త్రిగారు బి. ఏ.

అనంగనంగా ఒక ఊరిలో ఒక పురోహిత బ్రాహ్మ డున్నాడు. ఆయనపేరుతో మన కెందులకుగాని గ్రామములో అంతా అవధాన్లగారని పిలిచేమామూలు. ఈయన ఒకపెండ్లికి యాగ్గికంచేశాడు. పెండ్లిలో మొదటిరోజున వరునిచేత వధువుకు మెడలో పుస్తెకట్టించవలసినది. పాప మా పురోహితుడు వృద్ధుడగుటచే మైమరుపుకలుగుటవలననో, తొందరలోనో లేక మేళతాళములహడావుడిలోనో పెండ్లికుమార్తెమెడలో పుస్తెకట్టించుట మరచినాడు. పుస్తె పురోహితునిమొలలోనే దోపియున్నది. మిగతాకాండంతయు జరిపించినాడు. ఎవరును ఈసంగతి గమనింపనేలేదు. పురోహితుడు స్వగృహమునకు వెళ్లి మడిబట్టకట్టుకొను సమయమున అతనిమొలలోనున్నపుస్తె అమాంతం క్రిందపడినది, అప్పు డాతడు దానిని చూచుకొని "పొరపాటు జరిగినదిరా" అనుకొన్నాడు. "ఇక ఈసంగతి అక్కడ తెలిస్తే కొంపకూల్తుందే ఎలారా దైవమా" అని ఖిన్నుడై నెత్తినచేతులుపెట్టుకొని కూర్చున్నాడు. ఆలోచించగా ఆలోచించగా ఆతని కొక ఉపాయం తోచింది. వెంటనే తన శిష్యుని పిలిపించినాడు "ఒరేశిష్యా శిష్యా! గొంతుకత్తిరించుకుపోయే పొరపాటు జరిగింది. ఇందులో నీవు సహాయముచేస్తేనేకాని బయటపడ"నన్నాడు. శిష్యుడు "నేను చేసే సహాయాలుకూడా ఉన్నాయా ఈప్రపంచంలో? అయితే చెప్పండి అలాగే చేస్తాను. మీమాటకు ఎదురుచెపుతానా?" అన్నాడు. ఇద్దరు సరే అంటే సరే అనుకొన్నారు. "ఈవేళ పెళ్లిలో పెండ్లికుమార్తెకు పుస్తె కట్టించుట మరచిపోయినానురా! అది నా మొలలోనే ఉండిపోయింది. పెండ్లివారికి ఈసంగతి తెలిసిందంటే నా ప్రాణాలు దక్కనియ్యరు. కనుక ఎలాగైనాసరే నీవీరాత్రి ఈపుస్తెను తీసుకుపోయి బహు జాగ్రతగా ఆ పెండ్లికుమార్తె నిద్రపోవునపుడు ఎవ్వరికి తెలియకుండ ఆ పిల్లమెడతో కట్టిరావలయును. తెలిసినదా?" అన్నాడు గురువు. "అయితే తెలిసిందికాని అంతా వరుసగా నిద్రపోతుంటారుగదా? అందులో పెండ్లికుమార్తె ఎవరో తెలుసుకొనుట ఎలాగు స్వామి" అన్నాడు శిష్యుడు. అప్పుడు గురువుగారు

ఒకగుర్తు చెప్పినాడు. ఒరేశిష్యా! పెండ్లికుమార్తెకట్టుకొనినది మధుపర్కం ముతకది అనగా ఖద్దరుచీరె. ఆ బట్ట చేతికి కరుకుగా తగులుతుంది. నీవు యిది గుర్తుగా పెట్టుకొని పనిసాధించుకు రావాలి" "ఓ అలాగే" అని ఎగిరి గంతేశాడు ఆ తెలివిగల శిష్యుడు! పెండ్లివారింట్లో అంతా భోజనములుచేసినారు. పగల్లా తెరిపిలేని పనులలో నుండుటవలనను అదీగాక అప్పటికే రాత్రి చాల ప్రొద్దుపోవుటవలనను ఎక్కడివారు అక్కడ చప్పకట్టలవలె పడి గుర్రులుపెడుతూ నిద్రించుచున్నారు. అట్టి సమయములో మనశిష్యుడు కార్యసాఫల్యము చేసికొనివచ్చుటకు మెల్లగా అడుగులచప్పుడు వినబడకుండా బహునేర్పుతో బయలు దేరాడు. మగవాళ్లపక్కలు దాటి ఆడవాళ్లు శయనించియున్న స్థలమునకు వచ్చినాడు. కాళ్లకాట చేరి ఒక్కొకరికట్టువస్త్రమును తవుడుకొంటూ వస్తున్నాడు వరుసగా పెండ్లికుమార్తెను కనుగొనుటకు. ఆదినమున లగ్నకాలమునందు పెండ్లికుమార్తెముత్తవకు కట్నంక్రింద ఒక ఖద్దరుచీరె పెట్టినారు. ఆ పూర్వసువాసిని చలి కాలమగుటచే వెచ్చగానుండుననికాబోలు ఆముతకవస్త్రముతోనే శయనించినది. శిష్యుడు ఆచీరెగరుకును చూచి ఆమెయే పెండ్లికుమార్తెయని నిశ్చయించుకొని "ఆనాడు హనుమంతుడే సీతను కనుక్కొన్నాడు రామకార్యంలో. ఈనాడు నేనే పెండ్లికుమార్తెను కనుక్కొన్నాను గురుకార్యంలో." నని తన తెలివికి సంతోషిస్తూ మెల్లగా ఆమెమెడలో నా పుస్తెనుకట్టి గురువుగారిముప్పు తప్పించినాననే సంతోషముతో అక్కడికాలు గురువుగారివాకిట్లో పెట్టినాడు. గురుశిష్యులిరువురు ఆనందాబ్ధిలో నోలలాడేరు.

తెల్లవారినది. ముత్తవ తనమెడలో నేదియో చల్లగా తగులుచుండుట తెలుసుకొని చూచుకొనగా క్రొత్తమంగళసూత్రము! ఆవిడ నివ్వెరపోయింది పాపము! ఇంతలో అందరికీ తెలిసిం దీసంగతి. ఆశ్చర్యసంభ్రమములు కలిగిన వందరికి. అందరూ వెళ్లి పెండ్లికూతురి మెడలో చూస్తే ఏ ముంది అక్కడ? ఇదే మాశ్చర్యమంటే ఇదే మాశ్చర్యమనుకొని పురోహితునికి కబురంపేరు. పురోహితుడి కీసంగతి తెలిసేటప్పటికి పై ప్రాణం పైన పోయింది. "ఓరి వీడిదుంపతెగా కొంపత్రవ్వేశాడురా" అనుకొని ఇంతకు గుండెనిబ్బరం కల వాడు కనుక ఇప్పుడు సమర్థించుకొనకపోతే లాభంలే దనుకొని ధైర్యంతెచ్చుకొని అందరితో తానుకూడ నాశ్చర్యము నటించుచు "మీ యింట్లో భూతాలున్నవా ఏమిటి? లేకుంటే పెండ్లికుమార్తెమెడలోనిది ఈమెమెడలోని కెట్లువచ్చును? అయిన వాటిరోగం ఈసాయంత్రం నేను కుదురుస్తానులెండి" అన్నాడు. అందరు నిజమేననుకున్నారు. సరే సాయంత్రంవచ్చింది. పురోహితుడు తనకు ఒకప్రత్యేకపుగది ఒక కుంపటి అగ్గిపెట్టె సవాశేరుఎండుమిరపకాయలు మొదలయినవి కావలెనన్నాడు. అలాగే అమర్చారు. గదిలోనికి ముత్తవతప్ప ఎవరును రాకూడదన్నాడు. పాప మామెయొకతెయే గదిలోనికి వెళ్లినది. గదితలుపు మూసినాడు. అందరు గదికివతల కూర్చున్నారు ఏమిజరుగుతుందో చూద్దామని. పురోహితుడు కుంపట్లో నిప్పుచేసినాడు. పండునిప్పులమీద ఆమిరపకాయలను పోయుచు ముత్తవను ముఖమును కుంపటికిమీదుగా నుంచమన్నాడు. ఆవిడ అమాయకురాలు. అలాగే చేసినది. ఆతలను గట్టిగా పట్టుకొన్నాడు. పురోహితుడు కదలకుండా మెదల కుండా. ఆమిరపకాయల ఖారూకు ఉక్కిరి బిక్కిరి అయిపోతున్న దాముసలిది "నన్నువదలిపెట్టరో నేను పోతానురో" అని పెద్దపెట్టున ఏడవటంమొదలుపెట్టినది. బయటనున్నవారు 'చూశారా! భూతం పోతా ననుచున్నది" "బాగా వేధించు పురోహితయ్యా భూతాన్ని మళ్లీమళ్లీరాకుండా" అనుచుండిరి. పురోహితుడు ఆవిడ "నన్ను వదలిపెట్టు నన్నుపోనియ్యి" అని ఏడ్చినకొలది 'ఇక రావుగదా? సిగ్గువచ్చినదా?' అని మంద లించుచుండెను. పాప మామె "నేను యిక రానురో. నన్ను చంపవాకురో. పోనియ్యరో" అని ఒకటేగోల. ఈఫార్సు కొంతతడవు జరిగినపిదప తలుపుతీసి "ఈ భూతం యికరాదు. ఈపుస్తెను పెండ్లికుమార్తెమెడలో కట్టు"మన్నాడు పురోహితుడు.




కొంపెల్ల జనార్దనరావుగారు

[ఈపాటలు (మఱికొన్నియు) మాఅన్న శ్రీ కొంపెల్ల సూర్యరావు గ్రామొఫోను రికార్డింగు నిమిత్తము అభ్యసించుటకుఁగాను రచించినాను. ఇవి నాఅనుమతిలేకయే కొందఱు తమ రికార్డింగునకు ఉపయోగపఱుచుకొనఁజూచుచున్నట్లు తెలియవచ్చుచున్నది. అందుచే ఇవి ప్రకటించుచున్నాను. సర్వస్వామ్యములు రచయితనగు నాయవి.]

## ౧. యమునకల్యాణి

మధుర గాన రసికా సదయా
మాయా పిహిత నిశాంతా కాంతా
భక్తవచోరుచిర సుమశరజితా!
భావమరందపిపాసీ మధుర
విశ్వవిధాయక ప్రణయప్రణయా
విఘటిత కాంతిదిశాంతా! మధుర

## ౨. బాగేశ్రీ

ఓమహోనిలయ మాధురీమయా
ఊహాజయరమా శ్రితచరణా!
నీపదసేవా నిరతిలోలమై
విచలితహృదయా వృతభాషాతృష
మౌన మాధ్వ్యముల మ్రాన్పడివలచున్. ఓ

# ఉత్తర

## దేశిరాజు వేంకటకృష్ణశర్మగారు

[అభిమన్యుడు యుద్ధమునకు పోవుటకు ధర్మజుని ఆజ్ఞ అయినది. సైనికుల రణదుందుభుల మ్రోతలలో అపశబ్దమొకటి విని దేవతలు ఆతురతతో చూడవచ్చిరి. నింగిని సభనుతీర్చియున్న వాసవునిప్రక్క శచీదేవికి ఉత్తరపై జాలిపుట్టినది. కనుచూపుమేరవరకు ఉత్తర అతనినిచూస్తూ నిలుచున్నది.]

జయజయశబ్దముల్ దిశల సాగి అరిందమమైన శక్తిలో
లయమయి దీవనల్ సలుపు రాచకులంబు విశేషకీర్తిలో
ప్రియతవహించుగాక పెరవీరులు మెచ్చిన శౌర్యదీప్తిలో
ప్రియుడు మనోజ్ఞమూర్తి గనిపించెడి నాయెద దివ్యదృష్టికిన్?

ఈరణదుందుభుల్ ఇట రచించిన వావిజయాంకవృత్తముల్
పోరుకలంగ నావిభుడు పోయినజాడలలోన ప్రేమసం
జ్ఞారమణీయకావ్యములు కల్పనమందెను జీవితపుణ్యమాధురీ(?)
ప్రేరణకారణంబుగ చరించెడు నీయెడ శౌర్యరూపముల్

నాసర్వస్వము నాదుకోర్కెలకు స్థానంబైన చిన్మూర్తి ప్రే
మాశాబద్ధవిమోహమోహనుడు సామ్రాజ్యైకహేతుప్రభా
శ్రీసన్మాన్యుడు యుద్ధరంగమున భాసిల్లన్ మనోజ్ఞత్వవే
షాసాఫల్యము జూచి, దేవతలయోషారత్నముల్ మెత్తురా?

ఇచటకూడిన సైన్యవాహినులలోన
నింగి సభతీర్చు దేవతానీకమందు
నావిభునిశౌర్యవర్చస్సు నాటినట్టి
ప్రళయనర్తనలోన విరాగమొలసి

భిత్తములకైన నర్తనప్రేణనమున
ఏమిశాసింపబడునొ? ఎంతెంతపుణ్య
రాసు లారక్తపాతసంరంభమందు
కలసిపోవునొ?

చిరయశస్సులు దివ్యయాశీస్సు లపుడు
పుణ్యసేనలు నాపుణ్యమూర్తినొలయు.
ఆమహాఘోరసంగ్రామమందు నెగయు
క్రూరరాక్షసభేతాళకులము బలసి
భూతకేశాంతగస్తాస్త్రము క్తభిన్న

సకలదిగ్వ్యాప్తృతంబు సుక్షాత్రతేజ
మునకు వన్నె బెట్టెడు మహాపుణ్యమూర్తి
నామనోనాథుకీర్తిసంతతులు నేడు
దిశలవెలుగొందు ఓపుణ్యదేవులార!
బలసిపోషింపుడయ్య నాప్రాణవిభుని.

# కథలు—కబుర్లు

**వంట చెరుకునకు వీడ్కోలు:—**

మనపెద్దలకాలమునుంచియు కట్టెలతో నిప్పుచేసి వంటమొదలగునవి చేసుకొనుట అచారమైయున్నది. ఇటీవల కొన్నిపరిశోధనలవలన విద్యుచ్ఛక్తిసహాయమున వంటచేయుచున్నట్లు వినవచ్చుచున్నది. కాని యీపద్ధతి సామాన్యుల కందుబాటులో నుండదు. ఈమధ్య మిస్టర్ ఏ. యఫ్. డఫ్టన్, మిస్టర్ హెచ్. ఇ, బేకెట్ అను ఆంగ్లేయులిద్దరు ఒకయంత్రమును నిర్మించిరి. దీనికి నిప్పుగాని విద్యుచ్ఛక్తిగాని అవసరములేదు. సూర్యకిరణములవేడికే అన్నముడికిపోవును. ఇది ఒకపెట్టె. దీనిపెలుపలిభాగమంతయు నల్లగానుండును. పైభాగమున ఒక కంచుమూత యున్నది. పరిక్షచేయదలచి లోపల ఒకగ్రుడ్డునుంచి యీపెట్టెను కొంతసేపు ఎండలోనుంచగా లోపలిగ్రుడ్డు ఉడికియుండెను. ఎండలేనప్పుడైనను ఈపెట్టెను బహిరంగస్థలమునసుంచిన దీనివేడి కనీసము 250 డిగ్రీలు ఉండును. ఈ పరిశోధనమునందు సంపూర్ణవిజయమునందుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఈపరిశోధనలు జయప్రదమగుచో వంటచెరుకునకు వీడ్కోలుచెప్పవలసియుండును. సూర్యకిరణములలో ఏవిధమైన విషవాయువులుండవు గనుక ఇట్లు వండబడిన అన్నము తినుటచే ఆరోగ్యము అత్యద్భుతముగా నుండుననుటమాత్రము నిస్సంశయము.

**దొంగలను పట్టుకొను పెట్టె:—**

విదేశీయవైజ్ఞానికులు (Foreign Scientists) ను, శిల్పులను మాత్రమే తమ తెలివితో క్రొత్తక్రొత్తయంత్రములు మొదలైనవి కనిపెట్టుచున్నట్లు వార్తాపత్రికలలో చదువుచున్నాము గాని హిందువులెవరును ఇట్టి పరిశోధనలు చేసినట్లు వినబడదు. మనదేశమున చేతిపనులకు ప్రోత్సాహములేకపోవుటయే దీనికి కారణము. అయినను మహారాజులు జమీందారుల ప్రోత్సాహముండుటచే పరిశ్రమలు పాడుగాక హిందూదేశగౌరవమును నిలబెట్టుచున్నవి. టోంక్ప్రాంతములోని సిరోంజ్ గ్రామములో పుష్కరచంద్ అను నొకడు దొంగలను పట్టుకొనుటకొకపెట్టెను కనిపెట్టియున్నాడు. యజమానుడుతప్ప యితరులా పెట్టెను తాకిన ఒకతాళముచే పట్టుబడుదురు. యజమానుడు విడిపించువరకు అట్లేయుండవలెను. ఇట్లే యితడు పెట్టెనుతాకినచో తుపాకిప్రేలునట్లొకపద్ధతి కనిపెట్టినాడు. ఇట్టి పరిశోధనలు భారతీయపారిశ్రమాభివృద్ధికి ప్రబలనిదర్శనములు.

**కత్తిలో తుపాకి:—**

సాధారణముగా తుపాకిగొట్టములో ముక్కోణపుకత్తి దోపి బల్లెమువలె నుపయోగించుట అందరెరుగుదురు. పైనిజెప్పిన పుష్కరచంద్ కత్తిలోనే తుపాకియుండునట్లు తయారుచేసినాడు. కత్తితో దెబ్బవేసినపుడు లోపలనున్న తుపాకికూడా ప్రేలును. ఈ పరిశోధనప్రకారము ఒకేఆయుధము ఒకేసమయమున రెండువిధములుగా నుపయోగించుచున్నది.

**దారుప్రతిమ దౌవారికత్వము చేయుట :—**

యూరపు అమెరికాదేశములయందు ప్రకృతిశాస్త్రపరిశోధకు లిదివరకు మనుష్యులవలె కదలికలు గల ప్రతిమలను తయారుచేసియున్నారు. మిస్గన్ సరస్సుగట్టున సరస్సులోని నీటిప్రమాణమునడిగిన తెలుపునట్టి బొమ్మకూడా ఒకటియున్నది. ఇట్టి పరిశోధనలయందు హిందూదేశమేవిధమునను వెనుకబడియుండలేదని ప్రపంచమున చాటుటకు పైనచెప్పిన సిరోంజ్ గ్రామములోనే మరియొకఁడు వాకిటికావలికి ఒక బొమ్మను తయారుచేసియున్నాడు. ఈబొమ్మకు ఒకచేతిలో కఱ్ఱ రెండవచేతిలో గొలుసు వుండును. ఇది సమయమునకు గంటలు, అరగంటలు, పావుగంటలుకూడా కొట్టును. ఈ యంత్రప్రతిమకు ఎనిమిదిరోజులకొకసారి కీ (Key) ఇచ్చుచుండవలెను. చూచువారికి మనుష్యుఁడేయనిపించును గాని బొమ్మయని బొత్తిగా తెలియదు.

**తాబేలుకు తలలు రెండు:—**

అమెరికన్ జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీలో ఒక ముఖ్యోద్యోగియగు యఫ్. బి. క్లిఫ్ అనునతని తొమ్మిదేండ్లకుమార్తెకు స్కెనెక్టడీలోని ఒకచెరువులో వింతతాబేలొకటి దొరికినది. అది 'Y' అను అక్షరరూపమున నున్నదనియు, దానివెన్నెముక రెండుభాగములుగా నున్నదనియు గైబార్ట్లెటుగారు తెలుపుచున్నారు. అయితే అది ఆహారము రెండునోళ్ళతోను తినునా అని ఒకసందేహముకలుగును. ఇంతవరకు అది ఆహారముతినలేదు. లక్షణములన్నియు సరిగానేయున్నవి. ,కాని ఏప్రక్కనున్నతల ఆప్రక్కనున్న కాళ్ళతో నడవయత్నించును. ఒకప్పుడు ఒకతల నీటిలోను ఇంకొకతల నీటివెలుపల నుండును. ఒకతలతో నిద్రించుచు రెండవతలలో మేల్కొనియుండవచ్చును. అది ఒక్కొక్కప్పుడు ముందుకాళ్లెత్తి కుప్పిగంతులు వైచును.

**ఇరువదినలువురు బిడ్డలగనిన యిందువదన :—**

పోలాండు దేశమున బియావిస్టాకుజిల్లాలో నొక వ్యవసాయదారుడు ఒకభార్యయందే యిరువది నలుగురు బిడ్డలగనెను. అందరును బ్రతికియున్నారు.

వార్సాలో మరియొక జ్యావర్తకుడు ఇరువదిమందినికన్నాడు. ముగ్గురు గతించిరి.

వార్సాకుసమీపప్రాంతముననుండు నొక వ్యవసాయదారురాలు నిన్నమొన్ననే యిరువదిమూడవ బిడ్డను గనినది.

వార్సానగరపు ప్రసిద్ధికెక్కిన యొకశిల్పి తన తలిదండ్రులకు పందొమ్మిదవవాడట. తండ్రికి అరువదిమూడవయేట బుట్టినాడట.

**సర్పశ్వాన సంగ్రామము :—**

లెగ్హారన్ నగరమున దక్షిణపు సముద్రతీరమున ప్రాఫులోనియా యను ప్రాన్తమునందు ఒక సమాధియొద్ద కొందరు ఉప్పరవాండ్రు పనిచేయుచుండిరి. అప్పుడించుమించు తోడేలువలెనున్న యొకకుక్కకును, పదియారుపాములకును ఘోరయుద్ధమై చివరకు కుక్క జయమొందెను. దానివివరములు చూచినవారు ఇట్లు చెప్పుచున్నారు.

ప్రాతసమాధులగేటుదగ్గర ఈకుక్క గడ్డిలో నేదోవెదకుచుండెను. అపుడకస్మాత్తుగా ఆరడుగుల పామొకటి సమాధినుండి వచ్చి కుక్కనెదుర్కొనెను. వెంటనే పాము దానిని కరచికరచి తల నోట నిరికించుకొనెను. తక్షణమే యొక సర్పప్రవాహము పాముమీదికిబారెను. శ్వానము యుక్తి, శక్తి, లాఘవములతో నొకదానితర్వాత మరియొకదానిని పరిమార్చెను. యుద్ధానంతరమున బడలికదీర్చుకొనుటకు గూరుచున్న కుక్కచుట్టు బదునారుపాములు పడియుండెను.

# పుష్పచయము

## జపానుదేశపు స్త్రీలు:—

"జపానుదేశము ఆసియాఖండములోని ఒక చిన్న స్వతంత్రరాజ్యము. హాలెండుదేశపు స్త్రీలవలెనే ఈదేశపుస్త్రీలును గొప్పఉన్నతస్థితికి వచ్చియున్నారు. లలితకళలు, నాటకములు, సంగీతము, నృత్యమన్న వీరికి ఉత్సాహముమెండు. ఆదేశమున వీరికి ప్రత్యేకనాటకశాలలు గలవు. ఇవి అమెరికాదేశపు నాటకశాలలను బోలియుండును. వీరు నాట్యశాలలోనున్నంతకాలము అమెరికాదేశపువస్త్రులు ధరించి, ఇండ్లకువచ్చినవెంటనే ఆబట్టలు మార్చి తమదేశీయవస్త్రములను ధరింతురు. వ్యాయామవిషయములయందును వీరి కెక్కుడుకౌతూహలము గలదు. టెన్నిస్, హాకి, బాస్కెట్‌బాల్, ఈదుట మొదలగుఆటలు వీరికి ప్రియతమమైనవి. 1930 సం॥లో ప్రెగ్‌పట్టణమున జరిగిన తృతీయాంతరరాష్ట్రీయక్రీడల (The Third International Sports) లో వీరు బహుమతులు బడసియుండిరి. ఇటీవల 'లారుఎంజెలస్' నగరమున జరిగిన ఓలింపిక్ పందెములలోకూడ ఇచటిస్త్రీలు ప్రఖ్యాతిగాంచిరి. ఈదేశములో స్త్రీవిద్యయెడల మిక్కిలి శ్రద్ధవహింపబడియున్నది. స్త్రీలకై కళాశాలలు విశ్వవిద్యాలయములు ప్రత్యేకముగా స్థాపింపబడియున్నవి. ఈవిద్యాలయములలో వైద్యవిద్య, పార్టుహాండు, టైపురైటింగుమున్నగునవికూడా నేర్పింపబడుచున్నవి. విద్యాలయములయందు చదువుమానిన పిమ్మట ఉపాధ్యాయినీత్వము, వైద్యవృత్తి, దంతవైద్యము మొదలగువృత్తుల నవలంబించుచున్నారు. పైవృత్తులలోనుండు స్త్రీలు జపానుదేశమున అధికసంఖ్యాకలై యున్నారు. 1930 సం॥ లో డాక్టరు కోకోపెనిశ్మురా అను స్త్రీకి వైద్యులందరికన్న గొప్పబిరుదప్రదానము జరిగెను. బీదకుటుంబములోని విద్యావతులుగాని స్త్రీలుమాత్రము దుకాణములు, టెలిఫోనుఆఫీసులు, కర్మాగారములు, వైద్యాలయములు మొదలగుచోట్ల చిన్నచిన్నఉద్యోగములలో నుందురు. కొందఱు స్త్రీలు పురుషులవలె ఉడుపులుధరించి మోటారుబస్సులలో కండక్టర్లుగాను, డ్రైవర్లుగాను పనిచేయుచుందురు. రైలులోనుండు భోజనాగారములలోకూడ పనిచేయుచుందురు. ఆదేశములో స్త్రీలకొఱకు ప్రత్యేకముగా వార్తాపత్రికలు నడుపబడుచున్నవి. వీటిలో పదిపత్రికలు విశేషప్రచారములో నున్నవి. కొన్నిటికి దాదాపు లక్షమంది చందాదారులుకూడా ఉన్నారు. 'జ్యోజిన్‌జిజుత్సు' అను సాహిత్యకళలకు సంబధించినపత్రిక స్త్రీలచేతనే సంపాదింపబడి ప్రకటింపబడుచున్నది. దినపత్రికలలో స్త్రీలకు సంబంధించినవిషయములు ఎక్కువగా ప్రచురింపబడుచుండును. ప్రతియొకదినపత్రికార్యాలయములోను స్త్రీలే విలేఖరినులుగానున్నారు. అచటిస్త్రీలు అట్టి ఔన్నత్యము సంపాదించినను వారికి రాజకీయరంగమున ప్రవేశమొసగబడలేదు. 1921 సం॥ వరకు రాజకీయసభలు చేయుటకుగాని, అట్టిసభలకు వెళ్ళుటకుగాని వారి కధికారము లేకుండెను. కాని ఆసంవత్సరమునందు జరిగిన పార్లమెంటులో పోలీసుచట్టము (Police Regulation) ను సవరించి వారి నీప్రతిబంధమునుండి విడిపించిరి. అప్పటినుండియు స్త్రీలు రాజకీయవ్యవహారములయందు అమందోత్సాహముతో పనిచేయుచున్నారు. రాజకీయవిషయములనుగుఱించి పత్రికలకు వ్యాసములు వ్రాయుచుందురు, అట్టిసభలలో నుపన్యసించుచుందురు. సభలలో ప్రస్తుతము వారియుపన్యాసములే మంచి విలువగలిగియున్నవి.

ఇప్పుడు జపానుదేశములో స్త్రీస్వాతంత్ర్యోపార్జనకై పాటుపడు మహిళాసంస్థలు అయిదుకలవు. శ్రీమతి ఫుసాయేఇచీకావాకన్య, శ్రీమతి శిజుయేఇసీమోడో అను స్త్రీలిద్దరు ప్రతిభాశాలినులగు అచటినాయికారత్నములు. 1930 సంవత్సరపు జనాభాలెక్కలప్రకారము అచటిపురుషులసంఖ్య 13730000 అనియు, స్త్రీలసంఖ్య 13563813 అనియు నిశ్చయింపబడినది. ఇట్లు ఇంచుమించు సమసంఖ్యాకలైయున్న స్త్రీలకుస్వాతంత్ర్యమిచ్చినచో తమనుత్రోసిరాజందురేమో యనుభయము ఎక్కువగానుండుటచే స్త్రీలకుస్వాతంత్ర్యమొసగువిషయమున పురుషులు వ్యతిరిక్తభావము కలిగియున్నారు. ప్రధానమంత్రియైన హేమో.హూచీగారు 1930 సంవత్సరపు పార్లమెంటుసభలో స్త్రీలకు స్వాతంత్ర్యమేగాక ప్రభుత్వోద్యోగములయందు ప్రవేశముసైత మొసగబడుటకు ఒకబిల్లును ప్రవేశపెట్టిరి. ఆబిల్లు ప్రతినిధులసభలో అధికసంఖ్యాకులచే ఏకగ్రీవముగా అంగీకరింపబడెను. కాని ప్రభువులసభలోమాత్రము వీగిపోయెను. అయినను స్త్రీలుమాత్రము ఈవిషయమున మిక్కిలి దీక్షతో పాటుబడుచున్నారు. శీఘ్రకాలములోనే పురుషులవలె వారుకూడ అన్నిహక్కులకు అధికారిణులగుదురని విశ్వసించుటకు తగిన ప్రబలాధారములు కనిపించుచున్నవి."

విశ్వమిత్ర—హిందీపత్రిక.

## వంగరాష్ట్రమున స్త్రీవిద్యాప్రచారము :—

"వంగదేశమునందలి ఉన్నతపాఠశాలాధికారులు "పాఠశాలలలో స్త్రీలకు ప్రత్యేకతరగతు లేర్పాటు చేయుటకో, లేక ప్రస్తుత మనేకకళాశాలలలో జరుగుచున్నట్లు, స్త్రీలకు పురుషులతోకూడ సంయుక్తవిద్యగఱపుటకో అంగీకరింపవలె"నని కలకత్తా విశ్వవిద్యాలయమునకు పంపినవిన్నపములనుబట్టి చూడ నీప్రాంతములో వనితాలోకమునందు సత్వరవిద్యాప్రచారమునకై అధికప్రయత్నములు జరుగుచున్నవని యూహించుట కవకాశముదొరకుచున్నది. విశ్వవిద్యాలయమువారు తాత్కాలికముగా స్త్రీలకు ప్రత్యేకతరగతు లేర్పాటు చేసి జనసామాన్యాభిప్రాయమునుబట్టి స్త్రీపురుషులకు సంయుక్తవిద్యగఱపువిషయమును నిర్ణయించుభారము పాఠశాలాధికారులకే వదలిరనియు తెలియుచున్నది. బాలబాలికలసంరక్షణకర్తలిందుకు భిన్నాభిప్రాయులు కాకుండుచో, విశ్వవిద్యాలయమువారు ఈరెండవమార్గమునకు అడ్డుపడరనియు, ఇదియే మంచి పద్ధతియనియు మేము అభిప్రాయపడుచున్నాము."

*Advance.*

## సంతాననిరోధకసంఘములు:—

"ఈవిషయమున అనేకులు నాతో నుత్తరప్రత్యుత్తరములను సాగించుచున్నారు. ఇతరులతో ప్రసక్తి లేక కేవలము నాయభిప్రాయ మిట్టి ముఖ్యవిషయమున నెట్టిదో లోకమున కెరిగించుట విధియనితలచి యట్లు చేయుచున్నాను. విచక్షణలేక యిష్టానుసారముగా సభలలోగాని, వార్తాపత్రికల మూలమునగాని యీవిషయమునుగూర్చి యుద్బోధింపరాదని నాముఖ్యాభిప్రాయము. ఏలయన ప్రజాసామాన్యమంతవివేకయుతమైయుండదు. కాబట్టి క్షయమొదలగుభయంకరదీర్ఘవ్యాధులచేగాని, దుర్భరదారిద్ర్యముచేగాని పీడింపబడుచు నికనెంతమాత్రమును సంతానముగనుటకు వలనుపడని కుటుంబములున్నవి; అట్టివాటిలో నాలిమగల విషయమును విధిగా వైద్యులే బోధించితీరవలయును. మరియు నీపని నెరవేరవలెనన్న మొట్టమొదట వెంటనే బాల్యవివాహములను కట్టిపెట్టవలెను. ఇది సరియైన కార్యము; వెంటనే ఫలమిచ్చునది. చిన్నతనమందే పెండ్లిచేసికొన్నవారికి సంతానము మెండనియు, మంచియౌవనమున వివాహితులైనవారి కంతయెక్కువగా సంతానముండదనియు వైద్యశాఖాధికారుల రిపోర్టులద్వారా తెలియవచ్చుచున్నది కదా! సంసారపుబాధ్యతలు బాల్యదంపతులకంటె యువకదంపతులు బాగుగా నెరుగగలరు. కాబట్టి యట్టివారి కీవిషయము చెప్పినను తలకెక్కును. కాని పిల్ల

పిచ్చుకలకు నచ్చదు. ముందున్న "మనుళ్ళపండగ"ను వారుచూడలేరు. యథార్థముగా నీవిషయము ఇంటి యొద్దనే తలిదండ్రులే తమబిడ్డలకు బోధింపవచ్చును. స్త్రీవిముఖత్వము, పవిత్రత, వివాహమందున్న పరమార్థము మొదలగునవి. కానిదురదృష్టవశమున మనదేశమందే కాదు ప్రపంచమునందంతటనుగూడ నొక్కయాడుదానికి మాత్రమే పతిభక్తి, పాతివ్రత్యము, పతిదేవతాభావము మున్నగువిషయములు చర్వితచర్వణముగా బోధింపబడుచున్నవి. కాని మగవాని కీవిషయమున ననుకూలముగనుండు బోధనలు చేయబడుటలేదు. మిాదుమిక్కిలి కొందరు పెండ్లివద్దని తమబిడ్డడెవడైన మాటవాసికన్నను వానిని పడతిట్టుదురు. అసద్బ్రహ్మచర్యము లేక ఇంద్రియసుఖానురాగమును ఆడుపిల్లకెంత దుఃఖకారణములో మగపిల్లవానికినంతే దుఃఖదాయకములని తలిదండ్రులకు బోధింపవలయును: అంతేకాదు. సద్బ్రహ్మచర్యము శమదమములును స్త్రీలవలె పురుషులును సాధించుటవలన ఆయురారోగ్యాభివృద్ధినొందుటయు దానివలన మంచి కండపుష్టిగలజాతి యేర్పడుననియు సామాన్యపురుషలోకమునకుగూడ బోధింపవలెను. ఇకముందు తలిదండ్రులు కాగలవారికి జీవితమందలి యీయుత్తమాంశయముల తరిఫీదుచేయుట యనుపని యిండ్లకడను పాఠశాలలోనుగూడ ముఖ్యముగా నుండవలయును. అయిన ప్రస్తుతమందు బాధనొందుచున్నవారిగతి యేమి? వారి నెట్లుద్ధరించుట? యనునది ముందారయవలయును. ఇదివరకే పలువురు బిడ్డలున్నప్పటికిని–గర్భస్రావములైయున్నప్పటికిని—ఆయిల్లాలియారోగ్యము బొత్తుగా చెడియున్నప్పటికి —ఉన్నపిల్లలైనను కూడులేక మాడుచున్నప్పటికిని ఆయజమాను డింద్రియనిగ్రహ చేసుకొనలేక యింకను బాహ్యతాజ్ఞానశూన్యుడై వ్యవహరించుచున్నాడు!! పాప మాయిల్లా లేమిచేయగలదు? "అర్థం ప్రాణం ఆచార్యాధీన"మని యూరకుండవలెనేకాని "యిది మంచిదికాదయ్యా" యనిచెప్పుట కామె కధికారము లేశమైన లేదుకదా!! ఇదిగో యిటువంటివారికి వైద్యులు సంతాననిరోధకోపాయములు చక్కగా నుపదేశింపవలెను. మరియు కష్టజీవులగు దరిద్రులున్నారు. వీరిలో నాడుది బహుసంతానమువలన బాధనొందుచున్నది. ఆమగవాని కదియంతయు పట్టదు సరేకదా మిాదుమిక్కిలి తాను గడించుకొన్నది త్రాగుడుక్రింద తగులబెట్టును. ఇక నాయాడుది పుట్టియున్నవారిని, పుట్టనున్నవారినిగూడ బెంచుకొనుటకు చెప్పనలవిలేని కష్టము పడుచుండును. కాబట్టి యిట్టిదానికిగూడ గర్భనిరోధకసాధనములగూర్చి లేడీడాక్టరులు చెప్పవలెను. సంతాననిరోధనకై, ఆత్మనిగ్రహ ముత్తమమైనదనియు, ఉపకరణములు ప్రకృతివిరోధములనియు, నిగ్రహమువలన విశేషించి బుద్ధికి పారమార్థికజ్ఞానోన్నతి కలుగుననియు మనము ఋజువుచేసికొనుట లెస్స. సంతానమే సంయోగమునకు పరమార్థము. ఇట్టి పరమార్థరహితమగు సంయోగలాలసతవలన, ముప్పుకలుగుట తప్పదు. మరియు, మగడా విడచినాడు–లేక దివంగతుడైనాడు: పిల్లలా గంపెడుమంది: దిక్కా యెవరును లేరు! ఇట్టిచో నాపిల్లలను బెంచుటకై పౌరులకడ దేహియని చేయిచాచు దీనురాండ్రను మనము చూడని దినమే యుండదుకదా!! హిందూసంఘములో నిట్టి దీనురాండ్రను జూచి మిగిలినవారు బుద్ధితెచ్చుకోవలెను. ఆడుపిల్లలకుగాని మగవారికిగాని, తమంతదాము బ్రతుకగలశక్తి వారికివచ్చునంతవరకు, నెంతమాత్రము పెండ్లి చేయరాదని; అథవా ఒకపు డట్లుచేసినను, తత్సంతానము, తలిదండ్రులలో నెవరుచచ్చినను, దిక్కుమాలి ముష్టికి బయలుదేరకుండునట్లు, ఆదంపతులు తమజీవితములను భీమాచేయించుకొనుట మంచిది.

అనాథలగు నిట్టి దీనురాండ్రకొరకును, బాలబాలికలకొరకును తగినన్ని శరణాలయములు మదరాసువంటి మహానగరమునందే లేవు. ఆయున్నవియును మిక్కిలి క్రిక్కిరిసియున్నవి. దినదినాభివృద్ధినొందుచున్న యిట్టి దీనజనసంఖ్యనుగూర్చి యేమిచేయుటకును తోచదు. ప్రభుత్వమువా రావైపునకు జూడుమన్నను జూడరు సరేకదా, నోరెరుగని పసికూనల కితరదేశములలో దొరకుచున్న సహాయముపాటియైనను చేయరు. ఇతరదేశములు సైనికకార్మికవర్తకప్రయోజనమునకై, ప్రజాభివృద్ధి కావలయుననుచుండ మనదేశము మొర్రో వద్దనుచున్నది: ఈయున్నవారే యెక్కువ: వీరికే వృత్తులులేవు. అనేకులు కూటికిలేక అన్యదేశములకు వలసబోవుచున్నారు. పుట్టిచచ్చినవారును, ఎదిగిచచ్చినవారును, కల్లరా మలేరియా ప్లేగు మొదలగు భయంకర జాడ్యములలో జచ్చినవారును, లక్షోపలక్షలుపోగా యింకను సం॥ 1921 రం జనాభాకంటె నిప్పుడు 25 కోట్లమంది యెక్కువ!! కాబట్టి శారదాశాసనము ప్రత్యక్షరము నమలులోపెట్టి వివాహవయస్సు నింకను పైకి

నెట్టవలయునని నేను ఘట్టిగా జెప్పుచున్నాను. మరియును, గంపెడుపిల్లలుగల కళత్రశూన్యులు, కళత్రవంతు లనిపించుకొనుటకు, మరల, తమకూతులకంటె జిన్నవయసువనుండు బాలికలను బెండ్లియాడుటయన్న నాకు కేవలము రోత. మరియు, జితేంద్రియత్వము, స్త్రీవిరాగము, బ్రహ్మచర్యము మొదలగు మహత్తరవిషయములగూర్చి బాలబాలికల కింటియొద్దదలిదండ్రులును పాఠశాలలలో బోధకులునుగూడ లెస్సగా బోధింపక తీరదనియు జెప్పుచున్నాను. పౌరాణికులగు హనుమంతుడు భీష్ముడు నేటివారగు వివేకానందస్వామి, సర్ పి.సి. రే. వాస్వానిగారలవలె ఆజన్మబ్రహ్మచర్యవ్రతమును పూనుమనియు కొంతమంది స్త్రీపురుషులను గోరుటకు సాహసింతును. మరియు సుఖలాలసుడై, తాను సుఖపడుటకంటె, భార్యాపుత్రులారోగ్యవంతులైయుండుట కధికతరచింత గలిగియుండుమని యాలుమగలలో ముఖ్యముగా మగవానికి జెప్పుదును. ఇవియన్నియు నైనతరువాత చివరకు నిక నుపకరణప్రమేయము రావచ్చును. అదియైనను సరియైనవైద్యుల మూలముగా తదుపయోగవిషయములు బోధింపబడవలయునేకాని యనవసరముగా వార్తాపత్రికలమూలమునను, సభలలో నవ్యత్వన్నులతోడను ప్రసంగించుట కూడదని నాయభిప్రాయము" — డా. ముత్తులక్ష్మిరెడ్డి

## 1932 లో మహిళా విజృంభణములు:—

ఇదివరకును కేవలము పురుషులే సాధించుచుండిన పెద్దపెద్దపనులను 1932-లో స్త్రీలు సాధించి కీర్తి గాంచిరి. వాయువిమానమునం దిదివరలో శ్రీమతి జె. ఎ. మోల్లిసన్ సతిగారగ్రగణ్యులైయుండిరి. ఆమెను క్రిందు చేయుచు, గతసంవత్సరారంభమున అమెరికాదేశీయురాలును సుప్రసిద్ధురాలగు విమానగామినియునగు శ్రీమతి జి. పి. పుట్నన్ సతిగారు ఒంటరిగా అట్లాంటిక్ మహాసముద్రము మీదబడి న్యూఫౌండ్లాండునుండి ఐర్లాండుకు విమానయానముజేసెను. పదమూడున్నరగంటలకాలములో ఇంతస్వల్పకాలములో ఈమహాయాత్ర నిదివరకెవరును చేసియుండలేదు!! శ్రీమతి ఫిలియప్పా పారీమార్టిన్ సతిగారు వైద్యశాస్త్రములో నత్యుత్తమపట్టము (Master of Surgery) ను బడసిరి ఇంగ్లండుదేశమంతటిలోను ఈగొప్ప పరీక్షనిచ్చియున్న స్త్రీలు ఆరుగురే! శ్రీ పుట్నన్ సతీమణి వీరినీపరీక్షలో మించుటయేగాక 'యీపరీక్షతోనే "F. R C. L." పరీక్షను గూడవచ్చి జయమొందినది. ఇట్లేకకాలమున రెండు గొప్పగొప్పపరీక్షల నిచ్చియుండిన స్త్రీలింతకు మున్నెవ్వరును లేరు. ఈమె ముగ్గురుబిడ్డలతల్లి. ఒకవంక సంసారమును నిర్వహించుచు వేరొకవంక నున్నతవిద్యాభ్యాసము సులువుగా చేయవచ్చునని యీమెవాదము. మరియొక కుటుంబిని యిద్దరుబిడ్డలతల్లి శ్రీమతి ఎ. జి. హారిసన్ సతి, చారింగ్ క్రాస్ హాస్పిటలులోనైన వైద్యపరీక్షలలో ప్రథమబహుమానముల గడించినది. మరియొకకన్యకామణి ఎడిత్ బాధరెస్టుఅనునామె సంగీతమునందు Doctor Music అను బిరుదమును లండను విశ్వవిద్యాలయమందు సంపాదించినది. ఇంతవరకును స్త్రీలకీబిరుద మీయబడియుండలేదు. ఈకన్య మొదట డర్హాంయూనివర్సిటీలో సంగీతమందు పట్టభద్రయైనది. ఆవెనుక డాక్టరు బిరుదపరీక్షకు వెళ్లదలచియుండ నడుమనైదేడుల వ్యవధియుండక తప్పదను యూనివర్సిటీసిద్ధాంతము ఈమె కభ్యంతరముగవచ్చెను. అంతటి దీర్ఘకాలయాపన చేయుట కిష్టపడక యీమె లన్డనుట్రునిటీ కాలేజీలో సంగీతమహోపాధ్యాయుడగు డాక్టర్ ఓల్డ్ రాయిడ్ అను నాతని నాశ్రయించి రెండేండ్లకాలముననే డాక్టరుబిరుదపరీక్షనిచ్చెను. బ్రిటిష్ మోటారు పందెములలో శ్రీమతి ఇ. విస్డమ్ సతియు జోన్ రిచ్మాన్డ్ కన్యకయు ననునిద్దరుస్త్రీలే ప్రథమబహుమానముల నొందిరి. ఇట్టి పందెములందు పురుషులను హోరాహోరిగా నెదుర్కొని యీయిద్దరును బ్రూక్లాన్డ్సనందు వేయిమైళ్ళపందెములో సగటున గంటకు 84-14 మైళ్ళచొప్పున పందెముగెలిచిరి. ఇంతలో 23 మోటార్లు పందెమునకు వచ్చియుండెను. వాటియందు ఏడుబండ్లుమాత్రమే కాలమితి (Time limit) నిలబెట్టుకొనగలిగినవి. ఇక విద్యాభ్యాసమునందో!! బార్బరాప్లవర్ అనునొకయిరువదేడులకన్నియ ఆక్స్ఫర్డ్ లో అన్డర్ గ్రాడ్యుయేటు, లాటిన్ గ్రీకుభాషాపరిజ్ఞానమునకై నియమితమైయున్న క్రేవెన్ స్కాలర్షిప్ (Craven Scholarship )ను సంపాదించుకొనెను. ఇంతకుముందీ విద్యార్థివేతన మాడువారికీయబడలేదు. దీనికై పోటీచేయగలుగుపాటిశిక్షను స్త్రీలు పొందరని యొక చాదస్తపునమ్మకము; కాక దానిని పోగొట్టిన దీకన్యక. ఈమెగాక మరియు యామెయు నీపోటీపరీక్షకు వచ్చియుండెను. నెండియు న్యాయశాస్త్ర పరీక్షలయందును స్త్రీ పురుషుని తోసిరాజు చేయుచున్నదనుటకు కాథరిన్ రష్వర్త్ అను కన్యయేనిదర్శనము.

# డైరి

## జనవరి

20:—బొలాసూరు. సమరసభకు 24 వ నియంతయగు శ్రీమతి హరమోహినీదేవిగారు అరెస్టుచేయబడిరి.

:—బొంబాయి. శ్రీమతి విఠలభాయి సర్దేశాయికన్య అరెస్టుచేయబడినది.

22:—నర్సాపురంతాలూకా అస్పృశ్యతానిర్మూలనసంఘమహాసభయందు శ్రీమతులు డి. రామలక్ష్మమ్మ బి. మంగాయమ్మగార్లు ఉపన్యసించిరి.

:—ఏలూరు. ఘోషాఆస్పత్రిని నిర్మించవలెనను తీర్మానమేకగ్రీవముగా నామోదింపబడెను.

26.—డిల్లీ. శ్రీమతి లక్ష్మిదేవిగారు అరెస్టుచేయబడిరి.

:—మీరటు. శ్రీమతి పరమేశ్వరీదేవిగారు అరెస్టుచేయబడిరి.

:—పాట్నా. బాబు రాజేంద్రప్రసాదుగారి భార్యయు, సోదరియు అరెస్టుచేయబడిరి.

:—శ్రీమతి నికీదేవిగారు అరెస్టుచేయబడిరి.

: —అధికసంఖ్యాకలుగ స్త్రీలు ఉత్సవముసలిపిరి.

28:—పాట్నా. శ్రీమతి రాజేంద్రప్రసాదుసతిగారును, శ్రీమతి భగ్వంతిదేవిగారును మొన్న అరెస్టుచేయబడి నేడు విడుదలనొందిరి.

:—శ్రీమతులు బీరాదేవియు, రామానందశర్మగారిభార్యయు అరెస్టుచేయబడిరి.

29:—అహమ్మదాబాదు. శ్రీమతీ కస్తూరీబాయిగాంధిగారు ఇచటినుండి కెయిరామండల సంచారార్థము బయలుదేరిరి.

## ఫిబ్రవరి

1:—కాకినాడ. శ్రీయుత గాడె శివరావుగారి యాధిపత్యమున శ్రీ. సూరపరాజు సూర్యనారాయణమూర్తి గారును, వారిభార్యయగు శ్రీమతి సుందరమ్మగారును తమ వితంతుకుమార్తెయగు చి.సౌ. కమలమ్మను శ్రీయుత మంతి విశ్వంబరరావుగారి కిచ్చి వివాహముజేసిరి.

:—ఢక్కా. తమపుత్రుడగు కాళీపాదముఖర్జీగారికి, ఉరిశిక్ష విధింపబడుటవల్ల క్షమింపవలెనని శ్రీమతి శైలబాలాదేవిగారు శ్రీ రాజప్రతినిధిగారికి చేసుకొన్న విన్నపము నిరాకరింపబడినది.

:—అలహాబాదు. జిల్లాజడ్జీగారిచే సం 5 లు శిక్షింపబడిన శ్రీమతి జాఫర్ఆలీగారి అపీలులో క్రిందికోర్టు తీర్పు ఖాయాపరుపబడెను.

2:—నర్సాపురం. సబ్‌కలెక్టరుగారి సతీమణియగు శ్రీమతి మీనాక్షమ్మగారియాధిపత్యమున స్త్రీసంఘ వార్షికోత్సవము జయప్రదముగా జరిగెను.

:—పాట్నా. పాట్నాజిల్లాకు డిక్టేటరుగానుండిన శ్రీమతిచంద్రావతీదేవిగారికి 15 నెలల శిక్ష విధింప బడినది.

కలకత్తా, శ్రీమతి నళినీప్రవబంధారీగారికి 6 వారములశిక్ష విధింపబడెను.

:—ధార్వారు. శ్రీమతులు దుర్గి, పార్వతీ, రుక్మిణీబాయిగార్లు అరెస్టుచేయబడిరి.

3:—కలకత్తా. శ్రీమతులు చర్చలదేవి, సేకనదేవి, కుసుమకుమారీదేవిగార్లు మున్నగు పదిమందియువతులు అరెస్టుచేయబడిరి.

4:—వేలూరు. మద్రాసుకు ఏడవనియంతయగు శ్రీమతి శకుంతలాబాయిగారు విడుదలనొందిరి.

5:—మదరాసు. సేవాసదనమున శ్రీమతి లక్ష్మీదేవిగారికిని హెచ్. కృష్ణమూర్తిశర్మగారికిని వివాహమైనది. వరుడు 20. వధువు 18 సం॥లు.

:—మద్రాసు. శ్రీమతి గ్లాడస్ అను నాంగ్లయువతి ఆర్యసమాజముల జేరి శ్రీయుత టి, ఆర్. సుందరం గారిని వివాహమాడెను.

:—పెదపులివఱ్ఱు (రేపల్లె తాలూకా)
రాత్రి రెండుగంటలకు కోటయ్యచౌదరీగారి యాజమాన్యమున శ్రీమతి శాంతోషణ్ అను క్రైస్తవ బాలిక హిందూమతము స్వీకరించి నిమ్మగడ్డ రాఘవయ్య యను హరిజనుని బెండ్లియాడెను.

6:—లాహోరు. సుప్రసిద్ధకాంగ్రెసుప్రచారకురాలగు శ్రీమతి నిమూదేవిగారికి లాహోరు, అమృతసరు, జోషియర్పూరు లాల్పూరు జిల్లాలకు రావలదని నిషేధపుటుత్తరవు లీయబడెను.

7:—పెదపులివఱ్ఱు. శ్రీమతి సముద్రాల వేంకటనరసమాంబగారు మాలపల్లియకు జని ఆరోగ్యనీతిధర్మోపన్యాసముల జేసిరి.

8:—విశాఖపట్టణము. శ్రీమతి ఉగుమర్తి జానకీబాయిగారు రాయవేలూరుజైలునుండి విడుదలయ్యి విశాఖపట్టణమునకు వచ్చిరి.

12:—శ్రీపిఠాపురంమహారాణిగారు స్వర్గస్థులైరి.

# గ్రంథపరిచయము

## శ్రీకృష్ణభారతప్రాశస్త్యము:—

నిజామురాష్ట్రాంతర్గత జటప్రోలుసంస్థానపు రాజధానియగు కొల్లాపురమునందలి శ్రీరాజా వేంకటలక్ష్మారాయ మిడిల్‌స్కూలునందు ప్రధానోపాధ్యాయులైన బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు బి. ఏ గారిచే రచింపఁబడినది. గ్రంథనామమే యిందలివిషయమును తెలుపుచున్నది. కవిత్రయాంధ్రీకృతభారత మొండుండ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు 'శ్రీకృష్ణభారత' మనుపేర మఱల నొకటి రచింపనేల? రచించిరిపో యిది కవిత్రయభారతమంత రసవంతముగ నుండఁగలదా? యను నభిప్రాయ మాధునికాంధ్రవిద్వల్లోకము నావరించియున్నదని యెఱిఁగి యాగ్రంథకర్తగారట్టిసందేహముల క్రింద సమాధాన మిచ్చుచు "శ్రీకృష్ణభారత మాద్యంతము నోపికవహించి ప్రతిఘట్టమునందును నన్నయాదిభారతపద్యగద్యరచనలతో సరిపోల్చిచూచిన, నన్నయాదులపోకడలను ధిక్కరించునని చెప్పనక్కఱలేదుగాని, యించుమించువారి కవితానైపుణ్యమునకు వెనుదీయదని చెప్పవచ్చు"నని వ్రాసియున్నారు. మఱియు శ్రీ శాస్త్రిగారి రచనాసామర్థ్యము నుగ్గడించుచు "వీరిసామర్థ్యమును బ్రత్యేకించి చెప్పనక్కరలేదుగాని, పెద్దవిషయమంతయుఁ జిన్నపద్యమునందును, చిన్నవిషయమంతయుఁ బెద్దపద్యమునందును బొందుపఱచు గొప్పశక్తి వీరికిఁ గల"దని చెప్పి యొకేసందర్భమున కవిత్రయమువారు వ్రాసిన పద్యములను, శ్రీ శాస్త్రిగారు వ్రాసినపద్యములను జదువరులు పోల్చిచూచుటకై యాగ్రంథకర్తగారిచే సంగ్రహింపఁబడిన 'భారతసాదృశ్యములు' అనుగ్రంథమునుండి స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నిఁటిని ప్రదర్శించియున్నారు.

వీనిని బట్టిచూడఁ గవిత్రయభారతమునకన్నఁ గృష్ణభారతము మిన్నయనుటగాక యిది యేవిషయమునను బూర్వభారతరచనమునకు వెనుకఁబడలేదనుటయే వీరి యభిప్రాయమని తెలియనగును.

భారతాంధ్రీకరణమునందుఁ దత్కృతికర్తగారు పొందిన కష్టసుఖములన్నియు నిందు విశదముగా వివరింపఁబడినవి. అభిప్రాయభేదములకేమిగాని పూర్వకవులకువలెఁ "దగినంత మిత్రబలమైనను అర్థబలమైనను వాక్సహాయమైనను, ప్రోత్సాహమైనను లేక పావనగౌతమీనదీజలంబులఁ ద్రాగి యిట్టి మహాకావ్యమును దీక్షబట్టి పదునైదేండ్లలో వ్రాసిముగించి యాంధ్రసారస్వతప్రపంచమునకుఁ జేసిన మహోపకారమునకై యాంధ్రదేశము శ్రీవారికి కృతజ్ఞతజూపకతప్పదు. "ఈనాడు విద్యాగంధమెఱింగిన రాజరాజనరేంద్రుని వంటి రాజశేఖరుండును, కవితాసారమెఱుంగు శ్రీకృష్ణదేవరాయలవంటి నృపపుంగవుడును, కవితారసజ్ఞుండగు భోజరాజువంటి సత్ప్రభువును నుదయించినచో మనకవిగారికి...బ్రహ్మరథము పట్టకపోదురా?" అను వీరిభావము సత్యసమీపము. స్నేహలతా కవితాసంఘమున కధ్యక్షులై యీవిధముగ భాషాసేవ సేయుచున్న యీగ్రంథకర్తగారెంతయు ప్రశంసాపాత్రులు. ఎల్లరుఁ జదువఁదగినది.

క్రౌనుసైజు 22 పుటలు. వెల తెలియదు. గ్రంథకర్త కొల్లాపురం, మురవకొండపోస్టు, అని వ్రాయనగును.

**మిలన్:—**

శ్రీ రామనరేశత్రిపాఠిగారి హిందీకావ్యమునకు అష్టావధాని శ్రీయుత కాళహస్తి వేంకటనరసింహరావుగారి భాషాంతరీకరణము. ఐదుఉల్లాసములు గలవి. దేశభక్తిప్రబోధకమైన దివ్యగాథ యిందలివిషయము. భాషాంతరీకరణమేయైనను స్వతంత్రగ్రంథమువలెనున్నది. రసము, ఔచితి, ధారాశుద్ధియు మనోహరములై యున్నవి. ప్రతిదేశీయుఁడును చదివితీరవలయునని మాయభిప్రాయము.

క్రౌనుసైజు 53పుటలు. వెల తెలియదు. తెనాలి ఆంధ్రముద్రాక్షరశాలయందు ముద్రితము.

**పద్మినీపరిణయము:—**

శ్రీమతి చిలకపాటి సీతాంబావిరచితమును శ్రీవాగ్వల్లీగ్రంథమాలాసప్తమప్రచురణమునునైన యీ గ్రంథరాజము మాకార్యాలయము నలంకరించినది. ఈకావ్యమునుగూర్చి మ. రా. రా. శ్రీ ఒంగోలు వెంకటరంగయ్యపంతులుగారు వ్రాసిన విమర్శనము స్థలాంతరమందుఁ బ్రచురింపఁబడియున్నది. కాఁబట్టి మేము వేరే వ్రాయలేదు.

క్రౌనుసైజు 95 పుటలు. వెల 12 అణాలు, వాగ్వల్లి కార్యస్థానము రంగనాయకులపేట, నెల్లూరు.

**నవ్వగలవా? (మొదటిభాగము)**

శ్రీ. కాంచనపల్లి వెంకటరంగారావుగారు వ్రాసినది. మేము నవ్వలేకుంటిమి. 1 కి 16 డెమ్మీసైజు 13 పుటలు. వెల 0-0-9 మాత్రం. గ్రంథకర్తగారికి బరంపురం గంజాంజిల్లాకు వ్రాయనగును.

**ప్రకృతిప్రకాశికా తోహరాముక్తావళి:—**

శ్రీ. రామానంద కృష్ణరాయ విజాపూర్కర్ గారు వ్రాసిన ప్రకృతిస్తోత్రము. ముముక్షువులగు స్త్రీపురుషులకు మిక్కిలి వినోదకరముగఁ బాడుకొనదగియుండును. 23 తోహరాలున్నవి. 1 కి 16 డెమ్మీసైజు 16 పుటలుగల చిన్నపుస్తకము. విశ్వాసమే దీనికివెల.

చిరునామా:—గ్రంథకర్త 185 బ్రాడ్వే మద్రాసు.

**ఆవేదన:—**

శ్రీయుత మల్లాది చంద్రశేఖరరావుగారు వ్రాసినది జాయావియోగదుఃఖ మెటులుండునో దీనివలన దెలియవచ్చును.

1 కి 16డెమ్మీసైజు 14 పుటలు వెల 0 2 0 చిరునామా:—గ్రంథకర్త. విజయవాడ. (Bezawada)

**భగ్నకుంభము:—**

శ్రీయుత టి. యల్. అహోబలరావుగారి యాంగ్లనాటకమననుసరించి శ్రీయుతచిట్టూరు సత్యనారాయణచౌదరిగారు వ్రాసిన ఏకాంకనాటకము. ధనాంధులగు మిల్లుయజమానులవలన నిరుపేదలగు కూలివాం డ్రెన్నిబాధలు పడుచున్నారో అదియెల్ల విశదీకరింపబడినది. ఏమాత్రపు దయయున్నజనులు కంటనీరువచ్చును. డెమ్మిఆక్టేవు 12 పుటలు. వెలలేదు. గుంటూరు ఆర్యవైశ్యముద్రాలయమునముద్రితము.

**హరిజనులపాటలు:—**

శ్రీయుత గరిమెళ్ల సత్యనారాయణగారు బి. ఏ.; సమయానుసారముగా గ్రహించి వ్రాసిన వీపాటలు. సత్యనారాయణగారినిగూర్చి మేము వ్రాయుట చెంగల్వకు జేగురుపూత! జనసామాన్యమున కెట్టిగాన మావశ్యకమో అట్టిది వీరికవితయందున్నది. సరిగమ లక్కరలేదు. తాళములకై తన్నుకోబనిలేదు. మనుష్యుని నడకయందున్నగతియే యీగీతము లందుండును. ప్రాకృతజనులకు పరమాన్నమువంటిదీపాట. దేశమును దలక్రిందులు జేయగలిగిన దిట్టిపాటయే. కాబట్టి అందరును దీని నామోదింతురుగాక. డెమ్మీ ఆక్టేవుసైజు 18 పుటలు. వెల 0 2 0 గ్రంథకర్త, 5 కచ్చేరీలేన్ మైలాపూర్, మద్రాసు.



గద్వాలరాణీగారికి నూత్నాధికారములు :—

నైజామురాష్ట్రములోని సంస్థానములలోనెల్ల గద్వాలుసంస్థానము గొప్పదనిచెప్ప నొప్పును. ఈసంస్థానపు సంవత్సరపురాఁబడి దాదాపు 12 లక్షలు. సంవత్సరమునకు 80 వేలు కప్పముచెల్లించును. ఈసంస్థానాధిపతులైన శ్రీ శ్రీ శ్రీ మహారాజా సీతారామభూపాల రావుబహద్దరుగారికి పురుషసంతతి లేకపోవుటచే 1929 లో శ్రీవారినిర్యాణానంతరము నైజాము ప్రభుత్వమువారు సంస్థానమును 'కోర్టు ఆఫ్‌వార్డ్సువారి' యధీనమునయుంచిరి. శ్రీ శ్రీ శ్రీ మహారాణి ఆదిలక్ష్మీదేవమ్మగారు నైజాముప్రభుత్వమువారికి విన్నపములు పంపుకొనగా వారు మహారాణీగారిని సంస్థానపువారసురాలుగా నంగీకరించి కొన్నినిబంధనలకులోఁబడిన స్వాతంత్ర్యమునిచ్చుచు 1928 వ॥ సం॥ ఫిబ్రవరి 19వ॥ తేదీన ఒక ఫర్మానాను శ్రీ మహారాణీగారికి పంపియుండిరి. అందులోనిముఖ్యమైన నిబంధన లెవ్వియన. (1) నిజాముప్రభుత్వమువారితరపున పంపబడిన ఒకరాజకీయోద్యోగి రాజ్యపరిపాలనమునందు శ్రీమహారాణీవారికి సహాయముచేయుచుండును. (2) సంవత్సరాదాయపు లెక్కలను ప్రభుత్వమువారి రెవెన్యూశాఖాధికారులు పరిశీలించుచుందురు. ఘనతవహించిన నైజాముగా రంగీకరించినయెడల నైదుసంవత్సరములకు పిమ్మట నిట్టిపరిశీలన ఆపివేయఁబడవచ్చును. (3) సంస్థానమంతయు ప్రభుత్వమువారిచేఁ గొలిపింపబడుచుండును. (4) దత్తపుత్త్రునివలన రాజకుటుంబము పునరుద్ధరింపఁబడవలెనన్నచో శ్రీమహారాణీగారి కుమార్తెలలో నొకరిపుత్త్రునే దత్తస్వీకారము చేసికొనవలయును. వేఱొకని స్వీకరింపవలెనన్న ప్రభుత్వమువా రంగీకరింపవలెను." సర్వేశ్వరునికృపచే శ్రీమహారాణీగారి జ్యేష్ఠపుత్రిక కిప్పుడొకపుత్త్రుఁడుద్భవించినాఁడు. ఈబాలుఁడు దోమకొండయువరాజులగు శ్రీరాజాసోమేశ్వర రావు బహద్దరువారి పుత్రరత్నము. వీరిపుట్టుకచే నైజాంప్రభుత్వమువారు న్యాయవిచారణయందుతప్ప మిగిలిన సర్వాధికారములను గద్వాలసంస్థానమునకు ఈనడుమ దయచేయించి యున్నారు. ఇందులకు మాహృదయపూర్వకసంతోషమును వెలిబుచ్చుచు శ్రీమహారాణీగారికిని శ్రీవారిమనుమలును, గద్వాలయువరాజులునగు శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణరావు

బహద్దరువారికిని స్థిరతరాయురారోగ్యైశ్వర్యములు కృపసేయుగావుతమని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

**నగరమునవ్యభిచారవ్యాపారనిర్మూలనము :—**

"ఒకసంవత్సరమున 126 వ్యభిచారవ్యాపారగృహముల తొలగింపగల్గితిమి. అయినను ఇంకను నెరవేర్చవలసినపని యెంతయోకలదు. ఈ సంస్కారమును నిర్వహించుటకుగాను సాంఘికసేవాపరాయణలగు స్త్రీలు ముందుకురావలెను. ఈయుద్యమముయొక్క విజయమంతయును వారిపై నాధారపడియుండును." అని విజిలెన్సుసంఘమువారి కార్యనివేదికలోనున్న యీవాక్యములనుజూడ నెంతయో సంతోషముగల్గుచున్నది. నిజమారయ భరతభూమికి నస్పృశ్యతకంటె నీవ్యభిచారము, ఎన్నోమణుగు లధికతరకలంకము గూర్చుచున్నది. ఈదుర్వృత్తిని నిర్మూలనముచేయుట, ఒక్కనగరమందేకాక దేశమంతటను ప్రారంభింపవలసియున్నది. పైనివేదికయందు చివరనున్న రెండువాక్యములను మరియొకతూరి గమనింతురుగాక !! ఈ మహాసభాధిపత్యము వహించియుండిన శ్రీ గవర్నరుగారును "ధైర్యమును పట్టుదలయు, మానవసేవాభిలాషయుగల స్త్రీలు ముందుకువచ్చి కార్యభారమును వహించెదరని యాశించుచున్నాను" అని వక్కాణించియుండిరి.

**పురుషులిదిగమనింపవలసియున్నది :—**

"పురుషులలో చాలామంది స్త్రీవిద్యనుగురించి ప్లాటుఫారములనెక్కి యుపన్యసింతురేగాని అటుల నాచరించువారు బహుకొద్దిమంది పురుషులురాగా వారిలో శతాంశమైన స్త్రీలు సభలో లేకుండుటయే దృష్టాంతము" అని నర్సాపురప్రాథమికోపాధ్యాయసభ వక్తృత్వపోటీపరీక్ష కరుదెంచియుండిన శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు వాకొనిరి. నేటమాటలకు టీకయేల ? దీనికి మావ్యాఖ్యాన మనవసరము. తథాపి యొకమాట వ్రాయవలసివచ్చుచున్నది. స్త్రీవిద్యావ్యాప్తికి పురుషులమీదనే యాధారపడియుండవలసినకాలము దాటినది. సంఘమున ఛాందసులు చాలవరకు తగ్గిపోయిరి. సర్వతోముఖవ్యాప్తి నొందుచున్నదికదా స్త్రీయుద్యమము !

**చెన్ననగరసంగీతపరిషత్తు కార్యనివేదిక :—**

సం 1931-32 రపు పరిషత్కార్యనివేదిక మాకార్యాలయము నలంకరించినది. ఏటేటను ఏనవరాత్ర్యుత్సవసందర్భముననో కొన్నిసంగీతసభలు చేయుటచేతనే తృప్తినొందియూరకుండక ఈపరిషన్మహాజనులు నగరమునందచ్చటచ్చట పాఠశాలలనేర్పరచి విద్యార్థులకు క్రమమైనశిక్ష నిప్పించుచున్నారు. ఈవిషయమున నాంధ్రదేశము తగినంత యుత్సాహము గలిగియుండకుంట విచారకరము. రా॥సా॥ శ్రీయుత డా॥ యు. రామారావుగారు, అరవవారు ఆంధ్రులు అను భేదదృష్టిలేక కేవలగుణగ్రహణపారీణులై యిరుతెగల విద్వాంసులకును ప్రోత్సాహమిచ్చుచుండుట ప్రశంసాపాత్రమగు విషయము.

మానసంరక్షణార్థము మహిషాసురమర్దనియైనది:—

సోదరీమణులారా, మీయొడళ్లుపులకరింపచేయునట్టి యొకవిషయము మీయెదుటఁ బెట్టఁగలిగినందుకు సంతోషము కలుగుచున్నది. డక్కాప్రాంతములందు కంటాహాటి యను నొకగ్రామమున సుఖదేవి సూత్రధర్ అనునొక యిరువదియైదువత్సరములయువతి నివసించుచున్నది. పాపమీమె వితంతువు. దక్షతికెవరును మగవారులేరు. ఒక్కతల్లిమాత్రమే యున్నది. ఆమెయైనను బ్రహ్మచెవుడు. రాతిమూగ ఉండినను లేకున్నను ప్రయోజనమొకటియే. ఒకనాటిరాత్రి షంషుద్దీన్ అనునొకమహమ్మదీయుఁ డీమెకుటీరముమీద నర్ధరాత్రమున బడి తలుపుదీయుమనెను. కాని యామె తీయలేదు. ఆదుర్మార్గుడు తలుపును బద్దలుగొట్టుచుండెను. అంతట నాయనాథ కేకలుపెట్టెను. కాని పైవారు వచ్చునంతలో నప్పాపాత్ముడు లోనప్రవేశించి యామెపైఁబడెను. సుఖదేవి తనపడకదగ్గరనున్నదుడ్డుకఱ్ఱను చప్పున నందుకొని తురకవాని తలపై నొక్కటేపెట్టుపెట్టెను. వాడాదెబ్బతో గిరగిరదిరిగి కొంతదూరమున బొలములో నేలగూలెను. ఆవెనుక కేసువిచారణవార్తలు మనకువలదు. కాని చివర కాయమ నిర్దుష్టయని విడువబడినది. జ్యూరీలోనున్న యొకమహమ్మదీయుడు తక్కినవారితో నేకీభవించుటయేకాక "సుఖదేవి తనమానము చెడనున్న క్లిష్టస్థితియందు దద్దమ్మవలె నూరకొనక తన వీర్యసాహసములను వెల్లడించి కాలయమునివంటి కఱకుతురకను గడతేర్చినందుల కామెకు బహుమానమియ్యవలె"నని కోర్టులోబలికెను. మానసంరక్షణార్థము మహిషాసురమర్దనియైన ఈయమ వీర్యతేజస్సులు ప్రత్యేకము ప్రశంసింపదగినవి.

హరిజనోద్యమము: శ్రీపాపాయమ్మగారి త్యాగము:—

హరిజనోద్యమవ్యాప్తికి స్త్రీలు కొంతవఱకు నిరోధకురాండ్రుగ నున్నారనుట మననాయకులకు పరిపాటియైనది. కాని ఇది సత్యదూరమనుటకు ఒక నిదర్శనమీయగలుగుటకు మేము సంతోషించుచున్నాము. ఆంధ్రదేశమున సంఘసంస్కరణకు ఆరంభసీమయగు రాజమండ్రియొద్ద కోటిలింగాలలో హరిజనులకై యొకశ్రీరామమందిరము నిర్మింపబడినది. దానిప్రతిష్ఠకగు వ్యయమంతయు భరించినవారు కరుణామయాత్మకలగు శ్రీగం॥స॥ శ్రీపాద పాపాయమ్మగారు—శుద్ధశ్రోత్రియకుటుంబములను బుట్టిమెట్టినయిల్లాలు—బ్ర॥శ్రీ॥కల్లూరి వెంకట్రామశాస్త్రిగారితోబుట్టువు. ఇట్టి శ్రోత్రియస్త్రీయందుగూడ నిట్టి నూత్నసంస్కరణాభిలాషపుట్టుట సంస్కారావరోధమునకు స్త్రీలును లోగుదురనుటకు తార్కాణమైయున్నది.

EDITED, PRINTED AND PUBLISHED YB
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.